http://neetikathalu.wordpress.com

# నీతి కథలు

*మన భారతీయ సంస్కృతికి సవినయ నివాళి*

వివిధ పురాణేతిహాసముల నుండి సంగ్రహించబడిన నీతికథలు

**మా అమ్మమ్మగారైన మద్దూరి సరస్వతి గారికి శ్రద్ధాంజలి**



**వెల: అమూల్యము**

(ఈ పుస్తకమును అమ్మరాదు. ఉచితముగా అందరికీ అందుబాటులో ఉండాలని మాకోరిక)

**కవిసమ్రాట్ శ్రీవిశ్వనాథులవారు అన్నట్టు:**

ఈ సంసార మిదెన్నిజన్మలకు నేనీ మౌనివాల్మీకి భా
షాసంక్రాంతఋణంబుఁ దీర్పఁగలదా! సత్కావ్యనిర్మాణరే
ఖాసామగ్రి ఋణంబుఁ దీర్పఁగలదా? కాకుత్థ్సుఁడౌ స్వామి గా
థాసంపన్నము భక్తిఁదీర్చినను ద్వైతాద్వైతమార్గంబులన్

ఒక్క వాల్మీకి కాక వేఱొక్కఁ డెవఁడు
సుకవిశబ్దవాచ్యుం డిఁక గుకవినింద
యప్రశస్తపథంబుగా నవుటఁ జేసి
మునిఋణముఁ దీర్ప నీ కావ్యమును రచింతు

# ముందు మాట

శ్రీకృష్ణ పరమాత్మ బోధించినట్టు "ఆచార ప్రభవో ధర్మః" అన్నది మన భారతీయుల సిద్ధాంతము. అంటే ఆచరణతోనే (ప్రచారముతో కాదు) ధర్మవర్ధనము జరుతుందని భావము. మన పెద్దలు సంస్కృతి ఆచార సాంప్రదాయాలనే పేరుతో మన దైనందిన దినచర్యలలో ఈ ధర్మసూక్ష్మాలను నిక్షిప్తం చేసినారు. దీని వలన ప్రతి భారతీయుడు అతి సులభముగా ఏది ధర్మం ఏది అధర్మం అని ఎఱిగి ప్రవర్తించుటకు వీలు ఉన్నది. కాని దురదృష్ట వశాత్తు పడమటిగాలుల ప్రభావం వలన మన సంస్కృతి సాంప్రదాయాల మీద మనకే హీనభావము ఏర్పడినది. మఱచిన భారతీయతను గుర్తుచేసే విధముగా ఈ పుస్తకములోని కథలు మన పురాణేతిహాసాల నుండి కూర్చబడినవి. ప్రతి కథలోను నీతికి ప్రాధాన్యం ఇవ్వబడినది. మన ప్రాచీన గ్రంథాలు చదవాలనే జిజ్ఞాస కలిగించటం మా మరొక ఉద్దేశ్యము.

పాఠకులకు వీలుగా ఉండటానికి ఈ కథలను రెండు భాగములుగా విభజించినాము. ప్రథమ భాగములోని కథలు సామ ఉపాయముతో ఇది మంచి ఇలా ఉండాలని బోధిస్తాయి. రెండవ భాగములోని కథలు మంచి చేస్తే మనకు మంచి జరుతుందని చెడుచేస్తే దుఃఖములు తప్పవని దాన-దండ ఉపాయాలతో నీతిని బోధిస్తాయి.

భారతీయ సంస్కృతి సాంప్రదాయాలను కాపాడుకుంటూ వచ్చి ఆ అనంతనిధిని మాకందించిన పెద్దలందఱి ఆశీర్వాదములతో వ్రాసిన ఈ కథలు చిన్నారులను అలరింపచేస్తాయని మా విశ్వాసము.

# విషయ సూచిక

## వినయం వివేక లక్షణమ్

శ్రీమద్రామాయణం లోని కథ

పరమాత్ముడైన శ్రీ రామ చంద్రుడు అమిత పరాక్రమశాలి మహావీరుడు ధనుర్విద్యానిపుణుడు. శ్రీ రాముడు బ్రహ్మర్షి అగు వసిష్ఠ మహర్షి వద్ద సకల శాస్త్రములు ధనుర్విద్య అభ్యసించినాడు. గాయత్రీ మంత్రద్రష్ట అగు విశ్వామిత్ర బ్రహ్మర్షి వద్ద బల అతిబలాది విద్యలు మఱియు ఎన్నెన్నో అతి రహస్యములైన అస్త్రములను నేర్చినాడు. ఈ అస్త్రములు కేవలము విశ్వామిత్రులవారికే తెలియును. ఇదియే కాక పరమపూజనీయుడగు అగస్త్య మహర్షి శ్రీ రామ చంద్రునకు దివ్య ధనువు అక్షయ తూణీరము రత్నఖచిత ఖడ్గమును ప్రసాదించెను.

ఒక్క బాణముతో శ్రీ రామ చంద్ర మూర్తి మహాబలశాలియైన తాటకను నేలకూల్చెను. ఒకేసారి మానవాస్త్రము ఆగ్నేయాస్త్రము ప్రయోగించి సుబాహుని సంహారము చేసి మారీచుని నూరుయోజనముల దూరములో పడవేశను. మహాభారవంతమైన శివచాపమును అవలీలగా ఎత్తి ఎక్కుపెట్టిన అది విఱిగెను. శ్రీ రాముడొక్కడే ప్రహరార్ధకాలములో (90 min.) ఖర త్రిశిర దూషణాదులను వారి పధ్నాలుగు వేలసేనలను సంహరించెను.

ఇంత ప్రతాపవంతుడైనప్పటికీ శ్రీ రాముడు ఎప్పుడూ తనకుతానుగా బలప్రదర్శనము చేయలేదు. ఆ దయార్ద్ర హృదయుడు సర్వదా వినయవంతుడై వర్తించెను. దీనికి తార్కాణము సముద్రుని గర్వభంగ ఘట్టము. శ్రీ రాముని సైన్యము సముద్ర లాంఘనము చేయుసమయము వచ్చెను. సర్వజ్ఞుడైన రాముడు ఉపాయము ఎఱిగియు సహజ వినయవంతుడగుటచే పరమభాగవతోత్తముడైన విభీషణుని సలహా అడిగెను. విభీషణుడు ఇట్లు పల్కెను "ఓ రఘునాయకా! మీ బాణమొక్కటే కోటి సముద్రములనైనను శుష్కింప చేయగలదు. అయినను సముద్రునే ఉపాయమడుగ ఉత్తమమని నా యోచన".

రావణుడు తనను వివాహమాడమని హెచ్చరించి సీతమ్మవారికి నెల రోజుల గడువు ఇచ్చెను. భరతుడు పదునాలుగేండ్లపై ఒక్క నిమిషము కూడా శ్రీ రామునికి దూరంగా ఉండజాలక శ్రీ రాముడు ఆలస్యమైన పక్షంలో శరీరత్యాగం చేసెదనని ప్రతిజ్ఞబూనెను. ఈ రెండు కారణముల వలన శ్రీ రాముని వద్ద అప్పటికి పట్టుమని 30 రోజులుకూడాలేవు. అయినను రఘురాముడు తన బలప్రదర్శనము చేయక వినయముతో సాగరుని ప్రార్థింప నిశ్చయించెను.

శ్రీ రాముడు ఉదధిని సమీపించి సముద్రునకు శిరసా ప్రణమిల్లెను. పిదప తీరమున దర్భలు పరచి ఆ దర్భాసనం పైన కూర్చుని తదేక దృష్టితో సముద్రుని ప్రార్థించెను. ఇట్లు 3 దివసములు సముద్రునికై ప్రార్థించినను ఆ సముద్రుడు రాడాయె. చివరకు శ్రీ రాముడు "ఈతనికి సామముగా చెప్పిన వినడాయె. ఇటువంటి వారికి దండోపాయయే సరియైనది" అని సముద్రునిపై అస్త్రం సంధించెను. శ్రీ హరి కోపమును భరింపగలవారెవ్వరు? వెంటనే సముద్రుడు ప్రత్యక్షమయ్యెను. అంత దయాళువైన శ్రీ రాముడు సముద్రుని క్షమించి తాను ఎక్కుపెట్టిన అమోఘ బాణము దేనిమీద ప్రయోగింపవలెనని అడిగెను. సముద్రుడు ఉత్తరాన దుష్టులైన కాలకేయ రాక్షసులు ఉన్నారని సూచించెను. అంతట శ్రీ రాముడు ఆ అస్త్రముతో ఆ రాక్షసుల సంహారముచేసి ఆ కాలకేయులుండే పర్వతం ఔషధాలకు నిలయమై ప్రజాహితం చేకూర్చునని ఆశీర్వదించెను.

**పిల్లలూ! మనం ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. శ్రీ రాముడు ఎంత బలశాలి అయిననూ సముద్రునిపై బలప్రదర్శనము చేయక వినయముతో ప్రార్థించెను. వినయము సజ్జనుని భూషణము.

౨. మనకు ఉపాయము తెలిసినను తోటివారిని గౌరవించి వారి సలహా తీసుకుని ధర్మసమ్మతమైన పని చేయుట ఉత్తమ పురుషుని లక్షణము. అందుకనే శ్రీ రాముడు విభీషణుని సలహా అడిగెను.

౩. దయాగుణం ఉత్తమగుణము. సముద్రుడు తనకు చేసిన అపకారమును మన్నించి శ్రీ రాముడు అతనిని కాచెను.

౪. సజ్జనులు అప్రయత్నంగానే లోకహితం చేస్తారు. వారు ఏది చేసినా అది లొకహితమే అవుతుంది. శ్రీ రాముడు సముద్రుని పై కినుకబూని అస్త్రం సంధించినా అది చివరకు కాలకేయులను సంహరించి లోకహితం చేసింది.

## సంతృప్తిని మించిన సంపద లేదు

శ్రీమద్భాగవతము లోని కథ

సుదాముడు శ్రీ కృష్ణ పరమాత్మకు బాల్యస్నేహితుడు సహాధ్యాయి. ఈతడు భూసురోత్తముడు విరాగి బ్రహ్మవేత్త జితేంద్రియుడు ఉత్తముడు అన్నిటినీమించి శ్రీ కృష్ణునికి ఆప్తుడు. కాని సుదాముడు చాలా బీదవాడు. చినిగిన బట్టలు కట్టుటచే ఈతనికి కుచేలుడన్న పేరువచ్చెను. అయిననూ కుచేలుడెన్నడూ తనకు ధనములేదని విచారించలేదు. దీనునివలె యాచనచేయలేదు. దైవప్రేరణచే తనకు కలిగినదానితో సుఖముగా జీవించుచుండెను. సదా బ్రహ్మనిష్ఠ యందుండెడివాడు. సంతృప్తి లేని యెంత ధనవంతుడైననూ దరిద్రుడని సంతృప్తి ఉన్న ఎంత బీదవాడైననూ ధనవంతుడే అనిన సత్యమెఱిగినవాడు.

సుదాముని సతి వామాక్షి. ఈమె పతివ్రతాశిరోమణి. అర్థాంగి అన్న పేరు సార్థకం చేసుకొన్నది. ఒకనాడు సుదామునితో ఇట్లాఅన్నది "నాథా! అవంతీపురమున పరమాత్మ మీరు సాందీప మహర్షి వద్ద సహాధ్యాయులు. శ్రీ కృష్ణస్వామి మీకు ఆప్తులు కూడా. పరమాత్ముని దర్శించిన వారికి సకల క్లేశములు తొలగును కాదా. ఒకపర్యాయము ఆయన కడకు వెళ్ళిరాకూడదా?" అని ఆవేదనను వ్యక్తపఱచినది. తన అర్థాంగి చెప్పిన హితవాక్యాలు విని సుదాముడు "వామాక్షీ! ఆ పరంధాముని దర్శనము నాకు లభించునా? అయిననూ ఫలాపేక్షరహిత చిత్తముతో ఆ భగవానుని దర్శనమునకు పోయెదను. మన హితము ఆ సర్వజ్ఞుడే చూసుకొంటాడు. నేనునూ నా స్నేహితున్ని చూడాలని చాలా రోజులగా అనుకొంటున్నాను. దైవసన్నిధికి ఏగునపుడు రిక్తహస్తాలతో పోరాదు. నాలుగుగుప్పెళ్లు అటుకులు దొరకునేమో చూచి రమ్ము". వామాక్షి భర్త అంగవస్త్రంలో అటుకులు కట్టి పంపింది.

పరమాత్మ దర్శనానికి ఉవ్విళులూరుతూ సుదాముడు త్వర త్వరగా నడచి ద్వారకను చేరెను. శ్రీ కృష్ణుడే మందిరములోనున్నాడని ద్వారపాలకులను ప్రశ్నించెను. వారు అన్ని మందిరములలో నుండునని చెప్పిరి. పదహారువేలయెమినిది మంది భార్యలున్నాకూడా ప్రతి ఇల్లాలి మందిరంలో తానే ఉండి శ్రీ రామావతారంలోని ఏకపత్నీవ్రతం అనే ఆదర్శాన్ని నిజం చేసిన శ్రీ కృష్ణస్వామి లీలకు వందనం చేసి సుదాముడు ఒక అంతఃపురం వద్దకొచ్చాడు. అది రుక్మిణీ దేవి మందిరం. సుదాముడు వచ్చాడని తెలియగానే శ్రీ కృష్ణుడు పరుగెత్తి సింహద్వారము కడకేగి ఆనందపారవశ్యంతో సుదాముని కౌగిలించుకొనెను. ఇరువురి కన్నులనిండా ఆనందభాష్పాలు జాలువారాయి. శ్రీ కృష్ణుడు సుదాముని హస్తం పుచ్చుకుని స్వయంగా అంతఃపురం లోనికి తీసుకు వెళ్ళాడు.

రుక్మిణీ దేవి స్వర్ణకలశముతో పవిత్రోదకం తెచ్చింది. శ్రీ కృష్ణుడు తన హస్తములతో సుదాముని పాదములు కడిగి ఆ నీళ్ళు తన శిరమున చల్లుకొన్నాడు. “అతిథి దేవోభవ” అని లోకానికి చాటడానికి శ్రీకృష్ణుడలా చేసెను. అది చూచినవారంతా ఆ జలమును తమ శిరములపై చల్లుకొన్నారు. ఆ తరువాత శ్రీ కృష్ణుడు తన పర్యంకంపై సుదాముని కూర్చుండబెట్టి యథావిధి అతిథి సత్కారము చేసెను. మృష్టాన్నములతో భోజనము పెట్టెను. పరమాత్మ తనకు సేవ చేయుట చూడలేక సుదాముడు శ్రీ కృష్ణ స్తుతి చేసెను. తరువాత ఎంతోసేపు వారు ప్రియభాషణములాడిరి. శ్రీకృష్ణుడు సుదాముడు తెచ్చిన అటుకులు తిని "ఇట్టి అటుకులు నా చిన్నతనమున మా అమ్మ నాకు తినిపించేది. మరల ఇప్పుడే తినుట" అని అన్నాడు. మఱునాడు సుదాముడు తన గృహమునకు మఱలెను. శ్రీ కృష్ణుడు సుదామునికి ఘనముగా వీడ్కోలిచ్చెను.

సుదాముడు ఎంత కష్టాలలో ఉన్నా తనను ఏమీ అడుగకుండా వెళిపోవటం చూసి శ్రీ కృష్ణుడు సుదాముని సంతృప్తికి భక్తికి మెచ్చి సుదామునికి అనంత సంపదనిచ్చెను. సుదాముడు దారి అంతా శ్రీ కృష్ణుని తలచుకుంటూ తన ఇల్లు చేరెను. శ్రీ కృష్ణుని దయవల్ల తనకు సకల సంపదలు వచ్చెనని తెలుసుకొనెను. సుదాముడు వామాక్షి ఆ సంపద తమదికాదని తలచి బీదసాదలకు దానములు చేసిరి. ఎన్నెన్ని దానములు చేసినా ఆ అనంతనిధి కరఁగలేదు. అలా అనంత పుణ్యాన్ని ఆర్జించి ఆ దంపతులు కడకు కైవల్యమును పొందిరి.

**పిల్లలూ! మనం ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. సంతృప్తి లేనివాని జీవనం దుఃఖమయం. సంతృప్తి ఉన్న ఎంత బీదవాడైనా ధనవంతుడే. అడిగే అవకాశమున్నా తనకున్నదానితో తృప్తిగా ఉన్న సుదాముని మెచ్చి శ్రీ కృష్ణపరమాత్మ సుదామదంపతులకి మోక్షాన్ని ప్రసాదించాడు.
౨. స్నేహం యొక్క ఔన్నత్యం ఈ కథలో మనకు బాగా తెలిసింది. ఒక సత్పురుషుని స్నేహం కన్నా ఎక్కువైన ధనం ఏదీలేదు. సుదాముడు శ్రీ కృష్ణుల స్నేహం అద్వితీయం. శ్రీకృష్ణుని చెలిమి సాటిలేని కలిమి.
౩. ఒక అతిథి పైగా పండితుడు వచ్చినప్పుడు వానిని ఎలా సేవించాలో శ్రీ కృష్ణుడు ఈ కథలో మనకు చూపినాడు. సకల జీవరాశికి మోక్షప్రదాత అయిన శ్రీ కృష్ణుడు సుదాముని కాళ్ళుకడిగి ఆ నీళ్ళు తన నెత్తిన చల్లుకొన్నాడు.
౪. నిష్కల్మష భక్తి ఎలావుండాలో సుదాముడు మనకు చూపినాడు. నాకే కోరికాలేదు. నాకేది మంచిదో నీకే తెలుసు అనే నమ్మకం భగవంతుని మీద ఉండాలని సుదాముడు చెప్పినాడు.

## ఆశ్రయ పరిత్యాగ దోషము

శ్రీ స్కాంద పురాణము లోని కథ

ఒకసారి బ్రహ్మదేవుని ఉపదేశంపై ఇంద్రాది దేవతలు మహర్షులతో కలిసి విష్ణు అవతారమైన వామన మూర్తి తోసహా లక్ష్మీకటాక్షం కొఱకు తీర్థయాత్రలకు బయలుదేరారు. అట్టి మహనీయులు దర్శింప కోరిన పుణ్యక్షేత్రాలు తీర్థాలు ఉన్న మన భారతదేశం ధన్యము. అట్టి అమ్మ కడుపున పుట్టిన మనము ధన్యులము.

మహదానందంతో వారెన్నో తీర్థాలు దర్శించినారు. ఒకచోట బాగా ఎండిపోయిన వృక్షం ఒకటి వారికి కనబడింది. ఆ చెట్టు తొఱ్ఱలో ఓ శుష్కించిన చిలుక కాపురమున్నది. అది చూచి ఇంద్రాది దేవతలు "ఓ శుకవరా! ఈ వృక్షం బాగా శుష్కించియున్నది. పూలూ ఆకులు పండ్లు ఏమీ లేకుండా ఉన్నది. ఐనను నీవెందులకు ఈ వృక్ష ఆశ్రయాన్ని విడువలేదో తెలుసుకోవాలని ఉన్నది మాకు" అని అడిగినారు. చిలుక ఇలా బదులిచ్చింది

"ఓ దేవతలారా! ఇది చాలా పురాతనమైన వృక్షం. ఇది ఓ కల్పవృక్షం. అమృత మాధుర్యంగల దీని ఫలములు భుజించి నేను చిరకాలం జీవించాను. కాలగమనం వల్ల ఈ కల్పవృక్షం ఈనాడు ఇలాగున్నది. కాలగతిని ఆపడం ఎవరి తరము? ఒకప్పుడు నాకు ఆశ్రయమిచ్చి నన్ను ఎండ వాన

నుండి కాపాడి నాకు మంచి ఆహారం ఇచ్చిన ఈ వృక్షమును నేనీనాడు శుష్కించినదని విడనాడలేను. అట్లు చేసిన అది కృతఘ్నత అవుతుంది. కృతఘ్నతకు మించిన మహాపాపం మరొకటి లేదు కదా! నిజాశ్రయమైన ఈ కల్పవృక్షమే నాకు సర్వలోకాలున్నూ".

ఇలా ధర్మం మాట్లాడిన శుకరాజుని చూచి దేవేంద్రుడిలా అన్నాడు "ఓ శుక రాజమా! నీకు ఇంతటి విజ్ఞానం ధర్మం ఎలా తెలిసినాయో వినాలని ఉంది మాకు". అప్పుడు చిలుక ఇలా చెప్పింది "నేను ఎన్నడూ మిత్రద్రోహం చేయలేదు. తల్లిదండ్రులయందు అనురాగం కలవాడను. నా భార్యను బాగా చూసుకుంటాను. నాతో సహజీవనం చేస్తున్నవారిని ఎన్నడూ అవమానించను. ఈ కారణాలవలన నాకు నిర్మలజ్ఞానం కలిగింది".

చిలుక మాటలకు సతోషించి దేవేంద్రుడు తన అభీష్టం కోరుకోమని అడిగాడు. "అయ్యా! నేను ఏ లోకాలనీ కోరను. నాకు ఈ వృక్షమే కైవల్యం. అయుతే నాకు ఈ చెట్టు ఇవ్వడమేకాని నేన్నడును దీనికేమీ ఇవ్వలేదు. ఈ చెట్టుని మళ్ళీ సజీవంగా చేయండి" అని శుకము బదులిచ్చింది. దేవేంద్రుడు చిలుక యొక్క సద్భావాన్ని కృతజ్ఞతాభావాన్ని మెచ్చి ఆ కల్పవృక్షాన్ని సర్వగుణాన్వితంగా చేశాడు. ఇలా ఆ శుకరాజమును ఆశీర్వదించి అందరు తీర్థయాత్రలు కొనసాగించి చివరకు లక్షీకటాక్షం సంపాదించారు. తన నిజాశ్రయాన్ని పరిత్యజించని చిలుకకు తన ధర్మవర్తనం వలన కడకు బ్రహ్మలోకం ప్రాప్తించింది.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమారు చూద్దాము:**
మనకు నీడనిచ్చిన ఇంటిని మనకు అన్నంపెట్టిన నేలతల్లిని (దేశాన్ని) ఎన్నడూ పరిత్యజించకూడదని ఈ కథ మనకు చెబుతున్నది. అట్లు త్యజించినవాడు కృతఘ్నుడౌతాడని శుకరాజం చెప్పింది. అలాగే మనం మనకు ప్రత్యక్షంగా పరోక్షంగా సహాయపడ్డ వారందరితో కృతజ్ఞతా భావంతో మెలగాలని శుకరాజు మనకు చెప్పాడు.

## కపోత కపోతి కథ

శ్రీమహాభారతం లోని కథ

అడవిలో వేటకోసం వెళ్ళిన ఓ బోయవాడు కుండపోతగా వర్షం పడటంతో ఓ చెట్టు నీడలో ఆశ్రయం తీసుకున్నాడు. ఆ చెట్టు మీద ఓ పావురాల జంట కాపురముంటున్నాయి. పొద్దుననగా వెళ్ళిన కపోతి తిరిగి రాకపోవడంతో ఎంతో దిగులుగా ఉన్నది కపోతం. ఆ పావురం అలసి ఉన్న బోయవాడిని చూసింది. పక్కనే ఉన్న వలను వేట సామాను చూసి భయపడింది. "ఎప్పుడో పొద్దుననగా వెళ్ళింది. ఎక్కడున్నదో ఎలాగున్నదో? నా ప్రాణేశ్వరికి ఎట్టి ఆపద సంభవించలేదు కదా? అది లేని నా జీవనం శూన్యం శోకమయం. నా హృదయేశ్వరి ఏ బోయవాడి చేతులలోనో చిక్కలేదు కదా" అని బాధపడింది. ఇంతలో వాన తగ్గుముఖం పట్టిందికానీ చలి మృత్యుదేవతలా ఆ వనాన్ని కబళించింది. పావురం యొక్క శోకం విని ఆడ పావురం "ఇక్కడ ఈ బోయవాడి వలలో ఉన్నాను ప్రాణనాథ"! అని అన్నది. "హతవిధీ! ఈ వలలో చిక్కుకున్నావా" అని బిగ్గరగా ఏడ్వసాగింది మగ పావురం.

"శరీరాలు శాశ్వతాలు కావు. మంచి ఒక్కటే మిగిలివుండేది. ఎల్లప్పుడూ మనకు తోడువుండేదదే. ఆర్తుడైనవాని శరణుజొచ్చిన వాని కాపాడటం కంటే గొప్ప ధర్మం లేదని పెద్దలంటారు. పాపం! ఈ బోయవాడు ఆర్తుడై మన గూటి దగ్గరకు వచ్చాడు. నా గురించి విచారణ మాని అతిథి ఐన ఈతని సంగతి చూడు" మని ఆడ పావురం అమృత వాక్యాలు పలికింది.

వెంటనే ఆ బోయవాని ముందు నిలిచి ఆ కపోతశ్రేష్ఠుడిలా అన్నాడు "అయ్యా! నీవు బాగా అలసినట్టున్నావు. నేనేమి సేవ చేయగలనో చెప్పండి". బోయవాడు "ఓ పావురమా! నీవెంత దయగలదానవు! చలితో నా శరీరం గడ్డకట్టుకు పోతున్నట్టుంది. ఈ చలినుండి నన్ను కాపాడు" అన్నాడు. పావురం వెంటనే గూటిలో దాచుకున్న ఎండు పుల్లలు తెచ్చి చలిమంట చేసింది. ఆ పావురం చేసిన సహాయానికెంతో సంతోషించి ఆ బోయవాడు చలి కాచుకున్నాడు. చలి తగ్గిన బోయవాడు "గువ్వా! ఎంతో ఆకలిగావుంది" అన్నాడు. కొంతసేపాలోచించి "అయ్యా! పక్షుల దగ్గర దాచిపెట్టుకునే ఆహారం ఉండదుకదా. ''పరోపకారార్థం ఇదం శరీరం'' అని మా పెద్దలు చెప్పారు. నా శరీరాన్ని తప్ప నేనేదీ ఇవ్వలేను. దీన్ని తీసుకుని మీ క్షుద్బాధ తీర్చుకోండి" అని బోయవాడు ఆశ్చర్యపోయి చూస్తుండగా ఆ అగ్నికి ప్రదక్షిణం చేసి అందులో దూకింది పావురము.

ఆ దృశ్యం చూసి బోయవాడికి జ్ఞానోదయం అయ్యింది. "ఆహా! ఈ పావురము ఎంత గొప్పది! నా ఆకలి తీర్చుటకు తన శరీరాన్ని భార్యాపిల్లల్ని ప్రలోభాన్ని విడిచి శరీరం తృణప్రాయంగా ఎంచి ఆహుతిచ్చింది. ఏమి త్యాగం! ఏమి దయ! రూపంలో చిన్నదే ఐనా గుణంలో మేటిది. ఇక నేను హింస చేయను. మోహం విడుస్తాను" అని అనుకున్నాడు. వలలోని పక్షులన్నిటినీ విడిచి పెట్టాడు. వెంటనే అగ్ని దగ్గరకు వెళ్ళి ఆ ఆడ పావురం ఇలా ఏడ్చింది "నీవు లేనిది క్షణమైనా మనజాలను. నాకెవరు దిక్కు? బ్రతుకులోను మరణంలోను నీతోనే ఉంటాను". అగ్నిప్రదక్షిణం చేసి శరీరత్యాగం చేసింది ఆ కపోతి. ఇంతలో ఓ దివ్య విమానము వచ్చి ఆ పావురాల జంటను ఊర్ధ్వలోకాలకు తీసుకొని వెళ్ళడం పూర్వ జన్మసుకృతం వలన ఆ బోయవాడు చూడగలిగాడు. కడకు ఆతడూ దివ్యత్వం పొందాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమారు చూద్దాము:**
దయ కరుణ పరోపకారం త్యాగం అనే పదాలకు నిర్వచనం చెప్పాయి పావురాలు. తనకు హాని చేసిన వేటగాడి సైతం కాపాడమని "అపకారికి ఉపకారము నెపమెన్నక సేయువాడె ధన్యుడు సుమతీ" అని హితబోధ చేసింది. ఆకలిగొన్న వాడికి తన శరీరాన్నే ఆహారంగా సమర్పించిన పావురం యొక్క త్యాగం అద్వితీయం.

## వితరణశీలి విక్రమార్కుడు

విక్రమార్కుని సాహసగాధలలోని కథ

విక్రమార్కుని ధైర్యసాహసాలు దానపరోపకారగుణాలు త్యాగనిరతి పేరుప్రతిష్ఠలు దిగ్దిగంతాలకు వ్యాపించినాయి. ఒకరోజు అవంతీరాజు ఒక భట్రాజు పద్యాల ద్వారా విక్రమాదిత్యుని గుణగణాలను విన్నాడు. ఇంత నీతిమంతుడు సత్యనిష్ఠుడు గుణాగ్రగణ్యుడు లోకంలో ఉంటాడా? అని అశ్చర్యమేసింది ఆయనకు. విక్రమార్కుని మీద కించిత్ అసూయపడి "నాకు విక్రమార్కుడంత కీర్తిప్రఖ్యాతులు ఎలావస్తాయి?" అని విచారించసాగినాడు. అదే ఆలోచిస్తూ పరాకుగా ఉండటం మొదలుపెట్టాడు.

ఒకరోజు అవంతీరాజు వద్దకు ఒక సన్యాసి వచ్చాడు. యథావిధిగా అతనిని పూజించి రాజు "స్వామి! విక్రమార్కుని గుణగణములు నేను ఒక భట్రాజు ద్వారా విన్నాను. ఆ విక్రముడంతటివాడు మీ భూమిమీదు లేడు. అట్టి యసస్సు నాకెలా వస్తుందో చెప్పండి" అని ప్రార్థించాడు. సన్యాసి "రాజా! నీకొక సూక్ష్మోపాయం చెబుతాను. హిమవన్నగర సమీపములో ఒక కాళికాలయం ఉన్నది. సిద్ధప్రదేశమైన ఆ ఆలయం వద్ద కొందరు యోగపురుషులు హోమక్రియలు చేస్తుంటారు. నీవక్కడికి వెళ్ళి పుష్కరిణిలో స్నానం చేసి శుచివై ఆలయప్రాంతంలోకి ప్రవేశించు. గుండమొకటి త్రవ్వి కాళికాదేవికై హోమముచేసి చివరికి గుండములో దూకి నిన్ను నువ్వే పూర్ణాహుతి చేసుకో. దయాసాగరులైన ఆ యోగపురుషులు నిన్ను రక్షిస్తారు. నీ సాహసానికి మెచ్చి దేవి కరుణిస్తుంది" అని హితము చెప్పాడు.

సదాచారుడైన రాజు అటులనే చేశాడు. ప్రత్యక్షమైన కాళికాదేవితో "ప్రతిదినమూ ఏడుకోట్ల ధనం నాకు రావాలి" అని అడిగాడు. "నాయనా! ప్రతిరోజూ నీవు హోమంచేసి పూర్ణాహుతి నిచ్చినట్లయితే నీవు కోరుకున్నట్టే జరుగుతుంది" అని దేవి చెప్పి అంతర్ధానమయినది. అవంతీరాజు యోగపురుషులకు కృతజ్ఞతలు తెలిపి నగరానికి వచ్చి దేవి ఆజ్ఞానుసారం చేసి ప్రతిరోజూ ఏడుకోట్లు సంపాదించాడు. ఆ ధనముతో ఎన్నో అద్భుతమైన దానధర్మాలు చేసి దానకర్ణుడని ప్రఖ్యాతిని పొందినాడు.

విమలుడైన విక్రమార్కుడు అవంతీరాజు యొక్క కీర్తిని విన్నాడు. తక్షణమే హిమవత్పర్వతములోని కాళికాలయానికి వెళ్ళి స్నానముచేసి శుచి అయ్యి ఆలయములో హోమముచేసి తన శరీరాన్ని పూర్ణాహుతి చేయబోగా కాళికాదేవి ప్రత్యక్షమై వరంకోరుకోమన్నది. కైలాశశిఖరమంత ఉన్నత హృదయం కల విక్రమాదిత్యుడు ఇలా కోరినాడు "గుణవంతుడైన అవంతీరాజు తన శరీరాన్ని పూర్ణాహుతిని చేయకుండానే ఆ ధనం అతనికి వచ్చేటట్టు దానితో అతడు మరిన్ని దానధర్మాలు చేసుకునేటట్టు అనుగ్రహించు తల్లీ". దేవి విక్రమార్కుని త్యాగనిరతి చూసి "తథాస్తు" అని ఆశీర్వదించింది.

ఈ విషయం తెలుసుకున్న అవంతీరాజు విక్రమాదిత్యుని వద్దకు వచ్చి "రాజా! నీ వితరణశీలత అపూర్వము అద్వితీయము. నీవంటి సౌశీల్యుడైన రాజు యీ భువిలో పుట్టబోడు" అని స్తుతించి కృతజ్ఞతలను తెలుపుకొని వెళ్ళిపోయాడు.

**పిల్లలూ! మరి మనకింతటి విశాల హృదయం వితరణగుణం ఉన్నాయా?**

## నిజాయితీ

స్వాతంత్ర్య సమరయోధులనాటి కథ

భారతదేశపు వైద్య విధానం ఆయుర్వేదం. బ్రిటిషర్లు మనదేశాన్ని ఆక్రమించి వారి వైద్యవిధానమైన అల్లోపతి ని ప్రవేశపెట్టకముందు ఆయుర్వేదం చాలా ప్రాముఖ్యంలో ఉండేది. కాని బ్రిటిషర్ల పాలనవలనో మనలో అలవాటైన బానిస భావన వలనో మెల్లిమెల్లిగా ఆయుర్వేదం యొక్క ప్రాముఖ్యత తగ్గిపోయింది. చాలామంది ఆయుర్వేదం పనికిరాదని తోసిపేశారు. అట్టి కాలంలో బెంగాలుకు చెందిన ఓ ప్రముఖ విద్యావేత్త ఆయుర్వేదాన్ని కాపాడుకోవటానికి నడుంకట్టాడు. ఆంగ్ల ఔషధాలకు దీటుగా దేశీయ ఔషధాలు తయారుచేసే ఒక సంస్థను స్థాపించాడు.

అలా ఎంతో కష్టపడి ప్రతికూలమైన పరిస్థితులలో సంస్థని నడుపుతుండగా ఒకనాడు ఆ విద్యావేత్తకు ఒక భీషణమైన సమస్య ఎదురయ్యింది. ఆ సంస్థ తయారు చేసిన ఎన్నో మందులు ఏదో కారణముగా పాడైపోయాయి. ఆ విద్యావేత్త ఎంతో దుఃఖించాడు. అతని విచారం చూసి అక్కడే ఉన్న ఓ ఉద్యోగి ఇలా పలికాడు "అయ్యా! మీరు విచారించకండి. ఇంకా ఈ మందులు పూర్తిగా పాడు అవ్వలేదు. ఇంకొన్నాళ్ళు సునాయాసంగా మనం వీటిని అమ్మవచ్చు. అట్లు చేయకున్న మనకు చాలా నష్టం వస్తుంది. ఆయుర్వేదాన్ని కాపాడుకోవాలన్న మీ ఆశయం కూడా అప్పుడు నెరవేరక పోవచ్చు".

ఇటువంటి అవినీతి భరితమైన మాటలు విని ఆ విద్యావేత్త మండిపడుతూ ఇలా జవాబిచ్చాడు "నష్టమొస్తుందని పాడైపోతున్న మందుల్ని అమ్ముతామా? అట్టి నీచమైన కార్యాన్ని నేనెన్నడూ చేయలేను. ఆయుర్వేదం ధర్మం ఉన్నచోటే ఔషధాలు పనిచేస్తాయని చెప్పింది. కనుక నా ఆశయం ధర్మస్థాపనే". అలా హితబోధ చేసి ఆ మందులన్నిటిని బయటపడ వేయించి తన ఆదర్శాన్ని కాపాడుకొన్నాడు. తరువాత ఆ విద్యావేత్త లోని నిజాయితీని అందరూ కొనియాడారు.

ఆ ప్రసిద్ధ విద్యావేత్త ఆచార్య ప్రఫుల్ల చంద్ర రాయ్. భారతీయుల యొక్క విజ్ఞానము గూర్చి ప్రపంచానికి తెలుపుతూ ఈయన ఎన్నో వ్యాసాలు వ్రాసినారు. "Chemical Knowledge of the Hindus" అనే వ్యాసం మనమందఱం చూడదగినది. ఈ వ్యాసంలో ప్రఫుల్ల చంద్ర గారు మన భారతదేశం ఆధ్యాత్మికత బోధించడంలోనే కాదు విజ్ఞాన పరంగా కూడా ఎంతో ముందున్నదని చెబుతారు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**

౧. నిజాయితీ యొక్క ప్రాముఖ్యత మనమీ కథలో తెలుసుకొన్నాము. ఎంత నష్టమైనా రాని ఏమైనా కానీ ఎన్నడు అవినీతికి పాల్పడరాదని శ్రీ ఆచార్య ప్రఫుల్ల చంద్ర రాయ్ గారు మనకు చూపించారు.
౨. మన స్వదేశీ విజ్ఞానం యొక్క గొప్పతనం చంద్ర గారి వ్యాసాల ద్వారా తెలుసుకొన్నాము.

## ధర్మజ్ఞః

శ్రీమద్రామాయణం లోని కథ

"శరణు శరణు సురేంద్రసన్నుత శరణు శ్రీసతి వల్లభా!" అంటూ భక్తశిఖామణియైన విభీషణుడు రావణునిచే తరస్కరింపబడ్డవాడై శ్రీ రామ చంద్రుని శరణువేడినాడు. విభీషణుడు తన మంత్రులతో వచ్చి ఆకాశమార్గాన నిలిచి శ్రీ రాముని శరణు కోరుచున్నాడని వానరులు వచ్చి విన్నవించారు. ఆ వార్త విని వినయకోవిదుడైన రఘురాముడు సుగ్రీవుని "మిత్రమా! నీ అభిప్రాయమేమి"? అని అడిగినాడు. రాజశ్రేష్ఠుడైన సుగ్రీవుడిలా అన్నాడు "ప్రభూ! రాక్షసులు మాయావులు కామరూపధారులు. వారి నిజస్వరూపం గుర్తించడం కష్టము. పైగా వచ్చినది సీతాపహారి ఐన రావణుని తమ్ముడు. ఈతడు బలశాలి. సాయుధులైన నలుగురు మంత్రులతో వచ్చాడు. మన రహస్యములు తెలుసుకొనుట వారి ఆంతర్యం కావచ్చు. ఇందుకని వీరిని బంధించాలని నా ఉద్దేశ్యం".

స్మితపూర్వభాషి అయిన శ్రీ రాముడు ఇట్లు ధర్మ్యము పల్కెను "సుగ్రీవా! తన భార్యను వలపన్ని పట్టిన బోయవాడు ఆర్తుడైవచ్చినప్పుడు ఆ కపోతరాజు బోయవానికి శరణమీయలేదా! (కపోత కపోతి కథ చూడండి) అదే అట్లు చేసిన ఇక మానవులైన మన సంగతేమిటి? పూర్వం కండువ మహర్షి ఈ కథను పల్కి ధర్మసమ్మతమైన గాధలు గానం చేశాడు:

దీనుడై ప్రార్థించుచు శ్రణుజొచ్చిన శత్రువునైనా చంపకూడదు. సజ్జనుడు తన ప్రాణాలనైతం ఇచ్చి శరణార్థి ఐన శత్రువు నైనా కాపాడతాడు". ఇలా కండువ మహర్షి ఆలపించిన ధర్మాలు గుర్తుచేసి రఘువరుడిలా అన్నాడు "ఎవడైనా వచ్చి నేను నీవాడను అని ఒక్క మాట అన్న చాలు వానిని సకల ప్రాణులనుండి అభయమిచ్చెదను. ఇది నా వ్రతం.

అతడే స్థితిలోనున్నను ఏ ఉద్దేశ్యముతో వచ్చినను వెంటనే అతనిని ఇక్కడకు తీసుకురండి. వచ్చినవాడు రావణుడైనా సరే వానికి శరణమిస్తాను". ఎక్కడా కనీ వినీ ఎఱుగని ధర్మజ్ఞతను శ్రీ రాముని లో చూసి వానరులు "శ్రీ రామ చంద్ర మూర్తి కీ జై" అని జయజయ ధ్వానాలు చేశారు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**
ఒకడు లోక నిందకు భయపడి రాజధర్మం పాటించవచ్చు. అలాగే సమాజధర్మం గృహధర్మం కులధర్మం పాటించటానికి ఏదో ఒక హేతువుండచ్చు. కానీ వ్రతం (నియమం) అనేది తనకు తానుగా నియమించుకున్నది. అది పాటించకపోయినా ఎవ్వరూ అడగరు. అందుకే వ్రతధర్మం పరమోత్కృష్టమ్. ఎటువంటి హేతువూ లేకుండా కేవలం ధర్మసమ్మతమైన వ్రతనియమం పాటిస్తూ శ్రీ రాముడు విభీషణునికి శరణాగతి ఇవ్వడం ధర్మవర్తనానికి పరాకాష్ఠ.

ఇదే సందేశం ధర్మరాజు కూడా ఇస్తాడు: ఒక సారి పరమసాధ్వి ఐన ద్రౌపదీ దేవి రాజసూయయాగం చేసి రాజులచే జే జే లందుకున్న ధర్మరాజు కష్టాలు పడటం చూసి బాధతో ఇలా అడిగింది "స్వామీ! మీరు ధర్మంకోసం ఇన్ని త్యాగాలు చేశారు. ధర్మం పాటించడం వల్ల మీకేమి వచ్చింది"? భారతీయుని హృదయాన్ని వ్యక్తపఱుస్తూ ధర్మరాజు ఇలా అన్నాడు:

"ద్రౌపదీ! ధర్మం ఆచరించడం నా స్వభావం. అంతే కాని ధర్మం ఏదో ఇస్తుందని నేను ఆచరించలేదు. అలాగే కనక నేను చేస్తే ధర్మంతో వ్యాపారం చేసిన వాడినౌతాను. ధర్మంతో వాణిజ్యం చేసినవాడు నీచుడు పురుషాధముడు". కనుక స్వాభావికంగా ఏ ప్రతిఫలమూ ఆశించకుండా ధర్మం పాటించాలని శ్రీ రాముడు ధర్మరాజు మనకి చెప్పారు.

## రంతిదేవుడు

శ్రీమద్భాగవతం లోని కథ

పూర్వం రంతిదేవుడను రాజేంద్రుడుండెడి వాడు. ఆతడు రాజైననూ మహాయోగి వలె విషయ వాంఛలకు లోనుగాక నిరతం హరినామ స్మరణతో కాలంగడిపేవాడు. దైవవశమున లభించినదానితోనే తృప్తిపడేవాడు. ఆ రాజు తన సంపదలను దానం ఇచ్చి ఇచ్చి బీదవాడైనాడు. కుటుంబంతో సహా చాలా కష్టాలపాలైనాడు. నలభై ఎనిమిది రోజులు అన్నము నీళ్ళు లేకుండా సకుటుంబంగా తిరుగులాడవలసి వచ్చినా గుండెదిటవు కోల్పోలేదు.

ఒకరోజు ప్రాతఃకాలమున అతనికి నెయ్యి పాయసము హల్వ నీళ్ళు లభించాయి. భోజనకాలం వచ్చాక రంతిదేవుడు సకుటుంబముగా భోజనముచేయ సిద్ధపడ్డాడు. భరింపరాని క్షుత్పిపాసల బాధతీర్చుకుందామని అనుకుంటుండగా ఓ దీన బ్రాహ్మణుడు అతిథియై వచ్చాడు. రంతిదేవుడెంతో ప్రేమతో అతని గౌరవించి హరిసమర్పణముగా ఆహారంలో అర్ధభాగాన్ని అతడికిచ్చాడు. ఆ విప్రుడు కడుపారా భుజించి సంతృప్తుడై వెళ్ళాడు.

ఇంతలో ఒక శూద్రుడు వచ్చి అన్నంపెట్టమని అడిగాడు. వచ్చిన అభ్యాగతునిలో భగవంతుడిని దర్శించి ఆదరంతో ఆ శూద్రునికి ఆహారంలో ఒకభాగాన్నిచ్చాడు రంతిదేవుడు. వాడు సంతృప్తిగా తిని వెళ్ళాడోలేదో కుక్కల గుంపుతో ఒకడువచ్చాడు. "రాజా! నేను ఈ కుక్కలు ఆకలిచే మిగుల పీడితులమై యున్నాము. మాకు సరిపోయే ఆహారము ఇమ్ము" అని వాడన్నాడు. అతడికి మిగిలిన ఆహారమంతా ఇచ్చి నమస్కరించి మంచిమాటలాడి పంపాడు రంతిదేవుడు.

ఇక రంతిదేవుని వద్ద నీళ్ళొకటి మిగిలాయి. అదీ ఒక్కడికి సరిపోయేవే ఉన్నాయి. దప్పికతో ప్రాణాలు కడగడుతున్న రంతిదేవుడు అవి త్రాగబోగా ఓ చండాలుడు వచ్చి ఇలా అన్నాడు "అయ్యా! నేను చాలా దీనుడను. చాలా దాహంగా ఉంది. నీరసముతో అడుగు ముందుకు వేయలేకున్నాను. నీవద్దనున్న నీటితో నా గొంతు తడిపి నా ప్రాణాలు నిలబెట్టు". ఆయాసంతో దాహంతో ఉన్న ఆ దీనుని చూచి "ఓ అన్నా! నావద్ద అన్నంలేదు కాని ఈ తీయ్యని నీళ్ళున్నాయి. దగ్గరకురా. నీ దాహం తీరేటట్లు త్రాగు.

ఆపదకలిగిన వారి కష్టాలు పోగొట్టి వారిని ఆదుకోవడం కన్నా పరమార్థమేమున్నది మానవులకు"? అని రంతిదేవుడన్నాడు. తన ప్రాణాలను తీస్తున్న దాహాన్ని లెక్కచేయక రంతిదేవుడు "నా జలదానంతో ఈతడి బాధ ఆయాసం దాహం తొలగితే నాకంతే చాలు. అంతా ఈశ్వరేచ్ఛ" అని ఆ చండాలుని పాత్రలో నీళ్ళు పోశాడు.

బ్రహ్మాది దేవతలు సంతోషించి రంతిదేవుని ఎదుట ప్రత్యక్షమై జరిగినదంతా విష్ణుమాయా ప్రభావం అని చెప్పారు. బ్రాహ్మణ శూద్ర చండాల వేషములలో వచ్చినది వారే అని ఎఱుక కల్గించి ఆశీర్వదించారు. రంతిదేవుడు వారికి నమస్కరించినాడు. ధీరుడైన రంతిదేవుడు వారిని ఏదీ కోరలేదు. స్థిరమైన విష్ణుభక్తులకే కోరికలుండవు కదా! కడకు విష్ణుపదాన్ని పొందాడు. ఆ రాజేకాదు ఆ రాజు కథను బాగా విని అర్థంచేసుకున్న వాళ్ళందరూ ఆతని మహిమచే యోగులై కడకు మోక్షం సంపాదించారు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**
దానము తీసుకొనువానికి హితము కలిగించు దానిని ఫలాపేక్షరహితంగా ప్రేమతో ఇవ్వడం ఉత్తమ దానం. ఇదియేకాక అడిగినవానిలో భగవంతుడిని దర్శించి తన ప్రాణాలు నిలబెట్టుకోవడానికి ఎంతో అవసరమైనది తనకు లేక పోయినా ఇచ్చివేసిన రంతిదేవుడు ధన్యుడు.

## కుశిక మహారాజు కథ

శ్రీమహాభారతం లోని కథ

ఒకసారి మహాతేజోమయుడైన చ్యవన మహర్షి కుశిక మహారాజును పరీక్షించుటకు ఆయన కడకు వచ్చెను. వచ్చుచున్న చ్యవన మహర్షిని చూచి కుశికుడు ఎదురేగి అర్ఘ్యపాద్యాదులిచ్చి "మహాత్మా! మీ రాకతో మా నగరము పావనమైనది. ఏదో బలీయమైన కారణముంటేగాని మీ వంటి తపోధనులు రారు. మీ అభీష్టమేమో సెలవీయ్యండి. మీకు సేవచేసే భాగ్యాన్ని మాకు ప్రసాదించండి" అని అర్థించాడు. చ్యవనుడు "రాజా! నీ వినయవిధేయతలకు మెచ్చితిని. నీకడ కొన్నాళ్ళు ఉండవలెనని వచ్చితిని. నాకేలోటు రాకుండా నీవు నీ భార్య నాకు పరిచర్యలు చేయాలి. నా కోరిక తీర్చగలవా?" అని అన్నాడు. సాధు సజ్జన సేవే మహాభాగ్యమని కుశికుడు చ్యవనుడుండడానికి హృద్యమైన మందిరం చూపించాడు.

రాజదంపతులు చ్యవనుడు ఆ సాయంకాలం ఆహ్నికాలు దేవతార్చన చేసుకొన్నారు. తరువాత మునీశ్వరునకు మృష్టాన్నమిచ్చి సంతృప్తి పఱచినాడు కుశికుడు. భోజనానంతరము చ్యవనుడు "రాజా! నేనిక నిద్రిస్తాను. నీవు నీ భార్య నిద్రాహారాలు మాని నా పాదసేవ చేయండి. నా అంతటనేను లేవనంతవరకు నన్ను లేపకండి" అని యోగనిద్రలోకి వెళ్ళిపోయాడు చ్యవనుడు. మహర్షి పాదసేవే మహాభాగ్యం అని కుశికుడు అతని అర్ధాంగి ఏకాగ్రచిత్తంతో పాదసేవ చేయసాగారు.

ఇలా 21 దివసములు గడిచాయి. మఱునాడు చ్యవనుడు మేల్కొని ఏమీ మాట్లాడకుండా అంతఃపురం వదలి నడువసాగాడు. ముని వెంటపోయిన రాజదంపతులను తన మాయతో భయభ్రాంతుల్ని చేశాడు. మరల నిదుర పోయాడు. కుశిక దంపతులు యథావిధిగా పాదసేవ చేశారు. మళ్ళీ 21 దినములు కడచెను. ఆ తరువాత "రాజా! నేను రథమెక్కి యాచకులకు సువర్ణము రత్నములు గోవులు అశ్వములు దానమిచ్చుచుందును. మీరిద్దరు నా రథమును గుఱ్ఱములకు బదులుగా లాగవలెను" అన్నాడు. కుశికుడు ముందర రాణి వెనుక ఉండి రథములాగినారు. చ్యవనుడు మునికోలతో రక్తంవచ్చేటట్టు వారిని కొట్టుచు యాచకులకు వస్తువులిచ్చుచూ రథంమీద వెళ్ళాడు. రథం ఊరి చివరికి వెళ్ళాక ముని రథము దిగి ఏమాత్రమూ చలించని రాజదంపతులని చూశాడు. కుశికుడు అతని భార్య మనస్సులలో కొంచెంకూడా కోపంగానీ విసుకుగానీ మరి ఏ వికారము కానీ లేవు. వారి నిర్మల హృదయం ఆశ్చర్యంతో చూసి ముని వారి శరీములు తాకి ఇలా అన్నాడు "రాజా మీరింక వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. ఱేపు గంగాతీరం వద్దనున్న వనానికి రండి".

వారి శరీరముల పైని గాయాలు అన్ని మాసిపోయాయి! కుశికుడు "మహాత్మా! నీ చర్యలు అద్భుతాలు. మాకే శ్రమ లేదు. మీబోటి మహనీయుల మహిమ ఎఱుగుట ఎవరి తరము"? అని అన్నాడు. మఱునాడు చ్యవనుడు చెప్పిన ప్రదేశానికి కుశికుడు అతని భార్య వచ్చారు. అక్కడ స్వర్గమును బోలు దివ్య భవనమున్నది. రాజు రాణి ఆ దివ్య భవమును చూచి మిక్కిలి ఆనందమునొందిరి. చ్యవన మహర్షి వారిని దగ్గరికి పిలిచి "రాజా! మీ శాంత స్వభావము లోకోత్తరం. మీ సాధుజన సేవాభావం అద్వితీయం. ఇంత ఇంద్రియ నిగ్రహము కలమీకు వరమిచ్చెద కోరుకొనుము" అని అన్నాడు.

కుశికుడు "మౌనివరేణ్యా! నీ సేవా భాగ్యము దొఱకుటే మాకు వరము. మీ దయే చాలు. మాకింకే కోరికా లేదు" అన్నాడు. రాజదంపతుల వైరాగ్యబుద్ధికి మెచ్చి చ్యవనుడిలా అన్నాడు "ఓ రాజా! మీ వంశమునేకాక ఈ విశ్వాన్నే తరింపచేసే మునిమనుమడు పుడతాడు. అతడు బ్రహ్మర్షి అయ్యి పరమాత్మ అయిన శ్రీ రామునకు గురుస్థానమున ఉండగలడు. అతడు విశ్వామిత్రుడు. నీ వలన కౌశికుడే నామధేయంతో ప్రసిద్ధికెక్కుతాడు" (కుశికుని కొడుకు కుశనాభుడు. అతని కొడుకు గాధీరాజు. ఆయన పుత్రుడే విశ్వామిత్రుడు).

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**
సాధుసేవ యొక్క ప్రాధాన్యత శాంత స్వభావము యొక్క ఔన్నత్యం మనకు కుశిక దంపతులు బోధించారు. వారు 21 దినములు నిద్రాహారాలు మాని ఏకాగ్రచిత్తంతో మునీశ్వరునికి పాదసేవ చేశారు. మహర్షి మునికోలతో కొట్టి వారిచేత రథం లాగించినా వారికే మాత్రము కోపము రాలేదు. విరాగులైన కుశిక దంపతులు ధన్యులు.

## ప్రతిజ్ఞా పాలన

స్వాతంత్ర్య సమరయోధులనాటి కథ

స్వరాజ్యం కోసం ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతున్న రోజులవి. ప్రతి భారతీయుడు వందేమాతర నినాదాలు చేస్తూ బ్రిటిషర్లకు గుండెదిగులయ్యాడు. స్వదేశాభిమానంతో విదేశీవస్తు బహిష్కరణ చేశారు. అట్లా బాహ్యంగా ఆంతరంగికంగా విదేశీయతను తననుండి దూరం చేశాడు ఓ ప్రముఖ న్యాయవాది. అతడు ప్రఖ్యాత న్యాయవాది అయినా తెల్లవాళ్ళ న్యాయస్థానాల్లో అడుగు పెట్టనని ప్రతిజ్ఞబూనాడు.

డిసెంబర్ 1924 లో కాంగ్రెస్ మహాసభలు బెల్గాంలో జరిగాయి. ఎందఱో ప్రముఖులు ఆ సభలలో పాల్గొనటానికి వచ్చారు. ఈ ప్రసిద్ధ న్యాయవాది కూడా వచ్చాడు. అందఱూ చూస్తుండగా ఇందోర్ మహారాజు కంగారుగా వచ్చి సరాసరి ఆ ప్రముఖ న్యాయవాది దగ్గరకి వెళ్ళాడు. అందఱూ విభ్రమంతో చూడసాగారు.

"అయ్యా! గొప్ప చిక్కొచ్చి పడింది. నా తరపున మీరే వాదించాలి. ఈ 25 లక్షల రూపాయలుంచండి. కేసు గెలిచిన తరువాత మరో 25 లక్షలు సమర్పిస్తాను" అని అర్థించాడు ఇందోర్ మహారాజు. ఆ రోజుల్లో 50 లక్షలు నిజంగా చాలా పెద్ద మొత్తం. ఇందోర్ రాజు మీద హత్య చేయించి నట్టు ఆరోపించబడింది. కేసు వైస్రాయి ముందు విచారింప బడుతుంది కాబట్టి వాదించే న్యాయవాది బాగా ప్రజ్ఞాశాలి అయివుండాలి. అందుకే ఇందోర్ మహారాజు ఈ న్యాయవాదిని ఎన్నుకున్నాడు.

మరెవరైనా అయివుంటే "మహాభాగ్యం" అని కేసు ఒప్పుకునేవారే. కానీ ఈ న్యాయవాది నిష్కర్షగా అన్నాడు "అయ్యా! క్షమించండి. ఆంగ్లన్యాయస్థానాలలో అడుగుపెట్టనని ప్రతిజ్ఞ చేశాను. మళ్ళీ స్వాతంత్ర్యం వచ్చాకే నేను న్యాయస్థానాల్లోకి వస్తాను. ధన ప్రలోభంతో మీ కేసు ఒప్పుకుని ఆత్మవంచన చేసుకోలేను" అని జవాబిచ్చాడు. ఆ న్యాయవాది సత్య వాక్ పరిపాలనను చూసి ముగ్ధుడైన రాజు మరో న్యాయవాదిని ఎన్నుకున్నాడు. ఆ న్యాయవాది "దేశ బంధు" గా పేరుకెక్కిన చిత్తరంజన్ దాస్.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**
ఏమైనా రాని ఏమైనా కానీ అన్నమాట నిలబెట్టుకోవటం నిజమైన భారతీయుని లక్షణము. 50 లక్షల రూపాయలొస్తున్నా కొంచంకూడా ప్రలోభ పడకుండా చిత్తరంజన్ గారు ఆ రూపాయలను తృణప్రాయంగా ఎంచి తమ మాటకి కట్టుబడ్డారు. అందుకే వారు దేశ బంధువైనారు.

## రఘుమహారాజు – కౌత్సుడు

శ్రీమద్రామాయణం లోని కథ

పూర్వం శ్రీ రామ చంద్రుని తాతగారైన రఘుమహారాజు ధర్మవర్తనుడై ప్రజలను పాలించుచుండెడివాడు. ఆ మహానుభావుని రాజ్యంలో అనేక గురుకులాలుండేవి. ఒక్కొక్క గురుకులంలో 1000 తక్కువ కాకుండా శిష్యులుండే వారు. ఆ కాలంలో గురు శిష్యుల అనుబంధం చాలా విశేషంగా ఉండేది. వరతంతుడనే ముని యొక్క గురుకులంలో ఓ శిష్యుని శిక్షణ పూర్తి అయింది. గురువుగారు "నాయనా! నాకు తెలిసిన విద్యలన్నీ నీకు నేర్పాను. నీవూ శ్రమించి శ్రద్ధగా విద్యను అభ్యసించావు. ఇక గృహస్థాశ్రమును స్వీకరించి సమాజ కళ్యాణానికి ఉపకరించు. స్వాధ్యాయం (శాస్త్ర పఠనం మొదలైనవి) ఎప్పటికీ మఱువకు" అని అన్నారు.

శిష్యుడైన కౌత్సుడు వినయపూర్వకంగా ఇలా జవాబిచ్చాడు "అయ్యా! నాకు విద్యాబుద్ధులు నేర్పించి సంస్కారవంతుడిని చేశారు. తల్లిదండ్రులను మఱిపించే ప్రేమాభిమానాలు చూపారు. కృతజ్ఞతా చిహ్నంగా గురుదక్షిణను ఇచ్చే అవకాశాన్ని ప్రసాదించండి". "నిరుపేదవు నీవేమి ఇచ్చుకుంటావు నాయనా" అంటూ ఏమీ వద్దని ఎంతో నచ్చచెప్పాడు గురువు. ఎంత చెప్పినా వినని కౌత్సునితో విసిగి ఈతని పరీక్షిద్దామని గురువు ఇలా అన్నాడు "నీకు 14 విద్యలు నేర్పాను. ఒక మనిషి ఏనుగుపై నిలబడి రివ్వున ఓ రాయి విసిరితే ఎంత ఎత్తు వెళుతుందో అంత ధనరాశులు 14 ఇమ్ము".

గురుదక్షిణ ఇద్దామన్న సత్సంకల్పమే కాని అది ఎలా నెరవేర్చాలో తెలియలేదు కౌత్సునికి. రాజు తండ్రివంటివాడు అని తలచి రఘుమహారాజు వద్దకు వచ్చాడు కౌత్సుడు. అంతకు ముందు రోజే రఘుమహారాజు విశ్వజిత్ అనే మహాయజ్ఞం చేశాడు. ఆ యజ్ఞదానాల్లో తనకున్న సర్వస్వం దానం చేశాడు! కౌత్సుడొచ్చేసరికి రఘుమహారాజు మట్టిపాత్రలలో పూలు పెట్టుకుని దైవపూజ చేస్తున్నాడు. రఘుమహారాజు దానగుణాన్ని చూసి ఆశ్చర్యపోయాడు కౌత్సుడు. కౌత్సుని చూచి వచ్చిన కారణమేమని అడిగాడు రఘుమహారాజు. "రాజా! అది కష్టములే. నేను వెళతాను" అంటూ వెళిపోతున్న కౌత్సుని పిలిచి రాజు "వట్టి చేతులతో వెను తిరిగి పోవటమా! సంశయించక అడుగు నాయనా" అని అన్నాడు. వచ్చిన పని చెప్పి తలదించుకుని నిలుచున్నాడు కౌత్సుడు. "ఱేపు ప్రొద్దున్న రా. నీవు కోరిన ధనం ఇస్తా" అని చెప్పి పంపాడు రఘుమహారాజు.

పురత: (అందరికంటే ముందుగా) హితం చేసే వాడు పురోహితుడని ఎఱిగిన రఘుమహారాజు తన గురువైన వసిష్ఠ మహర్షి వద్దకు వెళ్ళి సమస్యను వివరించాడు. మహాజ్ఞాని అయిన వసిష్ఠుడు "రాజా! నీవు సంపాదించి ఇవ్వడానికి వ్యవధిలేదు. ఇంద్రునిపై దండెత్తు" అని హితం చెప్పాడు. విజయ భేరీలు మ్రోగాయి. ఆ భీకర భేరీనినాదాలు వజ్రి చెవులకు వినిపించాయి. రఘుమహారాజు రాజ్యంనుంచి వస్తున్నాయని తెలుసుకొని దేవేంద్రుడు "ఎంతో ధర్మాత్ముడు రఘుమహారాజు. ఆయన కోశాగారాలన్నీ ధనంతో నింపమని" ఆజ్ఞాపించాడు. రాచబంట్లు కోశాగారాలు నిండి ఉన్నాయని రఘుమహారాజుతో విన్నవించారు. దండయాత్రకు స్వస్తిచెప్పి కౌత్సుడు రాగానే "మీ ధనం కోశాగారాల్లో ఉంది. తీసుకు వెళ్ళండి" అన్నాడు.

తను అడిగినదానికన్నా ఎక్కువుందని తెలిసిన కౌత్సుడు "రాజా! నాకు కావలసినవి 14 రాశులే. మిగతా ధనం నాది కాదు" అని వెళ్ళిపోయి గురుదక్షిణ చెల్లించుకున్నాడు. "మరి ఈ ధనమెవరిది?" అని రఘుమహారాజు మిగిలినదంతా దేవేంద్రునికి పంపివేశాడు! అంతటి ధర్మాత్ముడు కాబట్టే పరమాత్మ అతని పౌత్రునిగా పుట్టినాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. గురు శిష్యుల అన్యోన్యమైన సంబంధం ఈ కథలో మనకు తెలిసింది. ప్రతిఫలం ఆశించకుండా సర్వవిద్యలూ నేర్పే గురువులు గురువుని దైవంగా పూజించి కృతజ్ఞత తెలియ చేయాలనుకునే శిష్యులు ఉన్న భారతదేశం భూలోక స్వర్గం.
౨. రఘుమహారాజు యొక్క దానగుణం ఈ కథలో వ్యక్తమైంది. ఆతడు సంపాదించినదంతా దానం చేసేవాడు. దానం చేయటానికి మళ్ళీ సంపాదించేవాడు.
౩. కౌత్సుడియొక్క రఘుమహారాజుయొక్క నిజాయితీ శ్లాఘనీయం. ధర్మపరంగా వారికెంతకావాలో అంతే తీసుకుని మిగిలినది ఇంద్రునికి ఇచ్చివేశారు.

## గోవర్ధన గిరి పూజ

శ్రీమద్భాగవతం లోని కథ

నందవ్రజములో ప్రతి ఏట ఇంద్రయాగము చేసేవారు. ఏడేళ్ళ పసిబాలుడైన శ్రీ కృష్ణ పరమాత్మ సదస్యులందరి ముందర తండ్రియైన నందుని ఇలా ప్రశ్నించాడు "ఇంద్రయాగము చేయుటలోని ఆంతర్యమేమిటి"? నందుడు "కృష్ణ! యజ్ఞ యాగములు కృతజ్ఞతను ప్రకటించే సాధనములు. మనకు హితము కలిగించే వేల్పులకు కృతజ్ఞత చూపడమే యజ్ఞం యొక్క ముఖ్యోద్దేశం. కృతజ్ఞుడే కాని కృతఘ్నుడు సహాయమునకు అర్హుడుకాడు కదా! ఈ కారణముగా లోకహితార్థం యజ్ఞం చేయుట ఆచారం" అని చెప్పాడు.

తండ్రియొక్క సత్యవాక్కులు విని శ్రీ కృష్ణుడిలా అన్నాడు "తండ్రీ! ఫలము కేవలము దేవతలవల్లనే కలుగదు. ఫలసిద్ధికి ముఖ్యమైన హేతువు కర్మ. ఒక మనిషి తానెన్ని సత్కార్యాలు చేశాడన్నది ముఖ్యం. అందుకే కర్మయే భగవంతుడని అనవచ్చు. స్వధర్మమాచరించిన వాడికి దైవము చేరువలో నుండును.

పరమాత్మ అవ్యక్తుడు సర్వవ్యాపకుడు నిరాకారుడు. అలాగే దేవతలుకూడా మనకు కనబడరు. కానీ సూక్ష్మ బుద్ధితో పరీక్షిస్తే ఈ ప్రకృతి (ఆది శక్తి) పరమాత్మ యొక్క ప్రత్యక్షస్వరూపం. కావున ప్రత్యక్షంగా మనకు కనిపించే ప్రకృతిని వదిలివేయుట మంచిది కాదు. మనము వేటిమీద ప్రత్యక్షంగా ఆధారపడి బ్రతుకుతున్నామో వాటినికూడా పూజించి మన కృతజ్ఞతా భావాన్ని సుస్థిరం చేసుకోవాలి.

మనం ఈ గోవర్ధన గిరి వద్ద నివసిస్తాము. గోసంపదతో బ్రతుకు వారము. కావున గోవర్ధన గిరి పూజ గోమాత పూజ మనకు అత్యంత ప్రధానము. అందునా గోవర్ధనగిరి గోవిందుని వక్షఃస్థలం నుండి పుట్టి పులస్త్య మహర్షి అనుగ్రహంచే ఇచటికి వచ్చింది". పరమాత్ముని అమృతవాక్యాలు విన్న వ్రజవృద్ధుడైన సన్నందుడు "ఓ నందనందన! నీవు జ్ఞానస్వరూపుడవు. నీ మాటలు మాకు శిరోధార్యములు. గోవర్ధనగిరి పూజావిధానము మాకు తెలుపుము" అని అన్నాడు. పరంధాముడు గిరిపూజా విధానం తెలిపినాడు:

"గిరి పాదభాగమును శుభ్రపఱచి గోమయముతో అలుకవలెను. రంగురంగుల ముగ్గులు వేయవలెను. పూజా ద్రవ్యములు శ్రద్ధగా సమకూర్చుకోవలెను. స్నానాది క్రియలొనర్చి భక్తితో శోడషోపచారములతో గోవర్ధనుని పూజించవలెను. అర్ఘ్యపాద్య అభిషేక అలంకరణ పుష్పపూజ దీపారాధన ప్రదక్షిణ నమస్కార స్తోత్ర నైవేద్యాది సేవలు చేసిన పిమ్మట నీరాజనమీయవలెను. విప్రసంతర్పణ గోపూజ అందరికీ అన్నదానం బాగా చేయవలెను. సాష్టాంగ ప్రణామములు చేయవలెను".

శ్రీ కృష్ణుడు అలా పూజావిధానం తెలిపి "పూజకి వచ్చేముందు మీ కర్తవ్యాలన్నీ నిర్వహించుకుని రండి. ఇంట్లో దైవపూజ మాతాపితపూజ అన్నీ చేసుకుని రండి. వృద్ధులను బాలకులను ఆకలితో వదిలేసి రాకండి. వారికి కావలసిన ఆహారం సమకూర్చండి. ఇంటి వద్ద ఉన్న గోవులకి పశు పక్షాదులకి కుక్కలకి పేటికి కావలసిన ఆహారం వాటికిచ్చి రండి" అని చెప్పాడు.

ఓ శుభదివసమున వ్రజవాసులు గోవర్ధన గిరిపూజకు తండోపతండాలుగా తఱలి వచ్చారు. యాదవుల గురువైన గర్గ మహర్షి పురోహితులు వచ్చారు. నవనందులు వృషభానుడు బంగారు పల్లకీలో రాధాదేవి వచ్చిరి. దేవతలు అప్సరసలు రాజర్షులు మహర్షులు పార్వతీ పరమేశ్వరులు విచ్చేసినారు. భక్తి శ్రద్ధలతో పూజావిధిని అనుసరించి గోవర్ధన గిరి పూజ చేశారు వ్రజవాసులు. వ్రజవాసుల భక్తికి మెచ్చి గోవర్ధనుడు సహస్రబాహులతో మానవాకృతిలో వచ్చి అందరిని ఆశీర్వదించాడు. శ్రీ కృష్ణ పరమాత్మకీ జై గోవర్ధనగిరిరాజుకీ జై అను జయజయ ధ్వానాలు భూనభోంతరాళముల ప్రతిధ్వనించాయి. వ్రజ చరిత్రలో అది ఓ సువర్ణ ఘట్టము.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమారు చూద్దాము:**

౧. ప్రాకృతిక వనరులను నాశనం చేయడం స్వార్థబుద్ధితో ప్రకృతిని క్షోభింపచేయడం ఎన్నడూ భారతీయత కాదు. భారతీయులు ప్రకృతిని పరమాత్మ యొక్క ప్రత్యక్ష స్వరూపమని భావించి పూజిస్తారు. ఇదే శ్రీ కృష్ణుడు మనకిచ్చిన సందేశం.
౨. దైవసేవ మాతాపితసేవ భూతదయ అన్నీ మానవుడి కర్తవ్యాలని గుర్తుచేశాడు శ్రీ కృష్ణుడు. అందుకే పూజకు వచ్చేముందు వృద్ధులకు బాలులకు పశు పక్షాదులకు ఆహారం సమకూర్చి రమ్మన్నాడు.
౩. మన సంస్కృతి ప్రకారము పూజా విధానము ఎట్టిదో శ్రీ కృష్ణుడు తెలిపాడు. భక్తి శ్రద్ధలతో విధిననుసరించి చేసిన పూజ ఫలించి గోవర్ధనుడు సాక్షాత్కరించాడు.

## చాతకపక్షి దీక్ష

పెద్దలు చెప్పిన నీతికథ

అది గ్రీష్మం. సూర్యుడు నడినెత్తిన ఉండి తీవిగా తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. పిల్ల పక్షులతో ఒక తల్లి చాతకం గగనతలంలో ఎగురుతోంది. పసి చాతకాలు వేడిమికి తాళలేకపోతున్నాయి. తల్లి చాతకం సెలవు కోసం గాలిస్తోంది. నేల పై ఒక పెద్ద మఱ్ఱి వృక్షం కనబడింది. దాని వేరు బొఱియలలో ఎలుకల చీమల పుట్టలు. తొఱ్ఱలలో పాములు. కొమ్మలు రెమ్మలు ఆశ్రయించి వందలాది పక్షులు. నేలమీదనున్న ఒక వృక్షమే ఇన్ని వేల ప్రాణులకు ఆశ్రయం ఇస్తే ఇక సాధన దీక్ష లక్ష్యం ఉన్న ఓ సజ్జనుడు ఎన్ని జీవులను తరింపచేయగలడు!

సామాజిక విలువ తేలిసో లేక సహజీవనం అనివార్యం అని గ్రహించో ఏమో ఆ వృక్షాన్ని కాపురమున్న పక్షి జంట పిల్లలు తమ తల్లితో "అయ్యో పాపం! వాటికి ఇల్లులేదే" అన్నాయి. "ఇన్నాళ్ళకికదా మా జీవనం సార్థకమైనది. మేము పెంచిన పిల్లలు ఎదుటివారి కష్టాన్ని గుర్తించాయి" అన్న ఆనందంతో ఆ పక్షి జంట ఆ చాతక పక్షులను ఆహ్వానించాయి.

ఆశ్రయం కోసం వెతుకుతున్న చాతకాలకి ఆ ఆహ్వానం పరమానందాన్ని కలిగించింది. కాని ధీరులు సర్వకాల సర్వావస్థలయందు తమ స్వాభావిక సద్గుణాలను విడిచిపెట్టరు. "ఈ వృక్షం మొదటి స్వాతి వాన చినుకులతోనేనా పుట్టినది?" అని అడిగి కాదు అని తెలుసుకొని ముందుకుసాగిపోతున్న ఆ చాతకాల దీక్ష చూసి విభ్రాంతిచెంది "ఔరా!" అని ముక్కున ప్రేలిడికొని చూశారా పిల్లలూ దీక్షా రూపం అని కళ్ళతోనే సైగచేసి బోధించింది తల్లి పక్షి పిల్లలకు.

**పిల్లలూ! మనం ఈ కథలోని నీతులను మరొక్కమారు చూద్దాము:**
చాతక పక్షులు మనకి దీక్ష సాధన యొక్క ప్రాముఖ్యతను చూపినాయి. చాతక పక్షులు వాన చినుకులు తప్ప ఎంత దాహమేసినా ఇంకేవీ త్రాగవు. ఈ స్వాభావిక గుణాన్ని విడువక కథలోని చాతకం కూడా మొదటి వాన చినుకులతో మొలకెత్తిన వృక్షం పైనే ఉండాలనుకున్నది.

హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చన్ద్రం చకోరస్తథా ।
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదం ॥

జగద్గురువులైన ఆది శంకరాచార్యులు ఒక భక్తుడు శివసాన్నిధ్యం చేరటానికి పడే ఆరాటాన్ని అద్భుతమైన ఉదాహరణలతో వివరిస్తున్నాడు. హంస తామర తూళ్ళనే తింటుంది. అందుకనే పద్మాలతో నిండి ఉన్న సరోవరాలకై పరితపిస్తుంది. చాతక పక్షులు వాన చినుకులను మాత్రమే త్రాగుతుంది. అందుకే ఘనమేఘాలకై ఎదురుచూస్తుంది. చక్రవాక పక్షి జంటలు పొద్దులలో జంటగా ఉంటాయి. రాత్రిళ్ళు విరహవేదనను

అనుభవిస్తాయి. అందుకని చక్రవాకాలు సూర్యోదయానికై నిరీక్షిస్తాయి. చకోర పక్షులకి కేవలం వెన్నెల ఆహారం. అందుకని చకోరాలు చంద్రోదయానికై పరితపిస్తాయి. అలాగే నిజమైన భక్తుడు కూడా మోక్ష సాధనాలైన పరమేశ్వరుని పాదాలను చేరాలని పరితపిస్తుంటాడు. అన్యములేవీ అతనికి అక్కరలేదు!

పుత్రోత్సాహం తల్లితండ్రులకు తమ పిల్లలు నలుగురికీ ఉపయోగపడ్డప్పుడు కాని పుట్టినప్పుడు కలుగదు అన్న సూక్తిని గుర్తుచేశాయి పక్షులు. తమ పిల్లలు ఎదుటివారి కష్టాలని చూసి "అయ్యో పాపం!" అని జాలిచూపినప్పుడు ఆ తల్లిదండ్రులు ఆనందించారు.

## విష్ణుచిత్తుని అతిథిసేవ

శ్రీకృష్ణదేవరాయ కృత ఆముక్తమాల్యద లోని కథ

అది కలియుగం ప్రారంభమైన 46వ సంవత్సరం (శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి పరిశోధన ప్రకారం సుమారు 5000 యేళ్ళ క్రితం). పాండ్యదేశంలో శ్రీవల్లిపుత్తూరు అనే భవ్యనగరం ఉండేది. ఆ నగరం మింటినంటే మేడలతో హంసల క్రేంకారాలు ధ్వనించే కొలనులతో బాతులకు ఆశ్రయమైన కాలువలతో ఉద్యానవనాలతో మామిడి పనస అరిటి మెదలైన తోటలతో అతి రమణీయంగా ఉండేది. ఆ పట్టణములో వీధులన్నీ సూత్రపట్టినట్లు వంకరలులేక చక్కగావున్నాయి. నాలుగు వర్ణస్థులు సుఖ శాంతులతో ఉండేవారు. ఆ ఊరి స్త్రీలు మేనికి పసుపు పూసుకుని చెరువులో స్నానమాడి ఆ ఊరి దేవుడైన శ్రీ మన్నారు కృష్ణస్వామి అభిషేకానికై బిందెలలో నీళ్ళు తీసుకొని పూజకు కలువలు కోసుకొనిపోయేవారు. గ్రంథాలను ప్రబంధాలను చదువుకుంటూ కాలక్షేపం చేసేవారు.

ఆ ఊరి ప్రజలు అతిథి కనబడగానే సాష్టాంగనమస్కారం చేసేవారు. స్వాగతం చెప్పి అతిథికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సేద తీర్చేవారు. టెంకాయఆకుల చాపపై కూర్చోబెట్టి విశాలమైన అరటి ఆకు పఱచి భోజనం పెట్టేవారు. రాజన్నపు వరి అన్నం పప్పు నెయ్యి ఎన్నోరకాల కూరలు పాలు పెరుగు ఇచ్చేవారు. అతిథి తృప్తిగా భుజించిన తరువాత తాంబూలమిచ్చి పాదసేవ చేసేవారు. అతిథి "వెళ్ళి వస్తాను" అనగానే శక్తికొలది అతని సత్కరించి కొంత దూరం అతనితో నడచి అతనిని సాగనంపేవారు. సేవ చేయటానికి అంత కొంచం అవకాశం దొరికిందని విచారిస్తూ తిరిగి వచ్చేవారు. ఈ విధముగా అతి శ్రద్ధతో ప్రతిదినమూ అతిథి అభ్యాగతుల సేవ చేసేవారు ఆ ఊళ్ళోని గృహస్థులు.

అలాంటి ఉన్నత జీవనం సాగిస్తున్న శ్రీవల్లిపుత్తూరు ప్రజల మధ్యలో గరుత్మంతుడి అంశతో భట్టనాథుడనే భాగవతోత్తముడు జన్మించినాడు. అతడు సమవర్తి స్థితప్రజ్ఞుడు. కష్టసుఖాలను లెక్కించేవాడు కాడు. భట్టనాథుడు నిత్యం తులసిమాలలు చెంగల్వదండలు కట్టి మన్నారు కృష్ణస్వామికి సమర్పించేవాడు. దేవాలయంలో ఉన్న వటపత్రశాయిని సేవించడం అతని నిత్యకృత్యము. ఏమి విద్యలూ అభ్యసించకపోయినా జ్ఞానం వైరాగ్యం కలిగి ఉండేవాడు. ఎల్లప్పుడూ విష్ణువునే ధ్యానిస్తూ ఉండేవాడు. అతని నిష్కల్మష భక్తికి మెచ్చి శ్రీహరి అతని హృదయంలో ఎల్లప్పుడూ నివసించేవాడు. అందుకనే భట్టనాథునికి విష్ణుచిత్తుడనే సార్థకనామధేయం వచ్చింది.

"మానవ సేవే మాధవ సేవ భవతరణానికి నావ" అనే సూక్తిని త్రికరణ శుద్ధిగా నమ్మినవాడు విష్ణుచిత్తుడు. అతడు ఎంతో భక్తితో అతిథిని సేవించి సేద తీర్చేవాడు. వానాకాలంలో వరి అన్నం పప్పు నాలుగైదు కూరలు వరుగులు వడియాలు పెరుగు మొదలైన వాటితో అన్నం పెట్టేవాడు.

వేసవిలో ముందుగా అతిథికి శ్రీచందనం ఇచ్చేవాడు. తాపంతీరిన అతిథికి వేడి అన్నం తియ్యని చారు మజ్జిగ పులుసు చెఱుకురసం లేత టెంకాయనీళ్ళు భక్ష్యాలు ఫలాలు సుగంధభరితమైన చల్లని నీళ్ళు వడపిందెలు మజ్జిగ మొదలైన వాటితో విందు చేసేవాడు.

శీతాకాలంలో పునుగు వాసనగల రాజనపు అన్నం మిరియపుపొడి వేడి వేడి కూరలు ఆవపచ్చళ్ళు పాయసం ఊరగాయలు వేడిగావున్న నెయ్యి పాలు మెదలైనవాటినిచ్చి అతిథిని సంతృప్తి పఱచేవాడు. ఈతడు ఎంతటి భక్తుడంటే ఏ విద్యలూ నేర్వకుండానే ఆ దేశపురాజైన వల్లభదేవునికి నారాయణుని పరతత్త్వం బోధించగలిగినాడు. సాక్షాత్కరించిన విష్ణువుకి తన దృష్టి తగులుతుందేమో నని పరమాత్మకే మంగళశాసనం చేశాడు! గోదాదేవిని శ్రీహరికి కన్యాదానం చేసి లోకనాథునికే మామ అయినాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. ఏ కాలానికి హితమైన ఆహారము ఆ కాలంలో అతిథికి ఇచ్చి అద్వితీయ అతిథిసేవ చేసి మనకు మార్గదర్శి అయినాడు పరమ భక్తుడైన విష్ణుచిత్తుడు.

౨. ప్రపంచం ఇంకా కన్నువిప్పనినాడే అన్ని రంగాలలో అగ్రశ్రేణిలో ఉండదగిన శ్రీవల్లిపుత్తూరు వంటి నగరాలు ఎన్నెన్నో మన దేశంలో! ఆధ్యాత్మికతలోనే కాక నాగరిక జీవనంలో కూడా ప్రపంచానికి గురువై బోధించిన భారతదేశంలో పుట్టిన మనం అదృష్టవంతులము.

## మయూరధ్వజుని కథ

మహాభారతం లోని కథ

ధర్మరాజు చేసే అశ్వమేధయాగం లోని యాగాశ్వాన్ని వీరధర్మం పాటిస్తూ పట్టుకున్నాడు మయూరధ్వజుడనే రాజు. అతడు ధర్మాత్ముడు అమితపరాక్రమవంతుడు శ్రీ కృష్ణుని పరమ భక్తుడు. యాగాశ్వం విడిపించుటకై మయూరధ్వజునితో యుద్ధం చేయటానికి వచ్చారు శ్రీ

కృష్ణార్జునులు. శ్రీ కృష్ణుడు కూడా అర్జునుని ప్రార్థనపై యుద్ధం చేశాడు. భగవంతునితో యుద్ధం చేయకూడదని ఉన్నా యుద్ధనీతి పాటించి ప్రతి బాణాం వేసే ముందు శ్రీ కృష్ణ నామ స్మరణ చేస్తూ యుద్ధం చేశాడు మయూరధ్వజుడు. భక్తులచేతిలో ఓడిపోవటం భగవంతునికి పరిపాటి. అందుకే శ్రీకృష్ణార్జునులు మయూరధ్వజుని గెలవలేకపోయారు. "ఈతని సంహరించి యాగాశ్వం సంపాదించకూడదా" అని అడిగిన అర్జునునితో శ్రీ కృష్ణుడు "ఫల్గుణా! నీ గాండీవం కాని నా సుదర్శన చక్రం కాని ఈ పరమభక్తుని మీద పని చేయవు. ఈతని ధర్మబుద్ధి నీకెఱిగించెద" అని అన్నాడు.

మఱునాడు శ్రీ కృష్ణార్జునులు విప్రవేషం ధరించి మయూరధ్వజుని మందిరానికి అతిథులై వెళ్ళారు. అతిథులకు తగు మర్యాద చేసి మయూరధ్వజుడు తన ఇంట ఆతిథ్యం స్వీకరించమని ప్రార్థించాడు. అది విని మాఱువేషంలో ఉన్న పరంధాముడిలా అన్నాడు "రాజా! నీ ఇంట భుజించుటకు వ్యవధి లేదు. మాకొక చిక్కు వచ్చినది. అది తీరిన తరువాతే మేము ఇతరములు ఆలోచిస్తాము". "అయ్యా! మీ కష్టమేమిటో చెప్పండి. నా చేతనైన సహాయం చేస్తాను" అని మయూరధ్వజుడు వేడినాడు. "రాజా! మేము అడవిలో ప్రయాణిస్తున్నప్పుడు నా కుమారుని ఓ పెద్దపులి పట్టుకుంది. ఆ పసివాడి శరీరాన్ని సగం తిన్న తరువాత ఒక అశరీరవాణి ఇలా పలికింది "మయూరధ్వజుని శరీరంలో సగభాగం ఈ పులికి అర్పిస్తే నీ పుత్రుడు సజీవుడు అవుతాడు". నాకు పుత్రభిక్ష పెట్టమని నిన్ను ప్రార్థిస్తున్నాను" అని శౌరి బదులిచ్చాడు.

"ఆహా! ఈనాటికి కదా ఈ దేహానికి సార్థకత ఏర్పడింది. ఒక పసివాడి ప్రాణాలు కాపాడటానికి ఉపయోగపడుతోంది. దీని కన్నా నేను కోర తగ్గది ఏమీ లేదు. నిస్సందేహంగా నా శరీరములోని అర్ధభాగమును తీసుకుని ఆ వ్యాఘ్రేశ్వరునికి సమర్పించండి" అని అర్థించాడు మయూరధ్వజుడు. వెంటనే తన భార్యాబిడ్డలను పిలిచి తన శరీరాన్ని రెండుగా చేసి అతిథులకు ఇచ్చివేయమన్నాడు. ఏ పరమధర్మ సంరక్షణార్థమో ఏ మహత్తర కార్యానికో మయూరధ్వజుడిలా చేయమని వుంటాడని గ్రహించి ఎంతో బాధను దిగమ్రింగుకొని మయారధ్వజుని శరీరాన్ని ఛేదించడం మెదలుపెట్టారు. మహాశ్చర్యకరమైన ఈ త్యాగాన్ని అనిమిషులై చూస్తున్న శ్రీ కృష్ణార్జునులకు ఓ వింత కనబడింది.

మయూరధ్వజుని ఎడమ కన్ను నుండి కన్నీళ్ళు కారుతున్నాయి. సర్వజ్ఞుడైన స్వామి అది చూసి కేవలం ఆ భక్తుని గొప్పతనం ప్రపంచానికి చాటడానికి ఇలా అన్నాడు "రాజా! బాధపడుతూ దానం ఇవ్వకూడదు. సంతోషముగా మనస్పూర్తిగా చాస్తేనే అది త్యాగమవుతుంది. ఎదుటి వాడి కష్టాలు చూసి బాధపడటం దివ్యత్వం. మనని చూసి మనమే కన్నీరు కార్చడం సైచ్యమ్".

"అయ్యా! నా శరీరం మనస్పూర్తిగానే మీకు సమర్పించాను. కాని నా శరీరము యొక్క కుడి భాగమే పరోపకారార్థం నివియోగపడుతోంది. ఎడమ భాగ శరీరం "నాకా అదృష్టం లేదే" అని విచారిస్తూ కన్నీరు కారుస్తోంది. మిగిలిన శరీరం దేనికీ ఉపయోగపడకుండానే నాశనమవుతున్నదనే నా బాధ" అని అమృతవాక్కులు పలికాడు మయూరధ్వజుడు. ఆ రాజు పరోపకార బుద్ధికి సంతోషించి శ్రీ కృష్ణుడు తన నిజరూపం చూపించి మయూరధ్వజునికి యథా రూపం కల్పించి దీవించాడు. మయూరధ్వజుడు నరనారాయణులకు మ్రొక్కి యాగాశ్వాన్ని సమర్పించి కృతార్థుడైనాడు.

**పిల్లలూ! మనం ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**
మయూరధ్వజుని పరోపకారబుద్ధి అనన్యం అసామాన్యం. శ్రీ కృష్ణుడు అడిగినదే తడవుగా సంతోషముగా బాలుని ప్రాణ రక్షణ కోసం తన శరీరాన్ని త్యాగంచేయటానికి సిద్ధపడ్డాడు. అంతేకాక అర్ధ శరీరమే ఉపకరిస్తున్నది మిగిలిన శరీరం వ్యర్థమవుతున్నదని చింతించాడు.

## భరతుని కథ

శ్రీమద్భాగవతం లోని కథ

శ్రీ హరి అంశతో పుట్టిన భరతుడు కణ్వాశ్రమంలో తన బాల్యాన్ని గడిపినాడు. వనమే అతని క్రీడారంగం మృగాలే అతని స్నేహితులు. ఆ బలశాలి సింహం పిల్లలతో ఆటలాడే వాడు! ఆ పసివాడి బలపరాక్రమాలు చూచి ఆశ్చర్యచకిత అయ్యేది తల్లి శకుంతల. స్వయంగా కణ్వమహర్షే భరతునికి జాతక కర్మలు చేసి విద్యాబుద్ధులు నేర్పినాడు. కుమారుడైన భరతుని తీసుకుని కణ్వ మహర్షి అనుజ్ఞపై ఆ సాధ్వి దుష్యంతుని వద్దకు వెళ్ళింది.

రాజు యొక్క జీవతం కత్తిమీద సాము వంటిది. అతడు ఏది చేసినా ప్రజల హితం కోరి వారి ఆమోదంపైనే చేయాలి. శకుంతల భరతుని తీసుకొని వచ్చి ఈతడే నీ వారసుడు అని చూపినది. ఆ విషయం నిజం అని తనకి శకుంతలకి కణ్వమహర్షికే తెలుసు. అది ప్రజలకు విశ్వసనీయమైన రీతిలో తెలియ చేయాలని తలచి ఆ ధర్మమే రక్షిస్తాడని నమ్మి ఏమనక ఊరకున్నాడు దుష్యంతుడు. అప్పుడు ధర్మాత్ముడైన దుష్యంతుని కరుణించి ఆకాశవాణి అందఱికీ తెలిసే లాగా స్పష్టంగా ఈ భరతుడే దుష్యంతుని పుత్రుడు కాబోవు చక్రవర్తి అని చెప్పినది. ఆ వాక్కు విని దుష్యంతుడు శకుంతల సంతసించి పుత్రునకు పట్టాభిషేకం చేసి ఐహిక విషయాల మీద మనసు పెట్టక తపోవనాలకు వెళ్ళిపోయారు.

భరతుడు సమర్థమైన తన భుజస్కంధాలపైన ఈ భూభారాన్నంతా నిలిపి ధర్మపాలన చేశాడు. ధర్మస్థాపన కోసమే యుద్ధం చేసేవాడు. తన దిగ్విజయ యాత్రలో సనాతన ధర్మానికి విరుద్ధమైన శక కబర బర్బర కష కిరాతక హూణ మ్లేచ్ఛ దేశాల రాజులను అణిచాడు. పాతాళంలో దేవతాస్త్రీలను చెఱబెట్టిన రాక్షసులను శిక్షించి ఆ స్త్రీలను వారి భర్తలకు అప్పగించినాడు. త్రిపురరాక్షసులను జయించి దేవతలను వారి వారి పదవులయందు నిలబెట్టినాడు. సత్యం శౌచం దయ తపస్సు స్థిరంగా భరతుని రాజ్యంలో ఉండటంతో ప్రకృతి సహజంగా జనాలు కోరినవన్నీ ఇచ్చేది.

ఈ భూమండలం అంతా భరతుని పాలనలో ఉన్నా కర్మ భూమి అయిన ఈ భరతఖండంలోనే అన్ని యజ్ఞ యాగాదులు దాన ధర్మాలు చేశాడు. దీర్ఘతపుడను మహర్షిని పురోహితునిగా చేసుకుని యమునా తీరమునందు 78 అశ్వమేధయాగాలు చేశాడు. గంగాతీరం పొడుగునా 55 అశ్వమేధాలు చేసి దేవేంద్రుని అతిశయించిన వైభవంతో శోభించినాడు.

పదమూడువేల యనభైనాలుగు పాడి ఆవుల మందను ద్వంద్వం అంటారు. అట్టి వేయి ద్వంద్వాలను దూడలతోపాటు బంగారముతో గిట్టలు కొమ్ములు అలంకరించి బాగా పండితులైన వేయి మంది విప్రోత్తములకి దానం చేశాడు. బంగారు నగలతో శోభించేవీ తెల్లని దంతాలు కలవీ అయిన పధ్నాలుగులక్షల నల్లని ఏనుగులను మష్కారతీర్థం ఒడ్డున దాన మిచ్చినాడు!

కుబేరునితో సమానమైన సంపద సాటిలేని శౌర్యం దేవేంద్రునితో సమానమైన విభవం మహర్షులతో సరితూగే తపశ్శక్తి ఉండికూడా భరతుడు ఎన్నడూ గర్వించక అర్థశరీరాలు తృణప్రాయంగా భావించి శాంతికాముకుడై భగవత్భక్తితో జీవించాడు. ఈ విధముగా ఇరవైయేడువేల యేండ్లు రాజ్యపాలన చేసినాడు. ఈ భరతుని సంతతి వారము కనుక మనం భారతీయులం అయ్యాము.

**పిల్లలూ! మనం ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**
ఒక మనిషి నిజంగా మనస్సుపెట్టి ధర్మబుద్ధితో పరిశ్రమ చేస్తే దేవతలనే మించిన మహామనీషి అవుతాడని భరతుడు మనకు నిరూపించాడు. అతడు తన బలపరాక్రమాలను ఉపయోగించి యుద్ధములలో విజయుడై భూమండలం అంతటా ధర్మస్థాపన చేశాడు. ప్రజల హితార్థం ఎన్నో యజ్ఞ యాగాదులు చేశాడు. నభూతో నభవిష్యతి అనే రీతిలో ఎన్నో దాన ధర్మాలు చేసి యశశ్వి అయ్యాడు.

భారతీయుల ఆధ్యాత్మ చింతన ఈ కథలో మనకు తెలిసింది. దుష్యంతుడు శకుంతల అన్ని ఐశ్వర్యాలను రాజభోగాలను పుత్రపౌత్రాది ఆకర్షణను త్యజించి తపోవనాలకి వెళ్ళి తపస్సు చేసుకొన్నారు. అలాగని కర్తవ్యాన్ని విస్మరించకుండా ఎంతో కాలం ధర్మం తప్పకుండా రాజ్యపాలన చేసి కర్తవ్యం పూర్తి చేసుకొని ఆ తరువాతే వానప్రస్థం స్వీకరించారు.

## సత్యసంధః

శ్రీమద్రామాయణం లోని కథ

మునివేష ధారులైన శ్రీరామ సీతా లక్ష్మణులు శరభంగముని ఆశ్రమము చేరిరి. శ్రీ రాముని కమనీయ దివ్యమంగళ స్వరూపమును చూచుచూ శరభంగుడు శరీర త్యాగము చేసి విష్ణుపదమును చేరెను. అనంతరము దండకారణ్యములో నివసించు మునీశ్వరులందరూ శ్రీ రామ చంద్రుని దర్శనార్థం శరభంగ ముని ఆశ్రమమునకు వచ్చినారు.

ఆ మునీంద్రులను చూచి మాయామానుష రూపుడైన శ్రీ రాముడు సీతా లక్ష్మణ సమేతంగా వారందఱికి సాష్టాంగ ప్రణామములు చేసెను. ఆ మునులు సర్వజ్ఞుడైన శ్రీ రామస్వామిని స్తుతించి సమస్త ముని ఆశ్రములు చూచి వారిని అనుగ్రహించమని కోరిరి. మునీంద్రుల వెంట సీతారామలక్ష్మణులు తపోవనములను చూచుటకు బయలుదేరిరి. ఆ ప్రదేశములలో చాలా చోట్ల పుఱ్ఱెలు ఎముకల గుట్టలు కానవచ్చెను. "పవిత్రమైన ఈ తపోభూములలో ఈ అస్థికలు ఎలా వచ్చాయి"? అని ప్రశ్నించాడు స్వామి. వారు "సర్వేశ్వరా! సమాధిస్థితిలో ఉన్న మునీశ్వరులను దుష్టులైన రాక్షసులు తినివేయగా మిగిలిన ఎముకలివి" అని తమ దైన్యత వ్యక్తపఱచినారు. కళ్ళుచెమ్మగిల్లిన స్వామి "ఈ దండకారణ్యమును రాక్షసులనుండి విముక్తము చేసెదను" అని ప్రతిజ్ఞ చేసెను. పరమానందముతో మునులు ధర్మస్థాపకుడైన శ్రీ రామునికి జయ జయ ధ్వానాలు చేసినారు.

సీతారామలక్ష్మణులు అగస్త్యమునిని సేవించి సుతీక్ష్ణుని వద్ద సెలవు తీసుకుని పంచవటికి వస్తుండగా పరమ సాధ్వీమణి లోకమాత జానకీ ఈ విధముగా భర్తతో మధుర సంభాషణము చేసినది "ప్రాణనాథా! ధర్మవర్తనము అతి సూక్ష్మమైన పద్ధతిని అవలంభించవలెను. ఎవడైతే ప్రలోభాలకు వ్యసనాలకూ దూరముగా ఉంటాడో వాడే సర్వదా ధర్మపరుడై ఉండగలడు. మనము ప్రస్తుతము మునివేషములలో ఉన్నాము. తపము ఆచరించుట మన కర్తవ్యం. తపస్సునకు శాంతి పునాది. అయిననూ మనము ధనుర్బాణములు ఏల ధరించి రాక్షసులను సంహరించుచున్నాము?". రాక్షసులతో ప్రత్యక్షముగా వైరము లేకుండానే మునులను రక్షించుట అనే "వ్యసనంతో" రాక్షసులను సంహరించుట తనకు ఇష్టములేదన్నట్టు సూచిస్తూ ఆ పతివ్రతాశిరోమణి శ్రీ రామునకు ఈ నీతికథ చెప్పినది

"పూర్వం ఒక మునివల్లభుడు ప్రశాంతమైన ఓ ఆశ్రమములో తపమాచరిస్తూ ఉండేవాడు. అతడు సత్యవాది. ఆయన సత్యప్రభావముచే జంతువులు కూడా సహజ వైషమ్యాలను మఱచి హాయిగా సహజీవనం చేసేవి. అలా ఉండగా దేవేంద్రుడు అతని పరీక్షించుటకై భటుని వేషంలో వచ్చి "స్వామీ! ఈ కత్తిని మీ వద్ద భద్రంగా ఉంచండి. మళ్ళీ వచ్చి నేను తీసుకుంటాను" అని అన్నాడు. బ్రాహ్మణుడు ఆయుధములు పట్టరాదని శాస్త్రము. ఎంతో కాలము ఆ ఆయుధం సమీపంలో ఉన్న కారణముగా ఆ మునిలో క్రూర లక్షణాలు బైటపడ్డాయి! ఆయుధం దగ్గర ఉండుటచే ఆ ముని తన కర్తవ్యాన్ని విస్మరించి హింసమీద అభిరుచి కలిగినవాడై క్రూర కృత్యాలుచేసి చివరికి ఘోర నరకమును పొందినాడు. తపస్సు చేసే మనమెక్కడ? దుష్టసంహారం చేసే క్షత్రియ ధర్మమెక్కడ? స్వామీ! చపల బుద్ధితో నాకు తెలిసినది చెప్పాను. నీవు సత్యసంధుడవు. ఏది సత్యమో ఏది అసత్యమో నీవే నిర్ణయించు" అని అనిన జానకితో శ్రీ రాముడిలా ఉన్నాడు

"దండకారణ్యము లోని మునులు నిరాడంబరముగా తపస్సు చేయుచుండగా మాంసభక్షకులైన రాక్షసులు వారిని భక్షిస్తున్నారు. ఈ మునీశ్వరులు ఆ మదాంధులకు శాపం ఇచ్చుటకు సమర్థులై కూడా శాపం ఇవ్వలేదు. వారిని చంపినా కూడా కోపము తెచ్చుకోకుండా పరమశాంత చిత్తంతో తపమాచరిస్తున్నారు. దీనులై నన్ను ఆశ్రయించినప్పుడు రాక్షస సంహారము చేసెదనని ప్రతిజ్ఞ చేసినాను. అసలు ఆ యోగులు అడిగేవరకూ నేను ఆగనక్కరలేదు. ఎందుకంటే నా తండ్రిగారు భరతునకు నగర రాజ్యము నాకు వనరాజ్యము ప్రసాదిస్తున్నానని స్పష్టముగా చెప్పిరి. కావున తపముచేసినా దుష్టులను శిక్షించటం ఆర్తులను రక్షించటం వనరాజుగా నా కర్తవ్యం.

సీతా! నేను నా ప్రాణాలనైనా వదులుతా. నా ప్రియభ్రాత అయిన లక్ష్మణునైనా విడనాడుతాను. చివరకు నా హృదయేశ్వరివైన నిన్నైనా వదులుతాను కానీ సత్యమును మాత్రమూ ఎన్నడునూ వీడజాలను! అందునా ఇట్టి తాపసులకు ఇచ్చిన ప్రతిజ్ఞ ఎప్పటికీ విడువలేను". ఇలా అద్భుతంగా సంభాషణము చేసి సుందరములైన వనభూముల వైపు నడువసాగారు. ఇట్టి సత్యసంధుడైన శ్రీ రాముని పాద స్పర్శ పొందిన ఈ భారతభూమి ధన్యం. భారతీయులు ధన్యులు.

**పిల్లలూ! మనం ఈ కథలోని నీతులను మరొక్కమారు చూద్దాము:**

౧. వ్యాస భగవానుడు చెప్పినట్టు సత్యం ఈ 13 విధాలైనది: నిష్పక్షపాతం ఆత్మనిగ్రహం అణకువ సిగ్గు ఓరిమి తాలిమి సంయమం దయ అహింస అనసూయత త్యాగం చింతన శీలసంపద. ఇన్ని విషయాలను సమగ్రంగా ఆలోచించి వీటిని అనుసంధానము చేసుకుని ఎల్లవేళలా సత్యమే ఆచరించినాడు శ్రీ రాముడు. ధర్మసమ్మతమైన ప్రతిజ్ఞ చేసి ఆ ప్రతిజ్ఞను కాపాడటానికి ఏమైనా వదులుతాను కానీ సత్యాన్ని మాత్రము విడువనని అన్నాడు.

౨. మంచైనా చెడైనా చాలాకాలం సహవాసం చేస్తే ఆ గుణాలకు దగ్గరవుతాయనే నీతికథను మనకు సీతమ్మ చెప్పినది. అందుకే మనపెద్దలు సత్సంగత్యమే చేయమని అంటారు.

## హీరాకానీ

శివాజీ వీరగాథలలోని కథ

దేవీ భక్తుడైన ఛత్రపతి శివాజీ ఒక రాజ్యాన్ని మాత్రమే స్థాపించలేదు. నిదురిస్తున్న కేసరముల వంటి భారతీయులలో గుండెలలో మఱచిపోయిన ధర్మాన్ని మాతృదేశభక్తిని ప్రతిష్ఠించినాడు. ఆదర్శ పురుషుడైన శివాజీ రాజభోగాలను తృణప్రాయంగా ఎంచేవాడు. అప్పటి కాలంలోని ఇతర నవాబులవలె కాకుండా వ్యసనాలకు దూరముగా ఉండేవాడు శివాజీ.

భారతీయతత్త్వాన్ని బాగా జీర్ణించుకున్న శివాజీ తన రాజ్యాన్ని సర్వసంగ పరిత్యాగి అయిన సన్యాసికి దానంచేసి అతని ప్రతినిధిగా ప్రజాక్షేమం కోసం రాజ్యం చేశాడు. ఎప్పుడూ ప్రజలపై అధిక పన్నులు వేయలేదు. తన పట్టాభిషేకానికి కూడా తన ధనమే వినియోగించినాడు కానీ ప్రజల సొమ్ము ముట్టుకోలేదు.

శివాజీ రాయగఢ్ కోట శత్రువులకు అభేద్యంగా కట్టుదిట్టంగా ఉండేది. ప్రొద్దున ఆఱింటికి తెఱిచిన కోట తలుపులు రాత్రి తొమ్మిదిగంటలకు మూయబడుతాయి. ద్వారం మూసి ఉన్న సమయంలో చీమకూడా లోనినుండి బైటికి వెలుపల నుండీ లోనికి రాకూడదు. ఇది ఛత్రపతి శివాజీ ఆజ్ఞ. రాజ్య రక్షణార్థం ఇట్టి కట్టుదిట్టాలు తప్పలేదు. ఎట్టి పరిస్థితులలోనూ రాత్రి తొమ్మిది తరువాత కోట ద్వారం తెఱవబడదు.

హీరాకానీ అనే గ్రామవాసి రోజూ కోటలో ఉన్న అధికారులకు సైనికులకు పాలుపోయటానికి వచ్చేది. అందఱికీ తనకు చేతనైన సహాయం చేసేది. ఇలా ఉండగా ఒక రోజు సాయంకాలం పాలుపోయటానికి కోటలోకి వచ్చింది హీరాకానీ. ఒక సైనికుడి భార్య ప్రసవవేదన పడుతున్నదని తెలిసి అక్కడే ఉండి ఆమెకు సహాయం చేసింది. పురుడు అయ్యేదాకా అక్కడే ఉన్నది. ఇంటికి వెళదామని సమయంచూస్తే తొమ్మిది దాటిపోయింది. పరుగులుతీసి కోటగుమ్మం చేరింది హీరాకానీ.

కావలి వాళ్ళు హీరాకానీ చాలా మంచిది అని అభిమానం ఉన్నా రాజాజ్ఞ ధిక్కరించలేక తలుపులు తీయలేదు. "అయ్యో! ఇంట్లో ఉన్న పసిపిల్లవాడికి ఆకలివేస్తుంది. వాడికి పాలివ్వాలి" అని ప్రాధేయపడింది. హీరాకానీ మీద జాలి పడిన కావలి వాళ్ళు "తల్లీ రాజాజ్ఞ మేము మీఱలేము. ఈ ఒక్క పూటకి మీ ఆయన పాలుపడతాడులే. ఈ సైనికుని ఇంట్లోనే పడుకో. ఉదయం ఆఱుకాగానే నిన్ను మేమే స్వయంగా పంపిస్తాము" అని ఊఱడించినారు.

మఱునాడు ప్రొద్దురాగానే కావలివాళ్ళు హీరాకానీని వెదకసాగారు. ఎక్కడైనా ఆదమఱచి నిద్రపోయిందేమో లేపి ఇంటికి పంపుదామనుకున్నారు. అలా వెదుకుతున్న వారికి కోటగోడ వద్ద హీరాకానీ పాల పెరుగు కుండ కనిపించింది. పైకి చూసేసరికి ఆమె పూసల గొలుసు కోటమీద రాయికి ప్రేలాడుతూ కనిపించింది. ఆశ్చర్యపోయిన కావలివాళ్ళు శివాజీకి ఈ విషయం విన్నవించారు. ఒక స్త్రీ అభేద్యమైన కోట అర్ధరాత్రి ఒంటరిగా దాటడమా? అది ఎలా సాధ్యం అని నివ్వెరపోతూ స్వయంగా పరిస్థితిని పరిశీలిద్దామని అక్కడికి వచ్చాడు శివాజీ.

ఇంతలో హీరాకానీ రానేవచ్చింది. వణుకుతూ శివాజీ ముందు నిలబడి "అయ్యా! రాత్రి పాలకై ఏడుస్తున్న నా బిడ్డడు గుర్తుకు వచ్చాడు. ఇక ఏ దారీ తోచలేదు. కోటగోడలెలా దాటానో నాకే తెలియదు. కొండలూ గుట్టలూ తుప్పలూ ఆ నడిరాత్రి ఎలా దాటానో కూడా తెలియలేదు. నా బిడ్డ ఒక్కడే నాకు జ్ఞప్తిలో ఉన్నాడు. నా తప్పు క్షమించండి ప్రభూ!" అని ప్రార్థించింది హీరాకానీ.

శత్రువులకు సింహస్వప్నమైన ఛత్రపతి కళ్ళు చెమ్మగిల్లాయి. హీరాకానీకి అందఱూ చూస్తుండగా సాష్టాంగవందనం చేశాడు! "అమ్మా! మాతృప్రేమ ముందు ఈ సృష్టిలో ఏ శక్తీ నిలువలేదు. ఇక ఈ కోటగోడలెంత? ఇక్కడ కట్టబోయే బురుజుకు నీ పేరే పెడతాను" అని ఆమెను పంపివేశాడు అమ్మ విలువ తెలిసిన శివాజీ. ఇప్పటికీ ఈ బురుజు హీరాకానీబురుజు అనే పిలవబడుతోంది.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**

౧. ఒక స్త్రీకి మాతృమూర్తికి భారతీయులు ఇచ్చే గౌరవం ఈ కథలో మనకు స్పష్టముగా తెలుస్తున్నది. ఛత్రపతి అయివుండికూడా శివాజీ అందఱిముందూ సామాన్యురాలైన హీరాకానీ పాదాలపై పడి నమస్కరించెను.

౨. తనకు ఎన్ని పనులున్నా ప్రసవవేదన పడుతున్న సైనికుని భార్యకు సహాయపడి తన పరోపకార బుద్ధిని మనకు నేర్పింది హీరాకానీ.

౩. ఎంత హీరాకానీ మీద జాలి ఉన్నా రాజాజ్ఞను గౌరవించి వారి కర్తవ్యాన్ని పాలించి సేవాధర్మాన్ని కాపాడిన కావలి వాళ్ళు ధన్యులు.

## యుధిష్ఠిరుని ధర్మబుద్ధి

మహాభారతము లోని కథ

చిరంజీవి అయిన మార్కండేయ మహర్షి వద్ద పుణ్యకథలు వినిన తరువాత ధర్మాత్ములైన పాండవులు పరమసాధ్వి అయిన ద్రౌపదీదేవి పురోహితుడైన ధౌమ్యుల వారు ద్వైతవనానికి చేరారు. అక్కడ ఉండగా ఒక రోజు ఒకానొక భూసురోత్తముడు పఱుగులిడుతూ వచ్చి "ఓ ధర్మనందనా! యజ్ఞార్థము నేను అరణి (నిప్పు పుట్టించెడు కొయ్య) అరణ్యమునుండి కొనివచ్చి వాటిని ఒక తరుశాఖ మీద పెట్టి మిగిలిన ఏర్పాట్లు చేయుచుండగా ఒక జింక ఎక్కడి నుంచో పఱుగు పఱుగున వచ్చి ఆ వృక్షము ప్రక్కగా వెళ్ళినంత దాని కొమ్ములకు నా అరణి చిక్కుకుంది. అలా నా అరణి తీసుకుని ఆ జింక మళ్ళీ అడవిలోకి పారిపోయింది. నా నిత్యకర్మకు అంతరాయం కలుగ కుండా నా అరిణి తెచ్చి కాపాడు" అని వేడుకున్నాడు.

ఆర్తరక్షణే ప్రథమ కర్తవ్యం అని భావించే ధర్మజుడు వెంటనే తన విల్లందుకుని తన తమ్ములతో పాటు ఆ జింక వెళ్ళిన వైపున పఱుగు తీశాడు. అద్భుత వేగంతో పోతున్న ఆ జింక ఎంత ప్రయత్నించినా వారికి చిక్కలేదు. అలా ఎంతో దూరం ఆ జింక వెనకాల పఱుగెట్టారు పాండవులు. తీవ్రమైన అలసట దప్పిక వారిని బాధించాయి అయినా కర్తవ్య పాలనార్థం జింకను వెంబడిస్తూనేవున్నారు. చివరికి వారు దట్టమైన కాఱడవి లోపలికి చేరుకున్నారు. అక్కడ ఆ జింక కనుమఱుగైపోయింది. మానవ ప్రయత్నం విఫలంకాగా ఎంతో శ్రమతో ఆయాసపడుతున్న పాండవులు ఒక పెద్ద మఱ్ఱిచెట్టు క్రింద విశ్రాంతి తీసుకున్నారు. అప్పుడు నకులుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు "నిరంతరము సత్యమార్గమును అనుసరించుచూ ధర్మముతప్పకుండా చెరించే మనకు ఈ దుర్గతి ఎందుకు పట్టినదో? ఒక జింకను పట్టి ఆ బ్రాహ్మణుని అరణి తిరిగి ఇవ్వలేక పోతున్నామే. హతవిధి"! అది విని ప్రాజ్ఞుడైన యుధిష్ఠిరుడు ఇలా బదులిచ్చాడు

"నాయనా! సుఖము దుఃఖము మనము పూర్వం చేసిన కర్మ బట్టే ఉంటాయి. సత్కర్మలకు సత్ఫలము దుష్కర్మలకు దుఃఖము తప్పదు. చేసిన కర్మ చెడని పదార్థం. కర్మ వశముగా కాక ఏదీ జరుగదు". భీమసేడు ఆ సత్యవాక్కులు విని "అయితే పరసతి పరమపతివ్రత పైగా ఏకవస్త్ర (రజస్వల) గా ఉన్న పాంచాలీ దేవిని కురుసభకు జుట్టుపట్టుకుని ఈడ్చుకువచ్చిన అతిదురాత్ముడైన దుశ్శాశనుని అక్కడే వధించకుండా ఊరక ఉన్నందుకే మనకి ఈ దుర్గతి పట్టి ఉండ వచ్చు" అని అన్నాడు. అది విని శ్రీ కృష్ణ ప్రియ సఖుడైన అర్జునుడిలా అన్నాడు "ధర్మాధర్మ విచక్షణ లేకుండా ఇష్టంవచ్చినట్టు కురువృద్ధుల ముందర నోటికివచ్చినట్టు మాట్లాడిన ఆ కర్ణుని నోరుమూయించక ఓర్చుకున్నందుకే మనకీ దుఃఖములు". అప్పుడు సహదేవుడు "దుష్టశీలుడైన దుర్యోధనుడు అధర్మ జ్యూదం ఆడి మనలను మోసగించినవుడే దుష్టశిక్షణ చేయనందులకే మనకీ దుర్గతి పట్టినది" అని అన్నాడు (జ్యూదంలో పందెం కాసేవాడే ఆడాలన్నది నియమం. అలా కాకుండా తను ధనంవొడ్డి శకునిచే ఆడించి గెలుచుట అధర్మం అని సహదేవుని ఆంతర్యం).

ఇలా వేయివిధాల మాటలాడు తున్న సోదరులను చూచి అజాతశత్రుడైన పాండవాగ్రజుడు అందఱికంటే చిన్న అయిన సహదేవునితో ఇలా అన్నాడు "నాయనా! నీ సోదరులందరూ తీవ్ర దాహముతో ప్రాణాలుకడపట్టుకు ఉన్నారు. ఈ వృక్షం ఎక్కి దగ్గరలో ఏదైనా జలధార ఉన్నదేమో చూడు". వెంటనే సహదేవుడు ఆ చెట్టెక్కి నలువైపులా చూశాడు. దగ్గరలోనే అతి మనోహరమైన తటాకమున్నదని చెప్పాడు. అప్పుడు ధర్మరాజు "నీవు వెళ్ళి నీరు త్రాగి దప్పిక తీర్చుకొని మాకు కూడా కొంత జలం పట్టుకు రా" అని సహదేవునితో అన్నాడు. సహదేవుడు వెళ్ళి తటాకములోని నీరు త్రాగబోతుండగా ఒక అశరీరవాణి ఇలా పలికింది "ఓ మాద్రీనందన! ఈ జలములు నా ఆధీనములో ఉన్నాయి. నీవు ఇవి త్రాగదలుచు కుంటే ముందు నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పు". దాహముతో తపిస్తున్న సహదేవుడు ఆ మాటలు పట్టించుకోకుండా నీళ్ళు త్రాగినాడు. మఱుక్షణం నిశ్చేష్టుడై పడిపోయాడు.

ఆ తరువాత నకుల అర్జున భీములు ఒక్కొక్కరుగా ధర్మరాజు ఆనతిమీద తమ్ములను వెదుకుటకు వచ్చి సాహసించి ఆ తటాకములో నుండీ నీరు త్రాగి మృతుల వలె ఆ తీరమువద్ద పడిపోయినారు. ఎంతకీ తిరిగి రాని సోదరులను వెతుకుతూ చివరికి ధర్మనందనుడు కూడా ఆ తటాకానికి చేరుకున్నాడు. యుధిష్ఠిరుడు తీరమువద్ద పడివున్న తన ప్రియ సోదరులను చూచి ఆశ్చర్యపోయాడు. వారికేమైనదో అని దుఃఖించాడు. అసమానశూరులు వీరాధివీరులైన ఆ నలుగురు ఏ కారణంబుగా ఈ స్థితిలో ఉన్నారో అని బాధపడ్డాడు. పుణ్యచరిత అయిన కుంతీ దేవికి ఈ విషయము తెలిసిన ఎంత దుఃఖించునో అని తలచినాడు. "భీష్మ విదురాది పెద్దలు అడిగితే ఏమి సమాధానము చెప్పాలి?" అని ఇట్లు పరిపరి విధముల వగచి దాహముతో ప్రాణాలుపోతున్న ఆ ధర్మజుడు తటాకములోని జలములు త్రాగుటకు ఉపక్రమించెను. మఱల ఆ

అశరీరవాణి ఇట్లనియె "నీ సోదరులు సాహసించి ఈ నీరు త్రాగి మరణించిరి. నీవీనీరు త్రాగవలెనన్న నా ప్రశ్నలకు విమల బుద్ధితో సమాధానములు ఇవ్వవలెను". "అయ్యా! నీవు శివుడవో అగ్నిదేవుడవో వాయుదేవుడవో ఇంద్రుడవో? ఇట్టి అజేయులకు ఈ స్థితిని ఇంకెవరు కల్పించగలరు? నాయందు దయ ఉంచి మీ నిజరూపంబు చూపి నా భయము తొలగించండి" అని వేడుకొనిన అతి ఘోరాకృతిలో ఉన్న యక్షుడు యుధిష్ఠిరుని ఎదుట నిల్చి నా ప్రశ్నలకు ఉత్తరములు ఇయ్యమని అడిగెను. సహజ వినయ సౌశీల్యుడైన ధర్మనందనుడు అతనికి ప్రణమిల్లి "దేవా మీ చిత్తము. కానీ నాబోటి వానికి మీ ప్రశ్నలకు జవాబులిచ్చుట సాధ్యమా? అయినా నాకు తెలిసినంతలో చెప్తాను" అని అన్నాడు.

ఆ యక్షుని ప్రశ్నలకు ధర్మజుడు అద్భుతరీతలో ఉత్తరములను ఇచ్చినాడు. సంతృప్తుడైన యక్షుడు "మహాత్మా! నా ప్రశ్నలన్నిటికీ నీవు సదుత్తరములు ఇచ్చి నన్ను మెప్పించినావు. నీ తమ్ములలో ఒకని ప్రాణంబులిచ్చెద. కోరుకొనుము" అని వరమొసంగినాడు. శ్యామాంగుడైన నకులుని బ్రతికించ మని ధర్మరాజు కోరగా యక్షుడు ఆశ్చర్యముగా ఇలా ప్రశ్నించాడు "భీమార్జునులు అతిభీమబలులు. భీమసేనుడు అతని భుజబలముచే నిన్ను నీ సోదరులను అనేక మాఱులు మత్సరముచే చంపాలనుకొన్న దుర్యోధనుని కుయుక్తుల బారినుండి కాపాడినాడు. ఇక అర్జునునికి సాటి రాగల వీరుడు ఈ లోకంలో లేడు. ఆతడే మఱల నీ రాజ్యము నీకు అప్పించగలడు. వీరిలో ఒక్కరిని కోరక నకులుని ఎందులకు కోరినావు"? సమవర్తి అయిన యుధిష్ఠిరుడు ఇలా ధర్మము మాట్లాడినాడు "కుంతీదేవి కుమారులైన ముగ్గురిలో నేను మిగిలినాను. అలాగే మాత యగు మాద్రీదేవి ఇద్దరు పుత్రులలో ఒకడైనా బ్రతకాలి కదా! అందుకే నకులుని బ్రతికించమని కోరినాను. ఇట్లు కాక అన్యుల బ్రతికించమని కోరి అధర్మము చేయలేను". ధర్మజుని ధర్మబుద్ధికి మెచ్చి ఆ యక్షుడు "నీ తమ్ములందఱిని బ్రతికించెదను" అని కరుణించినాడు. వెంటనే ఆ నలుగురు లేచి కూర్చున్నారు. వారందరి దాహమూ తీరిపోయినది. ఆ యక్షుడి శక్తి చూచి ఆశ్చర్యపోయి "దేవా! నీవు సామాన్య యక్షుడవు కావు. ఇంద్రుడవో వరుణుడవో అగ్నివో వాయుదేవుడవో లేక ధర్మప్రభువైన నా తండ్రి యముడవో చెప్పుము" అని ప్రార్థింప ధర్ముడు కరుణించి తన నిజ స్వరూపము చూపి వారికి ఆనందము కలిగించినాడు.

"ఓ రాజా! నేను యమధర్మరాజును. సత్యము శౌచము దయ దానం తపం శమము దాంతి యశము జ్ఞానము యుక్తి నా మూర్తులు. నీ ధర్మబుద్ధి పరీక్షించుటకు వచ్చినాను. నీ ధర్మవర్తనమునకు మెచ్చినాను. ఏమి వరము కావలయునో కోరుకొనుము" అని కాలుడు అడిగినాడు. అప్పుడు పాండవాగ్రజుడు ఆ ధర్ముని స్తుతించి "అయ్యా! నా ఆశ్రమము వద్ద ఉండే విప్రోత్తముడి అరణి ఒక హరిణము ఎత్తుకుపోయింది. ఆ మహనీయుని నిత్యకర్మకు లోపము రాకుండా అతనికి ఆ అరణి ఇప్పించు స్వామి"! అని కోరినాడు. అంతట ఆ ధర్ముడు తానే మృగ రూపమున వచ్చెనని ధర్మరాజుకు ఎఱిగించి అతనికి విప్రుని అరణి ఇచ్చెను. "నాయనా! రానున్న అజ్ఞాతవాసములో మీకు కావలిసిన రూపములు నా అనుగ్రహం వల్ల కలుగుతాయి. ఇందువల్ల అసత్య దోషం కలుగకుండా మీరు అజ్ఞాతవాస కాలము పూర్తిచేయగలుగుతారు. నాయనా ధర్మరాజా! నీ కర్తవ్య దీక్షకు మెచ్చి ఇంకొక వరమిస్తాను కోరుకో" అని కాలుడన్నాడు. అప్పుడు ధర్మనందనుడు "స్వామీ! నీ అనుగ్రహము కన్న నాకు కావలసిన దేమున్నది. నా మనసులో అప్పుడూ క్రోధమోహాలు రాకుండా ఎల్లప్పుడూ ధర్మమార్గాన ఉండేటట్లు ఆశీర్వదించండి" అని కోరినాడు. అటులనే దీవించి యముడు అదృశ్యమయ్యాక పాండవులు ఆశ్రమము చేరి భూసురునకు అరణి ఇచ్చి ఆనందముగ ఉండసాగిరి.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**
సజ్జనులు ఎన్నడూ ధర్మమార్గమును వీడరు. ధర్మరాజు నకులుని కోరి ధర్మవర్తనము ఎంత సూక్ష్మమైనదో మనకు వివరించినాడు. వరం కోరుకో మనినప్పుడు ధర్మజుడు తనకై ఏదీ కోరకుండా విప్రుని అరణి ఇప్పించమని కోరినాడు!

ధర్మశాస్త్రానుసారము తమ్ముని వెదుకుటకు అన్న వెళ్ళాలి కానీ అన్నను వెదుకుటకు తమ్ముడు పోరాదు. అన్నను వెదుక వలసిన పరిస్థితి తమ్మునికి వస్తే గురువువెళ్ళి వెదకాలి. ఈ ధర్మసూక్ష్మం తెలిసిన యుధిష్ఠిరుడు ముందు సహదేవుని పంపి ఆతని వెదుకుటకు నకులుని ఆ తరువాత అర్జునుని ఆపైన భీమసేనుని పంపెను.

## ప్రవరాఖ్యుని కథ

శ్రీ అల్లసాని పెద్దన కృత మనుచరిత్ర (శ్రీ మార్కండేయ పురాణము) లోని కథ

అరుణాస్పదం అనే పట్టణములో ప్రవరుడనే బ్రాహ్మణోత్తముడుండే వాడు. అతడు గృహస్థాశ్రమ ధర్మాలను తప్పకుండా అతిథి అభ్యాగత సేవలు చేస్తూ కాలం గడిపేవాడు. అతనికి తీర్థయాత్రలంటే చాలా మక్కువ. కానీ దేవతార్చన మాతాపితసేవ అతిథి అభ్యాగతసేవ స్వాధ్యాయము అన్ని నియమం తప్పకుండా ఎంతో శ్రద్ధగా చేయటంతో ఎక్కడికీ వెళ్ళటానికి కుదిరేది కాదు. భార్యాపిల్లలను చూసుకోవడం చెట్లను పశుపక్షాదులను పోషించడం ఆహ్నికాలు తీర్చుకోవడం ఇలా ఒకదాని తరువాత ఒకటి చేస్తూ ఉండటంతో పాపం ఎంత ప్రయత్నించినా తీర్థయాత్రలకి వెళ్ళాలేకపోయేవాడు. తీర్థయాత్రలు చేసి ఎవరైనా వచ్చారని తెలియగానే వారిని ఆహ్వానించి ఆతిథ్యమిచ్చి యాత్రా విశేషాలు తెలుసుకుంటూ ఉండేవాడు.

ఒక రోజు చాలా తీర్థయాత్రలు చేసిన సిద్ధుడు ఒకడు అతని దగ్గరకు వచ్చాడు. ఆ సిద్ధుడు అతి చిన్న వయస్సులోనే ఎన్నో తీర్థయాత్రలు చేశాడని తెలుసుకోని ప్రవరడు "స్వామీ! కర్తవ్య పాలనమే సర్వతీర్థక్షేత్ర దర్శన ఫలదాయకం అని తెలిసినా కూడా ఆ పవిత్ర ప్రదేశాలను ప్రత్యక్షముగా చూడాలన్నది నా కోరిక. కాని ప్రతిదినమూ కర్తవ్య నిర్వహణతోనే గడచిపోతున్నది. నేను తీర్థయాత్రలు చేసే ఉపాయము బోధించండి" అని ప్రార్థించాడు. ప్రవరాఖ్యుని గృహస్థ ధర్మపాలనా దీక్షకు సంతోషించి ఆ సిద్ధుడిలా అన్నాడు

"నాయనా ప్రవరా! మన శాస్త్రాలలో ఇటువంటి అవసరాలకోసమే కొన్ని సిద్ధులు శక్తులు సంపాదించే విధానాలు చెప్పబడి ఉన్నాయి. అవి ఉపయోగించి సునాయాసముగా నీవు తీర్థయాత్రలకు వెళ్ళి రావచ్చు నీ కర్తవ్యాలనూ పాటించ వచ్చు. నా వద్ద ఒక పాద లేహ్యమున్నది (పసరు). దీనిని నీ పాదాలకు పూసుకొనిన నీవు మనోవేగంతో సంకల్పించిన ప్రదేశము చేరగలవు". మహదానందముతో ఆ పసరును ఆ సిద్ధుని వద్దనుండి స్వీకరించాడు ప్రవరుడు.

మఱునాడు ప్రవరుడు ఇంటనున్న తల్లిదండ్రులను సేవించి తన నిత్య అనుష్ఠానాలు పూర్తి చేసుకుని అందఱి అవసరాలు తీర్చి కుటుంబ బాధ్యత భార్య సహనశీలికి అప్పగించి అతిథి అభ్యాగతసేవ చేయమని చెప్పి సూర్యాస్తమయం లోపల ఇంటికి చేరాలన్న సంకల్పంతో పాదాలకు లేపనం రాసుకొని హిమాలయ పర్వతాల లోని పవిత్ర క్షేత్రాలు సుందర తీర్థప్రదేశాలు చూడాలని బయలుదేరాడు.

ఆ హిమాలయాల పర్వతాల సొగసును వర్ణించడం ఆ బ్రహ్మకైనా తరమా! కొండల కోనలనుండి ప్రవహించే సెలయేళ్ళు నదుల సరోవరాల అలల చప్పుళ్ళు పింఛాలు విప్పి ఆ ధ్వనులకు ఆనంద నర్తనం చేసే నెమళ్ళు అన్ని ఆశ్చర్యముగా చూడసాగాడు ప్రవరుడు. ఇలా ఆ రమణీయ పర్వతాలను దర్శించి ఇక ఇంటికి బయలుదేరి తిరిగి వచ్చి మిగిలిన ప్రదేశాలు చూద్దామనుకున్న ప్రవరుడు ఊరుచేరాలని సంకల్పించుకున్నాడు. కానీ కదలలేక పోయాడు! మంచునీటిలో పాదలేపనం కరిగి పోయిన వైనం తెలుసుకున్నాడు. మొదలు నరికిన వృక్షమైపోయాడు. "ఓ భగవంతుడా! ఇది ఎక్కడి కర్మపాశం! ఎక్కడ అరుణాస్పదం? ఎక్కడ హిమాలయ పర్వతాలు? ఆలోచనా రహితముగా రావచ్చునా? ఎంత తెలివిమాలిన పని చేశాను"! నిమిషము కనిపించక పోయినా చింతించే తల్లిదండ్రులను అనుకూలవతీ సాధ్వి అయిన అర్ధాంగినీ తలుచుకుని బాధపడ్డాడు. "ఆడుతూపాడుతూ చదువుకుంటూ ఉండే నా ప్రియ శిష్యులు ఎంత విచారిస్తారో? అతిథులకు భోజన సదుపాయాలు ఏమవుతాయో? అగ్నిహోత్రాలు నిత్యానుష్ఠానాలు చేయలేని ఈ దుస్థితి ఎవరికీ రాకూడదు" అని పరిపరి విధాల వగచాడు ప్రవరుడు.

ఇంతలో వరూధినీ అనే గంధర్వ కన్య ప్రవరాఖ్యుని ప్రలోభ పెట్టాలని అనేక ప్రయత్నాలు చేసింది. అనుష్ఠానాలు చేయలేక పోతానేమో అన్న దుఃఖం ఒక వైపు వరూధినీ శృంగారచేష్టలు ఒకవైపు. ఇంతలో సూర్యుడు అస్తమిస్తాడని తెలిసి సంధ్యావార్చని జీవితం వ్యర్థం అనిపించింది ప్రవరుడికి. "ఇన్నాళ్ళూ నేను చేసిన అనుష్ఠానము ఆగిపోతుందా"? అని అనుకుని భ్రాంతిచెందాడు. ఇంతలో దుఃఖము వదిలి కర్తవ్యం ఆలోచించాలని ప్రవరుడు అనుష్ఠానాలు చేయాలనే దృఢ సంకల్పముతో అగ్నిదేవుని మనసులో తలచి "నేనే కనక నిత్యానుష్ఠాన తత్పరుడనైతే కర్తవ్య పాలనా దక్షుడనైతే ఆ అగ్నిదేవుడే నాకు దారి చూపుగాక"! అని అనుకున్న మఱుక్షణం అరుణాస్పదంలోని తన గృహంలో ఉన్నాడు ప్రవరుడు. కర్మసాక్షి అయిన ఆ భగవంతునికి నమస్కరించి అనుష్ఠానాలు చేసుకుని ఇంటిల్లి పాదిని ఆనందపఱిచాడు ప్రవరుడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. నిత్యకర్మలను కర్తవ్యాలను మనసా వాచా కర్మణా ఆచరించిన ప్రవరుని రక్షించి అతని నిష్ఠకు అంతరాయం కలుగకుండా కాపాడినాడు భగవంతుడు. ధర్మో రక్షతి రక్షితః అన్న సూక్తికి ఇంతకంటే నిదర్శనముంటుందా?
౨. గృహస్థ ధర్మాలేమిటో ఈ కథలో ప్రవరుడు మనకు చక్కగా చూపించినాడు. దేవతార్చన మాతాపితసేవ మానవసేవ (అతిథిసేవ) పశుపక్షాదులను వృక్షములను కాపాడటం స్వాధ్యాయము (శాస్త్ర పురాణ పఠనం) విడువకుండా చేసి ఋషులకు కృతజ్ఞత చూపించడం ముఖ్య కర్తవ్యాలని చూపినాడు.
౩. ప్రవరుని మనోనిగ్రహం అసామాన్యం. సౌందర్యవతి అయిన వరూధినీ ప్రలోభాలను పట్టించుకోకుండా కార్యోన్ముఖుడైన ప్రవరుడు మనకు మార్గదర్శి.

## రామయ్య ఎడ్లు

పెద్దలు చెప్పిన నీతికథ

రామయ్య ఒక సాధారణ రైతు. దైవికముగా తనకి ఉన్నంతలో సంతృప్తిగా ఉండేవాడు. అతని వద్ద మంచి నాగౌరు గిట్టలుండేవి. వాటిని తన కన్నబిడ్డలవలె కంటికిఱెప్పలాగా చూసుకునేవాడు. ప్రత్యక్షంగా పరోక్షంగా మానవ జీవనానికి సహాయపడే పశుసంపదను పూజించడం భారతీయుల కృతజ్ఞతా వైభవానికి తార్కాణం. ఆ భారతీయ తత్త్వానుసారముగా రామయ్య తన ఎడ్లను పూజించేవాడు. నాగౌరు గిట్టలు అవడంచేత రామయ్య ఎడ్లలో సత్తా బాగా ఉండేది. అవి ఉత్తమ జాతి అశ్వాలకన్నా వేగముగా పఱుగెత్తగలిగేవి! వాటి వేగము చూసి పుత్రోత్సాహ భావముతో రామయ్య మురిసిపోయేవాడు.

ఇలా ఉండగా ఒక రోజు రామయ్య వృషభాలను కొందఱు దొంగలు అపహరించారు. తన ఎద్దులు లేవని తెలుసుకొన్న రామయ్య దుఃఖానికి అంతులేదు. పాపం! సొంత కొడుకు దూరమైనట్లు బాధపడ్డాడు. "రామా! నేనేమి పాపంచేశానయ్యా? ఎందుకింత పెద్ద శిక్ష? నా ఏడ్లు లేకుండా నేనెట్లా బ్రతికేది? ఆ దొంగలు నా ధనం తీసుకుని నా ఎడ్లను వదిలిపెట్టుంటే బాగుండేది. పశుసంపద లేని ఇంట్లో లక్ష్మీదేవి ఉంటుందా? (ఉండదు)"

ఇలా పరిపరి విధాల వగచి రామయ్య రక్షకభటులతో దొంగలు తన ఎడ్లను ఎత్తుకుపోయిన విషయం చెప్పాడు. తనుకూడా వారితో కలిసి దొంగలను వెదుక సాగాడు. చివరికి రామయ్య పాలిటి దేవతలైన వృషభాలను ఆ దొంగలు ఒక బండికి కట్టి పాఱిపోవడం రామయ్య రక్షకభటులు చూశారు. రామయ్య కళ్ళు సూర్యుని చూసిన పద్మాల్లాగా విచ్చుకున్నాయి. ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లాయి. ఇంతలో ఆ రక్షకభటులు రామయ్య ఓ బండి ఎక్కి దొంగల వెనకాల పడ్డారు. దొంగల ఎడ్లబండీని త్వరగా అందుకుంటున్నారు రామయ్య రక్షకభటులు.

ఇంతలో రామయ్య వాయువేగంతో వెళ్ళే తన నాగౌరుగిట్టలను వాళ్ళు వెళ్ళే గుఱ్ఱబ్బండి అందుకోవడమేమిటి? అని అనుకున్నాడు. తన ఎడ్లు ఆ గుఱ్ఱాలతో ఓడిపోవటం ఇష్టంలేక పొయిన రామయ్య "ఆ ముక్కుత్రాటిని రెండు సార్లు లాగండిరా"! అని ఆ దొంగలకు ఎడ్లు పూర్తి వేగముతో వెళ్ళే కిటుకు చెప్పాడు. దొంగలు ఆ కిటుకు తెలుసుకుని తీవ్రవేగాన్ని అందుకున్నారు. కొద్ది సేపటిలోనే కను మఱుగైపోయారు. వచ్చిన ఒక్క అవకాశము పోయిందని విచారిస్తాడేమో అనుకున్న రక్షకభటులు రామయ్య ఆనందాన్ని చూసి ఆశ్చర్య పోయారు. ఆనందానికి కారణమేమిటని అడిగిన రక్షకభటులతో ఇలా అన్నాడు మహౌదార్యముగల రామయ్య

"అయ్యా! నా గిట్టలు ఎప్పుడూ పఱుగు పందెంలో ఓటమిని చవిచూడలేదు. వాటి పేరు ప్రతిష్ఠలే నాకు ముఖ్యం. నాకు దొఱికి అపజయం పొందడం కన్నా అవి విజేతలుగా నాకు దూరమైనా మేలు కదా! అవి నాకు దక్కాయనే స్వార్థబుద్ధి కన్నా అవి గెలిచాయనే విషయం నాకు ఎక్కువ సంతోషాన్ని ఇస్తుంది". తోటి మనుషులనే కాకుండా పశుపక్ష్యాదులను వృక్షములను ప్రేమభావంతో చూసే భారతీయతను రామయ్యలో నిండుగా చూసిన రక్షకభటులు రామయ్యకు నమస్కరించి వెళ్ళిపోయారు.

**పిల్లలూ! ఈ కథలోని నీతి మరొక్కమాఱు చూద్దాము:**
పశుసంపదను ప్రేమించి పూజించే భారతీయ తత్త్వాన్ని మనకు గుర్తుచేసిన రామయ్య ధన్యజీవి. మనకు ఆచార్యతుల్యుడు.

## దిలీప మహారాజు కథ

శ్రీకాళిదాసకృత రఘువంశం లోని కథ

రఘువంశపు రాజైన దిలీపునికి చాలా కాలం వరకూ సంతానం కలుగలేదు. తన అర్ధాంగి అయిన సుదక్షిణాదేవితో సహా సద్గురు దర్శనం కోసం వసిష్ఠ మహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. తనకుగల చింతను వ్యక్తపఱచాడు. ఒక్క నిమిషము ధ్యానముచేసి వసిష్ఠుల వారు ఇలా అన్నారు "నాయనా! నీవు ఒకసారి దేవేంద్రలోకం వెళ్ళి తిరిగి వస్తున్నప్పుడు కల్పవృక్ష ఛాయలో ఉన్న కామధేనువును గమనించలేదు. గోవు కనబడగానే నమస్కరించి ప్రదక్షిణము చేయాలి. ఇక కామధేనువు మాట వేరే చెప్పాలా? సర్వధర్మాలు తెలిసిన నీవు అప్పుడు ఋతుస్నాత అయిన నీ భార్య దగ్గర ఉండాలన్న ధర్మము పాటించే తొందరలో వేగముగా నీ మందిరము చేరదామని వస్తున్నావు. ఆ కారణముగా నీవు ఆ కామధేనువును గమనించకే వచ్చేశావు. నీచే పూజ్యపూజావ్యతిక్రమము జరిగినది. పూజ్యులను గుర్తింపక పోవుట శ్రేయస్సుకు భంగకరము కదా!

అప్పుడు కామధేనువు "రాజా! నన్ను పూజించకనే తొందరలో ఉండి వెళ్ళిపోతున్నావు. నా సంతానామును సేవించిన కానీ నీకు సంతానం కలుగదు" అని చెప్పినది. కానీ రథవేగము వలని వాయుధ్వని కారణముగా నీకుగానీ నీ సారథికిగానీ ఆ కామధేనువు చెప్పిన మాటలు వినబడలేదు. నాయనా! తెలిసిచేసినా తెలియకచేసినా కర్మఫలం అనుభవించక తప్పదు. చేసిన తప్పును సరిదిద్దుకుని ప్రగతిపథంలో నడిచేవాడు ఉత్తముడు. కావున నీవు గోసేవ చేసి శ్రేయస్సును పొందు. వరుణుని యజ్ఞములో పాలు నేయి ధనధాన్యాలు సమకూర్చుటకై కామధేనువు పాతాళలోకానికి వెళ్ళినది. ఆ గోమాత తరిగి వచ్చేంత వరకూ ఆమె సంతానమైన ఈ నందినీధేనువును సేవించి తరించు".

ఇలా వసిష్ఠులవారు హితవు చెప్తుండగానే ఆ నందినీధేనువు రానేవచ్చింది. దిలీపుడు పరమసాధ్వి అయిన సుదక్షిణాదేవీ ఆ నందినీధేనువును సేవించుట ప్రారంభించారు. ఆ రాజదంపతులు నందినీధేనువును నీడలాగా అనుసరించి సేవించారు. ఆ ధేనువు నిలిచిన నిలిచి కూర్చున్న కూర్చుని నీళ్ళు త్రాగిన త్రాగి ఆ నందినీధేనువును ఆరాధించారు. ఇలా 21 దివసములు ఆ రాజదంపతులు ధేనువ్రతమును పరమభక్తితో చేశారు. వారి సేవకు సంతోషించిన నందినీధేనువు వారి భక్తిని పరీక్షిద్దామని హిమాలయములో ఒక గంభీర బిలంలోకి ప్రవేశించింది. త్రుటిలో ఒక సింహం ఆ హోమధేనువు మీద పడబోయింది. వెంటనే రాజు ఆ ధేనువును కాపాడటానికి ధనుర్బాణాలు తీయబోయాడు. కానీ ఆశ్చర్యం! చిత్రపటంలో వీరునిలాగా ఉండిపోయాడు. ఆ సింహము మాయ వలన స్థాణువుగా ఉండిపోయాడు. ప్రగల్భముగా అప్పుడు సింహమన్నది "రాజా! గిరిజాపతి ఆజ్ఞపొంది నేనీ పరిసరాలలో విహరిస్తున్నాను. శివ కింకరుడను. నా మీద నీ శక్తులేమీ పనిచేయవు. నేను మామూలు సింహాన్ని కాను. ప్రతిదినము పరమేశ్వరుడు నందిని ఆరోహించేటప్పుడు నన్ను పాదపీఠికగా నియోగించి అనుగ్రహిస్తాడు. నేను నికుంభ మిత్రుడనైన కుంభోదరుడను. పార్వతీదేవికి పుత్రప్రాయమైన ఈ దేవదారు వృక్షాన్ని కాపాడటానికి పరమశివుడు నన్నిక్కడ నియమించాడు. ఈ ప్రాంతాలకి వచ్చే ఏ మృగాన్నైనా భక్షించే అధికారం నాకు ఉన్నది".

"నా పరాక్రమం బాహుబలం వృథా అవుతున్నవే! ఈ నందినీ ధేనువును కాపాడలేక పోతున్నానే" అని అనుకుంటున్న రాజు "నేను కుంభోదరుడను. శివ కింకరుడను" అన్న మాటలు వినగానే కొంచెం కుదుటపడ్డాడు. "భగవత్ శక్తి ముందు మానవశక్తి అత్యల్పమే కదా!" అని అనుకున్నాడు. ఆ కుంభోదరునితో ఇలా అన్నాడు "ఓ దివ్య సింహమా! సృష్టి స్థితి లయ కారకుడైన ఆ పరమేశ్వరుడు నీకువలె నాకుకూడా పరమ పూజ్యుడు. కానీ హోమధేనువైన ఈ నందినిని కాపాడటము ధర్మమే కదా! మన ఇద్దరికీ శ్రేయోదాయకమైనది చెప్తాను. నా ఈ శరీరాన్ని ఆహారముగా స్వీకరించి నా గురుధనమైన ఈ నందినీధేనువును వడిచిపెట్టు".

ఇది వినగానే కుంభోదరుడు నవ్వి "ఓ రాజా! నీవు చాలా మూఢుని వలెనున్నావు. నీవు ఈ భూమండలానికి ఏకఛత్రాధిపతివి. యవ్వనములో ఉన్న మన్మథాకారుడవు. ఒక్క గోవు కోసం అన్నీ వదులుకుంటావా? అల్పకారణానికి అధికమూల్యం ఎందుకు చెల్లిస్తావు? ఈ ఆవు కాకపోతే ఇలాంటివి కోటి మీ గురువు గారికి ఇవ్వచ్చు. నీ పాలనలో సుఖంగా ఉండే కోట్లాది ప్రజలను అనాథలను చేసి ఈ గోవు కోసం శరీర త్యాగముచేస్తావా? నీకు ఎట్టి అపకీర్తి రాదు. గురుద్రోహం అంటదు" అని అన్నాడు దిలీపుని ప్రలోభపెడదామని. అది విని ధర్మాత్ముడైన దిలీపుడు "క్షతము (ఆపద)

నుండి రక్షించేవాడే క్షత్రియుడు. అట్లు చేయనివాడు రాజు ఎట్లా అవుతాడు? అదీ కాక ఎదురుగా హింస జరుగుతున్నా కాపాడకుండా చూస్తూన్న ప్రాణాలు ఎందుకు? ఓ శివ కింకరుడా! నీవు దేవతామూర్తివి. నా శరీరము స్వీకరించి ఈ ధేనువును విడిచి నా ప్రార్థన మన్నించు" అని అన్నాడు.

ఎట్లాగో చివరికి ఒప్పుకున్నది సింహం. స్థాణువుగా ఉన్న రాజు మామూలుగా కదలగడిగాడు. తనును తాను సింహానికి అర్పిద్దామని మోకాళ్ళ పై కూర్చుని తలవంచుకుని సింహం పేటుక్కై ఎదురు చూస్తున్న దిలీపుడి మీద పుష్పవృష్టి కురిసింది! నందినీధేనువు దివ్యాకృతి దాల్చి "రాజా! వసిష్ఠ మహర్షి తపశ్శక్తి వలన నన్ను ఈ సింహమే కాదు విశ్వంలో ఏ శక్తీ హానికలిగించలేదు. నిన్ను పరీక్షిద్దామనే ఇలా చేశాను. నీ భక్తితో నన్ను మెప్పించావు. దివ్యమైన నా క్షీరము స్వీకరించు. సంతానవంతుడివి అవుతావు" అని అన్నది నందినీధేనువు.

అప్పుడు ధర్మజ్ఞుడైన దిలీపుడిలా అన్నాడు "తల్లీ! నీ కరుణ అమోఘం. నన్ను నా అర్థాంగిని ధన్యుల్ని చేశావు. లేగ దూడ నీ పాలకై ఎదురు చూస్తుంది. మహర్షులు యజ్ఞార్థము నీ క్షీరమునకై నిరీక్షిస్తూ ఉంటారు. వారు తీసుకున్న తరువాత మిగిలిన దానిలో ఆఱోవంతు తీసుకుంటాను (ధర్మాత్ముడైన రాజు ప్రజలనుండి 1/6 మాత్రమే కప్పముగా తీసుకుంటాడు)". "తథేతి" అని ఆశీర్వదించింది నందినీ. ధేనువ్రత మహిమ వలన రఘు మహారాజును పుత్రునిగా పొందినాడు దిలీపుడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమారు చూద్దాము:**

౧. పూజ్యులను ఎల్లవేళలా యథావిధిగా పూజించాలి. తొందరలో ఉండి కామధేనువును గమనించకుండా వెళ్ళిపోవుట వలనే దిలీపునికి శ్రేయస్సు ఆగిపోయింది. కావున పెద్దలను సాధు సజ్జనులను గోవులను ఎల్లప్పుడూ గౌరవించడం మన విధి.

౨. ఆపదలో ఉన్న గోమాతను కాపాడటానికి తన ప్రాణాలను సైతం ఇద్దామనుకున్న దిలీపుడు ఉత్తముడు. అతని గురుభక్తి ధేనువ్రత దీక్ష అసామాన్యాలు.

౩. "దూడ త్రాగిన తరువాత మహర్షులు తీసుకున్న తరువాత పాలుతీసుకుంటాను" అని అన్నప్పుడు దిలీపుని మహోన్నత వ్యక్తిత్వం మనకు తెలిసినది. 1/6 మాత్రమే తీసుకుంటాను అన్నప్పుడు ఆ రాజు యొక్క ధర్మబుద్ధి మనకు అవగతమైనది. ఇట్టి ధర్మాత్ములే మనకు ఆదర్శపురుషులు.

## చ్యవనమహర్షి – జాలరులు

మహాభారతము లోని కథ

భృగుమహర్షి పులోమాదేవి పుత్రుడైన చ్యవనుడు దివ్య తేజోసంపన్నుడు ఆయుర్వేద ప్రవీణుడు. ఆ చ్యవనుడి అర్థాంగి మహాపతివ్రత అయిన సుకన్యాదేవి. వారి సంతానము దధీచిమహర్షి ప్రమతి ఆప్రవానుడు. ఒకసారి గంగాయమున సంగమ జలాలలో మునిగి సమాధిపరుడై ఎంతో కాలం తీవ్ర తపస్సు చేశాడు చ్యవనుడు. తాపసులు కామక్రోధాదులను జయించినవారు. ఆ నీటిలో తిరిగే చేపలు హాయిగా ఆయన శరీరమంతా ఎక్కి తిరిగినా ఏమనక వాటి చిలిపి చేష్టలకు సంతోషించేవాడు చ్యవనుడు. ఇలా ౧౨ యేండ్లు గడిచాయి. ఒకసారి విధివశాత్తు కొందరు జాలరులు ఆ ప్రాంతాలకు వచ్చి వలని వేయగా చేపలతోబాటు చ్యవనుడు కూడా ఆ వలలో చిక్కినాడు. మహర్షి తపస్సు భంగమైనదని తమ తప్పు క్షమించమని ఆ మహర్షిని ప్రార్థించారు జాలరులు.

"ఓ జాలరులారా! భయపడకండి. మీరేతప్పూ చేయలేదు. మీ విధినిర్వహణలో తెలియకుండా ఇలా జరిగినది. మీ కష్టం ఊరికే పోకూడదు. శ్రమించినందుకు తగిన ఫలితము మీకు రావాలి. అందుకని నన్ను కూడా అమ్మి ఆ సొమ్ము తీసుకోండి" అని అన్నాడు. చ్యవనుడి ఉదార స్వభావానికి అశ్చర్యపడిన ఆ జాలరులు తమదే దోషమని తలంచి మహర్షి తపస్సు భంగపఱచామని రాజైన నహుషుడి వద్దకు వెళ్ళి వాళ్ళంతట వాళ్ళు తమ తప్పు విన్నవించి తమను శిక్షించమని కోరారు.

జాలరుల నిజాయితీకి సంతోషించి ధర్మాత్ముడైన నహుషుడు మంత్రి పురోహితులతో సహా ఆ మహర్షి కడకేగి ఆయనకు పాదాభివందనం చేసి "మహానుభావా! ఈ బెస్తలు తెలియక తప్పుచేశారు. దీనికి ప్రాయశ్చిత్తమేమిటో మీరే సెలవీయ్యండి" అని అన్నాడు. దయామయుడైన చ్యవనుడు "రాజా! ఈ జాలరుల దోషమేమీ లేదు. వారి కులవృత్తిని పాటించారు అంతే. వీరికి వారి కష్టమునకు తగిన వెల దక్కేటట్టు చూడు" అని సత్యభాషణం చేశాడు. నహుషుడు తన మంత్రులతో ఆ జాలరులకి వెయ్యి మాడలు ఇవ్వమని ఆదేశించాడు. కానీ చ్యవనుడు అది తనకు సరైన వెలకాదన్నాడు. రాజు పదివేలు లక్ష చివరికి కోటి మాడలిస్తానన్నా అది తనకు సరైన ధరకాదన్నాడు చ్యవనుడు. నహుషుడు "అయితే అర్ధరాజ్యమిస్తాను" అని అన్నాడు. "నీ మంత్రులతో సంప్రదించి చూడు" అన్నాడు చ్యవనుడు. "ఆలోచించడానికేమున్నది? నా రాజ్యసర్వస్వమూ ఇస్తాను" అని అన్నాడు నహుషుడు! చ్యవనుడు అయినా అది సరిపోదన్నాడు.

ఏమి చేయాలో తోచని నహుషుడికి ఇలా సలహా ఇచ్చాడు గవిజాతుడనే ఒక మహాముని "గోవు త్రిలోక పూజ్యమైనది. సర్వదేవతా స్వరూపమైనది. సకల వేద శాస్త్రాలకు ఆశ్రయుడైన మహర్షికి వెల కట్టడం అసాధ్యం. అలాగే గోవుకు కూడా వెలకట్టలేము. అందుకని ఒక గోవునివ్వు". అలాగే చేశాడు నహుషుడు. చ్యవనుడు సంతోషించాడు. తగిన వెల ఇచ్చావని అన్నాడు.

ఆ జాలరులు కూడా సామాన్యులా? ఇలా అనుకున్నారు "ధనధాన్యాదులు ఎప్పుడైనా సంపాదించవచ్చు. కానీ ఒక మంచి పని చేశే అవకాశము మళ్ళీ మళ్ళీ రాదు. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి". ఇలా అనుకుని మహర్షి కడకేగి "అయ్యా! బ్రహ్మ తుల్యమైన ఈ గోమాతను మీరే స్వీకరించి మమ్ము అనుగ్రహించండి" అని అన్నారు. వాళ్ళ మంచితనానికి సంతోషించిన చ్యవనుడు ఈ చేపలకీ మీకూ సద్గతులు కలుగుతాయి అని

ఆశీర్వదించాడు. ఆ తరువాత నహుషుడి ధర్మబుద్ధికి మెచ్చి చ్యవనుడు గవిజాతుడు తమని వరంకోరుకో మన్నారు. వినయముతో నహుషుడు "స్వామీ! మీరు తృప్తిపొందితే అదే చాలు. నాకింకేదీ అక్కరలేదు" అన్నాడు. అతని వినయవిధేయతలకు ఆనందించి ఇంద్రపదవిని అనుగ్రహించి అంతర్ధానమయ్యారు ఆ మహర్షులు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. తన తీవ్ర తపస్సు భంగమైనా కొంచముకూడా కోపించకుండా చ్యవనుడు తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్న ఆ జాలరులను మన్నించాడు.
౨. జాలరుల నిజాయితీ మనకు కనువిప్పు కావాలి. చేసిన తప్పుకు శిక్షను అనుభవించడానికి తమకు తాముగా పెళ్ళారు జాలరులు.
౩. సత్కర్మలు చేసే అవకాశం అరుదుగా వస్తుందని. వచ్చినప్పుడు సంకోచించకుండా వాటిని చేయాలని మనకు చూపించారు జాలరులు.
౪. గోమాత యొక్క ప్రాధాన్యము ఈ కథలో మనకు తెలిసినది. సాక్షాత్తు బ్రహ్మదేవునితో సమానమైనది గోవు అని చెప్పాడు గవిజాత మహర్షి.
౫. ధర్మపాలనకై తన సర్వస్వమునూ త్యాగం చేయటానికి సిద్ధపడ్డ నహుషుడు మనకు ఆదర్శము కావాలి.

## ద్రౌపదీదేవి – ఆదర్శ భారతనారి

శ్రీమద్భాగవతం లోని కథ

మహాభారత యుద్ధములో సర్వనాశనమైన కౌరవపతి దుర్యోధనుని సంతృప్తి పఱచుటకై అశ్వత్థామ తన స్వభావానికి భిన్నముగా ప్రవర్తించి అతి కిరాతకముగా ఉపపాండవులను (పాండవుల పుత్రులు) నిద్రిస్తుండగా వధించినాడు. ఆ ఘోరకృత్యం తెలుసుకున్న పాండవులు ద్రౌపదీదేవి దుఃఖానికి అంతులేదు. పసిపాపలైన బాలకులను నెత్తుటి మడుగులో చూసిన వారి గుండెలు పగిలినాయి. తన పుత్రులందఱినీ పోగొట్టుకుని విలపిస్తున్న ద్రౌపదీదేవిని ఓదార్చాడు అర్జునుడు. "ఇంత దారుణమైన పనిచేసిన ఆ అశ్వత్థామను నీ వద్దకు లాక్కువస్తాను" అంటూ పాఱిపోతున్న ఆ ద్రౌణి వెనకాల బడ్డాడు అర్జునుడు. శ్రీకృష్ణార్జునుల రథము తనను త్వరిత గతిలో సమీపిస్తున్నదని తెలిసిన అశ్వత్థామ ప్రాణరక్షణకై బ్రహ్మాస్త్ర ప్రయోగం తప్ప అన్యమేదీ తనను కాపాడజాలదు అనుకుని రథమాపి ఆచమించి శుచి అయ్యి మంత్ర ప్రయోగము చేశాడు. ప్రళయకాల రుద్రునిలా సమీపించే ఆ బ్రహ్మాస్త్రాన్ని చూసి శ్రీ కృష్ణుడు ప్రతి బ్రహ్మాస్త్ర ప్రయోగం చేయమని ఆజ్ఞాపించాడు.

అర్జునుడు కూడా ఆచమించి శుచి అయ్యి పరమాత్మకు ప్రదక్షిణము చేసి బ్రహ్మాస్త్ర ప్రయోగం చేశాడు. ఆ రెండు అస్త్రాలు సూర్యాగ్నుల వలె ప్రజ్వరిల్లాయి. వాటి ప్రభావము చతుర్దశ భువనాలను దహింపగలదని తెలిసిన శ్రీ కృష్ణుడు ఆ అస్త్రాలను ఉపసంహరించమనినాడు. అస్ఖలిత బ్రహ్మచారి అయిన శ్రీకృష్ణుని ప్రియమిత్రుడైన అర్జునుడు శాస్త్రకోవిదుడు. అందుకే గృహస్థుడైనా కూడా బ్రహ్మచర్యమును పాలించుటచే ఆ రెండు బ్రహ్మాస్త్రాలనూ ఉపసంహరించ గలిగినాడు. అలా లోకాలను తన బ్రహ్మచర్య శక్తితో కాపాడిన అర్జునుడు ఆ అశ్వత్థామను బంధించి ద్రౌపదీదేవి ముందుకు తెచ్చి పడేశాడు. చిన్న పిల్లల ప్రాణాలు తీసిన ఆ అశ్వత్థామ ద్రౌపదిముందు సిగ్గుతో తల ఎత్తలేకపోయాడు. పరాన్ముఖుడైన గురుపుత్రునికి నమస్కరించి సుగుణవతియైన ద్రౌపదీదేవి ఇలా ధర్మ్యభాషణం చేసింది

"నాయనా! మీ తండ్రిగారైన ద్రోణాచార్యుల వారి వద్ద మా మగవారు విద్యాభ్యాసం చేశారు. పుత్రరూపములో ఉన్న ద్రోణుడవు నీవు. మాకు గురుతుల్యుడవైన నీవు ఇలా నీ శిష్యనందనులను దారుణముగా వధించడం ధర్మమా? తమకి హాని కలిగించినా ఎదుఱుకోలేని పసివాళ్ళను నీకెన్నడూ అపకారము చేయని అందాలు చిందే పాపలను నిదురించి ఉండగా చంపటానికి నీకు చేతులెలా వచ్చాయి? ఓ గురుపుత్రా! ఇక్కడ నేను నా పుత్రులకై ఏడుస్తున్నట్లే అక్కడ నీ తల్లి కృపి నీకోసం ఎంతగా విలపిస్తున్నదో. అర్జునుడు బంధించి తీసుకు పోయాడన్న వార్త వినగానే ఎంత పరితాపమును చెందినదో". ఇలా అని శ్రీకృష్ణార్జునుల వైపు చూసి

"ద్రోణాచార్యులవారు స్వర్గస్థులైనా ఇతని మీదే ఆశలుపెట్టుకుని జీవిస్తున్నది ఆ సాధ్వి కృపి. నాలాగే పిల్లవాడి కోసం ఎంతో బాధపడుతూ ఉంటుంది. గురుపుత్రుడైన ఈ అశ్వత్థామను వదిలి పేయండి! గురుపుత్రుని వధించుట ధర్మము కాదు" అని అన్నది పరమ పతివ్రత అయిన ద్రౌపదీదేవి.

ఈ ప్రకారం ద్రౌపదీదేవి ధర్మసమ్మతంగా దాక్షిణ్యసహితంగా నిష్కపటంగా నిష్పక్షపాతంగా న్యాయంగా ప్రశంసనీయముగా పిలికినది. పాంచాలి మాటలు విని ధర్మనందనుడు ఎంతో సంతోషించాడు. భగవంతుడైన శ్రీ కృష్ణుడు ఆమెను ఎంతగానో పొగిడినాడు. అక్కడ ఉన్న అందఱూ ఆమె మాటలను సమర్థించారు. కానీ భీమసేనుడు "కన్న కొడుకులను క్రూరముగా చంపినవాడు కళ్ళముందున్నా కోపం తెచ్చుకోకుండా విడవ మంటుందేమిటి? స్వాభావికముగా దయ ఉన్నవాడే బ్రాహ్మణుడు కానీ ఇలా ఘోరకృత్యం చేసిన ఈ అశ్వత్థామ క్షమార్హుడు కాదు" అంటూ ఆ అశ్వత్థామ పైకి దూకాడు.

తొందరలో ఏమి చేస్తాడో అని ఆ గురుపుత్రునికి అడ్డంగా నిలబడినది ద్రౌపదీదేవి!! శ్రీ కృష్ణుడు చతుర్భుజుడై రెండు చేతులతో భీమసేనుడిని మిగిలిన రెంటితో ద్రౌపదిని వారించి ఇలా ధర్మబోధ చేశాడు "శిశుఘాతకుడూ కిరాతకుడూ అయిన ఈ అశ్వత్థామ ముమ్మాటికీ చంపదగిన వాడే. కానీ గురుపుత్రుడు పైగా విప్రుడు అయినందువల్ల వీనిని చంపకుండా శిక్షించాలి. ఒక వీరునికి తలగొఱగటం కన్నా అవమానకరమైనది ఏదీ లేదు. ఈతని శిరోజాలు ఖండించి అవమానించి పంపుదాం". అప్పుడు విశ్వమంతా కొనియాడ తగ్గవాడూ వీరాధివీరుడూ అయిన అర్జునుడు ఆ అశ్వత్థామ శిరోజాలు ఖండించి అతని శిరస్సుమీదనున్న దివ్య (జ్ఞాన) మణిని తీసుకుని అవమానించి బయటికి గెంటివేశాడు. అనంతరం చనిపోయిన బంధువులందఱికీ దహన సంస్కారాలు చేసి గంగాతీరములో పొంగిపొఱలే దుఃఖాన్ని దిగమ్రింగుకుని మరణించిన వారికి

తిలోదకాలిచ్చారు పాండవులు. తరువాత శ్రీ కృష్ణుడు పాండవులని గాంధారీ ధృతరాష్ట్రులని ఓదార్చినాడు. ఇలా శ్రీ కృష్ణుడు మహాభారత యుద్ధం ద్వారా దుష్టశిక్షణ చేసి భూభారాన్ని దించాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమారు చూద్దాము:**
పుత్రహంతకుడు కళ్ళ ఎదుటికి రాగానే "గురుపుత్ర! నమస్కారం" అని అనగలిగిన ద్రౌపదీదేవి మనస్సు యొక్క సౌందర్యం వర్ణణాతీతం. అంత దుఃఖములో ఉండికూడా ఏది ధర్మం ఏది అధర్మం అని ఆలోచించి మాట్లాడిన ఆమె ధర్మవర్తనం మనకు ఆదర్శప్రాయం. "నా వలె ఆ కృపి పుత్రుని కోసం ఎంతగా ఏడుస్తుందో" అని దయ జాలి కరుణ క్షమ అనే పదాలకు సీమాంతం చూపి మహాపకారికైనా మహోపకారం చేయగల ద్రౌపదీదేవి వంటి ఆదర్శ నారీమణులు పుట్టిన మన భారతదేశం మహోన్నతమైనది.

## అన్నమాటకి కట్టుబడిన అర్జునుడు

మహాభారతము లోని కథ

పరమేశ్వరుని వరప్రభావముతో సక్షాత్ విష్ణుస్వరూపుడైన వ్యాసుని శాసనముపై ధర్మబద్ధముగా జరిగింది ద్రౌపదీ పాండవుల కళ్యాణము. దేవశిల్పి అయిన విశ్వకర్మచే నిర్మించబడిన ఇంద్రప్రస్థములో ఉన్న ద్రౌపదీ పాండవుల వద్దకు నారదుడు వచ్చి సంసారజీవములో వారుపాటించ వలసిన నీతినియమాలను వివరించాడు. అన్ని విషయాలు వివరిస్తూ ఇలా అన్నాడు "ఓ పాండవులారా! విమలబుద్ధితో వినండి. ద్రౌపదీదేవి మీ ఒక్కొక్కరి ఇంట్లో ఒక్కయేడాది క్రమముగా ఉంటుంది. ఆ కమలాక్షి ఉన్న ఇంటి యజమానికి తెలియకుండా మీరెవరైనా ఆ అంతఃపురానికి వెళితే ప్రాయశ్చిత్తముగా ఒక ఏడాది కఠిన వ్రతనియమాలు పాటించి తీర్థయాత్రలు చేయాలి". పాండవులందఱూ నారదుని చెప్పిన ఆ సమయనియమాన్ని శిరసావహిస్తామని నిశ్చయించుకున్నారు.

ఇట్లా ఉండగా ఒక రోజు ఒక బ్రాహ్మణుడు దొంగలచేత తన హోమధేనువును పోగొట్టుకున్నవాడై తనను రక్షించమని ఆక్రోశించాడు. ఆ విప్రుని ఆర్తనాదం విన్న అర్జునుడు దుఃఖమునకు కారణమడిగి ఏమి జరిగినదో తెలుసుకున్నాడు. అర్జునుడి ధనుస్సు ధర్మరాజు ఆయుధశాలలో ఉన్నది. అప్పుడు ద్రౌపదీదేవి ధర్మరాజు అంతఃపురములో ఉన్నది. ఆ కారణముగా ఆయుధశాలకి ప్రవేశించి నారదుడు వారికి విధించిన నియమభంగము అవుతుందని తెలిసినా ప్రాయశ్చిత్త క్లేశమునకు జంకక ఆ వీరాధివీరుడైన అర్జునుడు ఆర్తరక్షకై ఆయుధాలయం ప్రవేశించి తన ధనువు తీసుకుని ఆ దొంగలను వెంబడించాడు. దుష్టులైన ఆ దొంగలను శిక్షించి విప్రుని హోమధేనువు అతనికి తిరిగి ఇచ్చివేశాడు.

తరువాత సత్యవంతుడైన అర్జునుడు ధర్మరాజు వద్దకువెళ్ళి జరిగినది చెప్పి తనకు తీర్థయాత్రలు చేసి ప్రాయశ్చిత్తము చేసుకునే అవకాశం ఇవ్వమని కోరినాడు. అంతట ఆ ధర్మనందనుడిలా అన్నాడు "సోదరా! క్రూరకర్ములై ఆ విప్రుని హోమధేనువును అపహరించిన ఆ దొంగలను శిక్షించి నీవు ధర్మమే చేశావు. ఇట్టి దుష్టులను ఉపేక్షించిన మహాపాపము. అందుకని సమయభంగమైనది నీవు విచారపడనక్కరలేదు. ధర్మరక్షణకై చేశావు కనక నీవు ఎందుకు తీర్థయాత్రలకు వెళ్ళటం"?

అప్పుడు శ్రీకృష్ణ ప్రియసఖుడైన అర్జునుడిలా అన్నాడు "అన్నయ్యా! ప్రజారక్షణ అనే వ్యాజముతో (వంకతో) నేను ఆడిన మాట తప్పుట మంచిదికాదు కదా! నా పాపము తీరే విధముగా తీర్థయాత్రలు చేసేందుకు నాకు అనుజ్ఞ ఇవ్వండి". తమ్ముని సత్యావాక్ పరిపాలనకు సంతోషించి అతనికి దూరముగా ఉండట ఇష్టములేక పోయినా తీర్థయాత్రలకు పంపించాడు. తరువాత ఆచార్యుల పెద్దల అనుమతి తీసుకుని అర్జునుడు రాజభోగాలన్నీ తృణప్రాయంగా ఎంచి వేదవేదాంగ విదులైన పండితులను సహాయముగా తీసుకుని సకల తీర్థాలూ సేవించి పావనుడైనాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమారు చూద్దాము:**
కఠినమైన వ్రతనియమాలతో ఉండి రాజ భోగాలు విడిచి తీర్థయాత్రలు చేయాలని తెలిసినా అర్జునుడు తన కర్తవ్య పాలన చేయడానికి వెనకాడకుండా ఆయుధాలయానికి వెళ్ళి ధనువు తెచ్చి దుష్టశిక్షణ చేశాడు. తనంతట తాను వెళ్ళి తన తప్పుకు ప్రాయశ్చిత్తము చేసుకునే అవకాశమీయ మని ధర్మరాజును ప్రార్థించి తన సత్యావాక్ పరిపాలనా దీక్షను మనకు చూపించాడు.

## భర్తృహరి కథ

విక్రమార్కుని కథలలోని కథ

మహానుభావుడైన కేశవశర్మకు నలుగురు ఉత్తములైన పుత్రులు దైవానుగ్రహము వలన కలిగినారు. సంస్కృత వ్యాకరణకర్త దివ్య శివమహిమ్నః స్తుతికర్త అయిన కాత్యాయన వరరుచి, అతిలోక సాహవంతుడు ధర్మాత్ముడు మహాకాళీభక్తుడు అయోధ్యాలయ పునరుద్ధారకుడు శకకర్త అయిన విక్రమార్కుడు, పండితుడు మహావివేకవంతుడు కాళీ అనుగ్రహపాత్రుడు అయిన భట్టి మరియు సంస్కృత మహాకవి సుభాషిత రత్నావళికర్త వాక్యప్రదీప, రాహత, కారిక గ్రంథకర్త అయిన భర్తృహరి ఆయన నలుగురు కుమారులు. కేశవశర్మ యోగ్యుడైన భర్తృహరికి రాజ్యభారమప్పగించి వానప్రస్థమును స్వీకరించాడు. చిన్నప్పటినుంచి భర్తృహరి సాధుసజ్జనుల సేవలుచేస్తూ ఉండేవాడు.

భర్తృహరి రాజ్యములో ఒక నిరుపేద బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు ధనానికి పేదకాని గుణానికి కాదు. సౌశీల్యుడు మంత్రతంత్రశాస్త్ర కోవిదుడు అయిన ఆ విప్రోత్తముడు భువనేశ్వరీదేవి ఉపాసకుడు. మాత ఆ పరమభక్తుని అనుగ్రహించదలచి ఆయన ముందు ప్రత్యక్షమై

"కుమారా! నీ గుణసంపదను భక్తిని మెచ్చినాను. ఈ దివ్యఫలం తీసుకో. ఈ ఫలం తిన్నవాడికి జరామరణాలు ఉండవు!" అని ఆజ్ఞాపించింది జగజ్జనని.

గుణాగ్రగణ్యుడైన ఆ బ్రాహ్మణుడు ఇలా ఆలోచించాడు "నేను ఒక పేదబ్రాహ్మణుడను. అమృతత్వము సంపాదించిననూ నేను ఎవరిని కాపాడగలను? ఈ పండు కనక మన మహారాజుగారు తింటే ఎందఱో నిర్భాగ్యులను రక్షించగలడు. అప్పుడే నేనీ ఫలమును సద్వినియోగము చేసినవాడను అవుతాను". ఇలా తలచి ఆ బ్రాహ్మణుడు మహారాజైన భర్తృహరి వద్దకు వెళ్ళి అతనిని ఆశీర్వదించి ఆ దివ్యఫలాన్ని అతనికిచ్చి వచ్చేశాడు!

ఫలము యొక్క మహిమను అర్థంచేసుకోలేక భర్తృహరి ఆ ఫలమును తన ప్రియురాలైన అనంగసేనకు ఇచ్చివేసాడు. కుటిలాత్మురాలైన ఆ అనంగసేన తన సఖుడైన అశ్వపోషకునికి ఆ దివ్యఫలం ఇచ్చింది. మూర్ఖుడైన ఆ అశ్వపోషకుడు తన దాసికి ఆ ఫలాన్ని ఇచ్చాడు. ఆమె తనకు ప్రియుడైన ఒక గోపాలకునికి ఫాలాన్ని ఇవ్వగా వాడు దానిని తన ప్రియురాలికిచ్చాడు. ఆ చిన్నది పశువులపెంట ఉన్న బుట్టలో పండును పెట్టి రాజమార్గముగుండా ఆ బుట్టను తలపైపెట్టుకొని తన ఇంటికి వెళ్ళింది. భర్తృహరి ఆ పండును చూశాడు. బ్రాహ్మణుడు మహాత్యాగం చేసి లోకహితార్థం తనకిచ్చిన దివ్యఫలం చివరికి పెంటబుట్టలో చేరిందని బాధపడ్డాడు. ఆ పండు ఎంతమంది చేతులు మారిందో తెలుసుకున్నాడు.

ఒక్కసారిగా భర్తృహరికి వైరాగ్యం వచ్చింది. సంసారం మీద విరక్తి పుట్టింది. తను ఎవరినైతే ప్రియులు అనుకుంటున్నాడో వాళ్ళు నిజమైన ప్రియులు కాదని పరమేశ్వరుడొక్కడే ప్రాణబంధుడని తెలుసుకున్నాడు. మిథ్యాజగత్తులోని విషయభోగాలను త్యజించి రమేశునిపై అనురక్తుడై వైరాగ్యముతో తపోవనాలకు వెళ్ళడనికి సిద్ధపడ్డాడు. దేవీప్రసాదమైన ఆ దివ్యఫలాన్ని తన రాజ్యసర్వస్వాన్ని యోగ్యుడైన విక్రమార్కుని చేతిలో పెట్టి తపస్సుకై వెళ్ళిపోయాడు.

మహౌదార్యుడైన విక్రమాదిత్యుడు తన వద్దకు వచ్చిన దీనుడైన ఒక బ్రాహ్మణునిపై జాలిపడి ఆ దివ్యఫలాన్ని అతనికి ఇచ్చివేశాడు!!

రత్నైర్మహార్హైస్తుతుషుర్న దేవా న భేజిరే భీమ విషేణ భీతిమ్।
సుధాం వినా న పరయుర్విరామం న నిశ్చితార్థాద్విరమన్తి ధీరాః॥
– భర్తృహరి నీతిశతకమ్

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. విప్రోత్తముని సద్భావము మనకు కనువిప్పుకావాలి. లోకంలో జనాలు వృద్ధాప్యం రాకూడదు మృత్యువు రాకూడదు అని తపిస్తుంటే ఆ బ్రాహ్మణుడు జరామరణ రహితముగా చేసే దివ్యఫలాన్ని లోకహితార్థం మహారాజుకు ఇచ్చివేశాడు. స్వధర్మపాలలనో పరాకాష్ఠను చూపిన ఆ భూసురుడు ధన్యుడు.
౨. "అంతా మిథ్య తలంచిచూచిన" అన్న సత్యాన్ని తెలుసుకున్నాడు భర్తృహరి. లౌకిక విషయాలను విడిచి మోక్షమార్గోన్ముఖుడైనాడు. ఆయన మనకు అందించిన సుభాషితాలను చదివి అర్థంచేసుకుని మన నిత్యజీవితములో అనుసంధానం చేసుకోవడం మన కర్తవ్యము.
౩. విక్రమార్కుని ఔదార్యము గొప్పది. దీనుడైన విప్రునికి దివ్యఫలాన్ని దానం చేసి తన త్యాగబుద్ధిని మనకు చూపినాడు.

## ఏకచక్రపుర బక వధ

మహాభారతము లోని కథ

"అమ్మా! ఎందులకు నీవు పుత్రత్యాగము చేయుచున్నావు? ఎవ్వని బాహుబలము వలన మనము లాక్షాగృహము నుండి బయటపడ్డామో ఎవ్వని శక్తి సామర్థ్యాలవల్ల దుష్టుడైన పురోచనుడు నశించాడో ఎవ్వని బలపరాక్రమాలు మనల్ని ఎల్లవేళలా దుర్యోధనుని బాఱినుండి కాపాడుతున్నాయో ఏ వీరుని అండ చూసుకుని మనము సుఖముగా జీవిస్తున్నామో ఏ మహాబలశాలి కౌరవాదులకు గుండెదిగులు అయ్యాడో ఎవ్వని పై భారం మోపి పోగొట్టుకున్న రాజ్యలక్ష్మిని మఱల పొందుదామనుకుంటున్నామో అట్టి నాగాయుధ బలసంపన్నుడైన భీమసేనుని ఎందులకు త్యాగము చేస్తున్నావు తల్లీ"? అని బకాసురునికి ఆహారముగా వెళుతున్న తమ్ముని చూసి తల్లి అయిన కుంతీదేవిని అడిగాడు ధర్మరాజు.

"నాయనా! ప్రస్తుతము మనము ఈ విప్రోత్తముని ఇంటిలో ఆశ్రయము తీసుకుంటున్నాము. ఆ విప్రుని కుమారుడు బకాసురునకు ఆహారము కాకుండా కాపాడి ఆయన మనపై చూపిన వాత్సల్యానికి కృతజ్ఞతను చూపించాలి. ప్రత్యుపకారం మన కనీస కర్తవ్యము. సాటి వారు బాధలలో ఉన్నప్పుడు ఆదుకోవటం మానవతాధర్మమ్. అదీ కాక ఇటువంటి పండితోత్తముని రక్షించటం మహాపుణ్యదాయకము. లోభం వల్లకానీ తెలియక గానీ మోహము వల్లకానీ నేనీ నిర్ణయము తీసుకోలేదు.

వెయ్యి ఏనుగుల బలమున్న భీమసేనుని పరాక్రమము మనకు తెలియనిది కాదు. హిడింబాసురుని వధించినప్పుడు మనకి అతని శక్తి ఎంతటిదో తెలిసిపోయింది. ఆ భీమసేనుడు పుట్టిన రోజే నా చేయిజారి క్రింద పడినప్పుడు అతని క్రింద ఉన్న రాయి నుగ్గునుగ్గైపోయింది! యుద్ధములో వజ్రిని కూడా ఢీకొనే బలమున్నది భీమునికి. కనుక ఇతడు నిస్సందేహముగా బకాసురుని వధించి ఈ ఊరికి ఉపకారం చేస్తాడనే నా నమ్మకము. ఆ పైన శ్రీకృష్ణుని దయ" అని హితబోధ చేసింది మహాసాధ్వి అయిన కుంతీదేవి.

ధర్మజుడు తల్లి మాటలు విని ఎంతో సంతోషించి పుత్రవాత్సల్యంతో తమ్ముని మనసారా దీవించి పంపినాడు. అనుకున్న ప్రకారం భీమసేనుడు ఒక బండీలో అన్నం నింపుకుని ఆ రాక్షసుని స్థావరమునకు వెళ్ళి అతనిని పిలిచి తానే ఆ ఆహారమంతా తినసాగాడు. బకాసురుడు నరార్భకుడు తన భోజనం తినేస్తున్నాడని కుపితుడై గట్టిగా భీముని వీపుపై గుద్దాడు. చలించని భీమసేనుడు ఆహారం తీసుకుంటూనే ఉన్నాడు. మహా క్రోధముతో బకుడు ఒక పెద్ద వృక్షమును పెకిలించి భీమునిపైకి విసరబోయాడు.

ఇంతలో భీముడు భోజనము ముగించి కాళ్ళూ చేతులూ కడుక్కోని ఆచమించి శుచి అయ్యి రాక్షసుడు విసిరిన చెట్టుని పట్టుకుని తిప్పికొట్టాడు! అలా కొంత సేపు వారు రాళ్ళతో చెట్లతో భీకర యుద్ధం చేసి చివరికి ముష్టియుద్ధము చేయసాగారు. అలసిపోయిన రాక్షసుని బోర్లదోసి తన మోకాలిని బకుని వీపుపైన ఉంచి బలముగా ఒక్క ముష్టిఘాతం ఇచ్చాడు భీముడు. బకుడు ఆర్తనాదాలు చేస్తూ అసువులు బాసినాడు. ఆ కేకలు విని బకుని బంధువులు బయటికి వచ్చారు. భయకంపితులైన వారితో భీముడు "ఇక నుంచీ మీరు మనుషులను హింసించటం మానకపోతే మీకూ ఈ బకునికి పట్టిన గతే పడుతుంది" అని హెచ్చరించాడు. వారందఱూ అలాగే ప్రతిజ్ఞ చేసి వెళ్ళిపోయారు. ఆ రోజునుండీ ఏకచక్రపురం లోని ప్రజలు హాయిగా జీవించడం మొదులుపెట్టారు.

**పిల్లలూ! ఈ కథ లోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. కుంతీదేవి ధర్మరాజుకు చేసిన హితబోధ మనమెన్నడూ మఱువరాదు. కృతజ్ఞత ఆర్తరక్షణ కనీస కర్తవ్యాలని మనకు ఈ కథ ద్వారా తెలిసినవి.

౨. ఒక సజ్జనుడు తన బలాన్ని పరోపకారానికి ఎలా ఉపయోగిస్తాడో మనకు ఈ కథలో భీమసేనుని ద్వారా తెలిసినది. దుష్టులైన కౌరవులు తమ బలాన్ని యుక్తిని ప్రజాశ్రయస్సుకు వాడకుండా మత్సరముతో పాండవులను మట్టుపెట్టడానికే ఉపయోగించారు.

## పద్మపాద బయన్న కథ

జగద్గురువులైన ఆది శంకరాచార్యులవారికి సనందుడనే శిష్యుడుండేవాడు. ఆ సనందుడు మిక్కిలి గురుభక్తి విద్యలపై ఆసక్తి కలవాడు. తన ఏకాగ్రత వినయవిధేయతల వలన కొద్దికాలం లోనే విద్యలునేర్చి శంకరభగవత్పాదులకు ప్రియ శిష్యుడైనాడు పద్మపాదుడు. "ఏ కారణముగా సనందుడు గురువుగారికింత ప్రియుడైనాడో" అని చర్చించుకుంటున్న తన శిష్యులను విన్నారు శంకరులు. వారికి సనందుని అపారమైన గురుభక్తిని చూపాలని నిశ్చయించుకున్నారు. ఒకసారి ఆది శంకరులు తమ శిష్యసమేతముగా గంగాతీరమునకు వెళ్ళినప్పుడు ఆవలి గట్టునున్న సనందుని చూచి "నాయనా! సనందా శీఘ్రముగా ఇటు రా!" అని పిలిచినారు. గురు ఆజ్ఞయే తప్ప ఇతరము గూర్చి ఆలోచించని సనందుడు వెంటనే కళ్ళుమూసుకుని అనన్యమైన గురుభక్తితో ఇవతలి గట్టుకి నీటి మీద నడచి వచ్చాడు! అప్పుడు సనందుడు నీటిలో మునిగిపోకుండా అతని పాదాల క్రింద పద్మాలను మొలిపించింది గంగాభవానీ. ఆ ఆశ్చర్యకరమైన సంఘటన చూసి ముగ్ధులైన శిష్యులు సనందుని గురుభక్తి తెలుసుకున్నారు. అప్పటి నుంచి సనందుడు పద్మపాదుడనే పేరుతో ప్రసిద్ధుడైనాడు.

చోళదేశంలో పుట్టిన పద్మపాదుడు బాల్యము నుంచి అఖండ నృసింహభక్తుడు. స్వామి సాక్షాత్కారము కోసం పవిత్రమైన అహోబిల అడవులలో ఎన్నో ఏండ్లు తీవ్ర తపస్సును చేసినాడు. కాని నరహరి కరుణించలేదు. శిష్యుని భక్తి పరిపక్వమైనదని గ్రహించిన ఆది శంకరులు ఒకనాడు పద్మపాదుని పిలిచి దగ్గరలో ఉన్న చెంచుగుడెం లోని కొండగుహలో నృసింహస్వామికై తపస్సు చేయమని ఆజ్ఞాపించాడు. గురు ఆజ్ఞపై పద్మపాదుడు కొండగుహ చేరి ఘోర తపస్సు ప్రారంభించాడు. తాపసి వచ్చాడని తెలియగానే పరుగు పరుగున సాధుసేవ చేదామని వచ్చాడు చెంచుగుడెం దొర బయన్న. "సామీ! నేను బయన్నను. ఈ నేల ఏలికను. దేని కోసం నీవు ఇక్కడికి వచ్చావు దొరా"? అని అడిగాడు. "సింహం ముఖముతో మనిషి శరీరంతో ఉండే దేవుని వెదుకుతున్నా" అన్నాడు పద్మపాదుడు. అడవినంతా ఎఱిగిన ఆ బయన్న తానెన్నడూ అట్టి వింత జంతువును చూడలేదన్నాడు. బయన్న మూఢభక్తుడు. ఉంది అని రూఢిగా చెప్పిన పద్మపాదుని మాటలువిని "సామీ! ఆ ముగము నిజంగా ఉంటే కట్టేసి తెస్తా లేకుంటే పానాలు వదిలేస్తా" అని ఆ నరసింహమును వెదుక బయలుదేరాడు బయన్న!

పద్మపాదుడు వర్ణించిన నృసింహస్వామి అద్భుత రూపాన్ని మనస్సులో ముద్రించుకున్నాడు బయన్న. ఏకాగ్రచిత్తంతో నిద్రాహారాలు మాని అడవంతా తిరిగాడు బయన్న. ఎంత శ్రమించినా అణువణువూ పరీక్షగా చూచినా ఎక్కడా కనబడలేదు స్వామి. "నీవు కనిపించని ప్రాణమెందులకు?" అని బయన్న ప్రాణత్యాగం చేయబోయాడు. బయన్న నిస్వార్థ నిష్కల్మష మూఢభక్తికి మెచ్చి నృసింహుడు ప్రత్యక్షమయ్యాడు. వెంటనే స్వామిని తీగలతో కట్టేసి పద్మపాదుని ముందర నిలబెట్టాడు బయన్న! కళ్ళముందరే బయన్నకు కనబడుతున్న నృసింహుడు పద్మపాదునకు కనబడలేదు. "స్వామీ! ఏమి నా పాపము?" అని ఆక్రోశించాడు పద్మపాదుడు. "నాయనా! పద్మపాదా! కోటి సంవత్సరములు నా రూపాన్ని ధ్యానం చేసినా అలవడని ఏకాగ్రత భక్తి ఈ బయన్న ఒక్కరోజులో సాధించాడు. ఈ సత్పురుషుని సాంగత్యం వలనే నీకు నా మాటలు వినబడుతున్నాయి. నీవు విచారించకు. నీ అఖండ గురుభక్తికి మెచ్చాను. అవసరమైనప్పుడు నేనే నీకు దర్శనమిచ్చి నిన్ను కాపాడెదను" అని ఆశీర్వదించి అదృశ్యమయ్యాడు స్వామి.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. పద్మపాదుని గురుభక్తి అనన్యము. గురుకృప లేని ఏవిద్య రాణించదు. ఇహపరసాధనానికి దిక్కైన గురువుని అత్యాదరముతో పూజించాలి.

౨. ఏకాగ్రత నిశ్చల భక్తి యొక్క గొప్పతనము మనకీ కథలో బయన్న ద్వారా తెలిసినది. నిద్రాహారాలు మాని ఏకాగ్రచిత్తంతో స్వామిని వెదకిన బయన్నను కరుణించాడు నృసింహుడు.

## గౌతముడి ఏనుగు

మహాభారతము లోని కథ

ఒకసారి గౌతమ మహర్షి అడవిలో తపస్సు చేసుకుంటూ ఉండగా తల్లిలేని ఒక ఏనుగు పిల్ల కనిపించింది. స్వాభావికముగా దయార్ద్రహృదయుడైన ఆ గౌతముడు ఏనుగు పిల్ల మీద జాలిపడి దాన్ని ఆశ్రమానికి తీసుకు వచ్చి పెంచుకున్నాడు. కాలక్రమేణ అది పెరిగి పెద్దదయింది. ఇలా ఉండగా ఒకరోజు ధృతరాష్ట్రుడనే మహారాజు గౌతముని వద్దకు వచ్చి ఏనుగును తనకిమ్మని అడిగినాడు. గౌతముడు "తల్లీ తండ్రీ లేని ఈ ఏనుగును నా సొంత బిడ్డలా పెంచుకుంటున్నాను. ఇది నేను లేనప్పుడు నా ఆశ్రమాన్ని పరిరక్షిస్తుంది. యజ్ఞాలకు అడివినుంచి దర్భలు సమిధలు తెస్తుంది. కాబట్టి ఈ ఏనుగును కోరకు" అని చెప్పాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు "నీవు అడిగినన్ని గోవులు కావలిసినంత బంగారము ఇస్తాను. ఈ ఏనుగును నాకు ఇవ్వు" అని అన్నాడు. "రాజా! దీని చిన్నప్పటినుంచి ఎంతో ప్రేమగా పెంచుకుంటున్నాను. నీవు ఎన్ని గోవులిచ్చినా నాకు అక్కరలేదు. మునివేషములో ఉన్న నాకు హిరణ్యముతో అసలు అవసరములేదు" అని బదులిచ్చాడు గౌతముడు.

ధృతరాష్ట్రుడు "మునులకు అవసరమైనవి గోవులుకాని ఏనుగులు కావు. ఐశ్వర్య చిహ్నములైన ఏనుగులు రాజుల వద్దనే ఉండాలి కదా! రాజునైన నేను స్వయముగా వచ్చి ఏనుగును ఇమ్మనినా కాదంటావా?" అని న్యాయం అడిగాడు. అది విని సూక్ష్మబుద్ధి అయిన గౌతముడు "పుణ్యాత్ములు ఆనందించే పాపాత్ములు దుఃఖించే యమలోకానికి వెళదాము రా! యమసభలోనే న్యాయనిర్ణయం జరుగని" అని అన్నాడు.

ధృతరాష్ట్రుడు: "నాస్తికులు పాపాత్ములు సహింపరాని బాధలు పడతారు ఆ దారుణమైన యమలోకములో. నేను రాను."

గౌతముడు: "సమవర్తి అయిన యమధర్మరాజు వద్దకు వెళదాము. అతనే న్యాయం చెప్తాడు."
ధృతరాష్ట్రుడు: "అక్కాచెల్లెళ్ళను తల్లిదండ్రులను దయతో చూసుకునే వారే ఆయన దగ్గరకు వెళ్ళగలరు. నేను రాలేను."

గౌతముడు: "అయితే వైకుంఠధామ సమానమైన గంగాతీరానికి వెళదాము. వస్తావా?"
ధృతరాష్ట్రుడు: "అతిథి అభ్యాగతులకు పెట్టి ఆ తరువాత తినే వాళ్ళే అక్కడికి వెళ్ళి పుణ్యం సంపాదించగలరు. నేనెందుకు వస్తాను?"

గౌతముడు: "పోని పవిత్రమైన మేరువనానికి రా!"
ధృతరాష్ట్రుడు: "సత్యము దయ మృదువర్తనము భూతదయ ఉన్నవాడే అక్కడికి వెళ్ళగలడు. వేరే చోటు చెప్పు."

గౌతముడు: "విష్ణుస్వరూపుడైన నారదుని విహారస్థలానికి వెళదాము. పద! అప్సరసలు కిన్నెరులు ఉంటారక్కడ"
ధృతరాష్ట్రుడు: "సంగీత నృత్యాలతో దేవతార్చన చేసే పుణ్యాత్ములే వెళ్ళగలరక్కడికి. నావల్ల కాదు."

గౌతముడు: "అలాగా! అయితే దేవతలు విహరించే ఉత్తర కురుభూములకు వెళదాం రా!"
ధృతరాష్ట్రుడు: "కామము హింస మొదలైనవి లేని వాళ్ళు అక్కడికి వెళతారు. వచ్చుట నా తరము కాదు."

గౌతముడు: "అమృతకిరణాలను ప్రసరించి లోకాలను ఆనందమయము చేసే చంద్రుని వద్దకు వెళదాము. సరేనా?"
ధృతరాష్ట్రుడు: "దాననిరతులు పరమ శాంతచిత్తులు అక్కడికి వెళ్ళగలరు. వచ్చుట నాకు సాధ్యము కాదు."

గౌతముడు: "సమస్త లోకాలకు అన్నప్రదాత ఆ సూర్యభగవానుడు. ఆయన వద్దకు వెళదాము. దయలుదేరు."
ధృతరాష్ట్రుడు: "అమ్మో! తపస్స్వాధ్యాయనిరతులే ఆయన దర్శనము చేయగలరు. నన్ను విడిచిపెట్టు."

గౌతముడు: "పోనీ వరుణుడి దగ్గరకు వస్తావా?"
ధృతరాష్ట్రుడు: "అగ్నిహోత్రము యాగాలు చేసిన వాళ్ళైతే ఆయన దగ్గరకు వెళ్ళగలరు."

గౌతముడు: "దేవరాజైన ఇంద్రుని సన్నిధిలో న్యాయం అర్థిద్దాము."
ధృతరాష్ట్రుడు: "శూరులు సోమయాజులు కానీ అక్కడికి వెళ్ళలేరు. నేను రాను."

గౌతముడు: "ప్రజాపత్య లోకానికి వెళదాము."
ధృతరాష్ట్రుడు: "అశ్వమేధ యాగాలు చేసిన వాళ్ళకు స్థానమది."

గౌతముడు: "గోలోకం?"
ధృతరాష్ట్రుడు: "తీర్థాలు సేవించినవారు బ్రహ్మచర్య వ్రతం చేసిన వాళ్ళు గోలోకానికి చేరెదరు. నేనెలా రాగలను?"

గౌతముడు: "సరే! అయితే బ్రహ్మసభకు వెళదాము రా!"

ధృతరాష్ట్రుడు: "అసంగులు (లౌకిక బంధాలు లేనివారు) ఆధ్యాత్మవిద్య తెలిసిన వారు పెళ్ళగలరు అక్కడికి. నావంటి వాడు ఆ లోకము చూడనే లేడు."

ధృతరాష్ట్రుని విజ్ఞానము చూసి గౌతముడు "మహానుభావా! నీవు దేవేంద్రుడవు. ఏ ఏ పుణ్యాలు చేస్తే ఏ ఏ లోకాలు వస్తాయో దేవేంద్రునికి తప్ప ఇంకెవరికి తెలుసు?" అని పాదాభివందనము చేశాడు గౌతముడు. "అయ్యా! నేను మారువేషం ధరిస్తే దేవతలే కనుక్కోలేరు. మీరు మహానుభావులు కాబట్టి నా నిజరూపం గుర్తుపట్టగలిగినారు. మీరు ఈ ఏనుగుతో సహా స్వర్గలోకానికి వచ్చి మమ్ము ఆనందపఱచండి" అని ప్రార్థించాడు దేవేంద్రుడు. సంతోషించి గౌతముడు తన ఏనుగుతో సహా స్వర్గానికి వెళ్ళాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**
ఏ పుణ్యకార్యములు మనము చేయవలెనో తద్వారా ఏ ఏ పాపకార్యములు మనము చేయకూడదో వివరముగా దేవేంద్రుడు మనకు ఈ కథలో బోధించినాడు. (ధృతరాష్ట్రుడు అంటే శరీరమును ధరించినవాడు. అంటే మానవుడు. కాబట్టి మానవుడు ఏ పుణ్యకార్యాలు చేయాలో మనకు ఈ కథలో తెలిసింది) కానీ అందఱూ అన్నీ చేయలేరు. ఉదాహరణకు కలియుగములో అశ్వమేధ రాజసూయ యాగములు చేసే అర్హత మానవులకు లేదు. కాబట్టి అందఱూ చేయదగ్గ పుణ్యకార్యాలు మనము తప్పకుండా చేయాలి: తల్లిదండ్రుల సేవ, అతిథిసేవ, సత్యం, భూతదయ, గీతనృత్యాదులతో దేవతార్చన, దానము, స్వాధ్యాయనము, తీర్థయాత్రలు, బ్రహ్మచర్య పాతివ్రత్యాది వ్రతములు.

## ఇంద్రద్యుమ్నుని కథ

మహాభారతము లోని కథ

పూర్వం ఇంద్రద్యుమ్నుడనే రాజేంద్రుడు ఉండేవాడు. అతడు ఎన్నో దానధర్మాలు చేసి ధర్మాచరణలో తనంతటి వాడు లేడనే ఖ్యాతిని పొందినాడు. లెక్కగట్టలేనన్ని గో భూ హిరణ్య దానములు పాత్రులైన వారికిచ్చి అనంత పుణ్యసంపదను ఆర్జించుకొన్నాడు. రాజర్షి అయ్యి ప్రజారంజకముగా పాలన చేసినాడు. అలా ఎన్నో వర్షములు రాజ్యపాలనము చేసి తన పుణ్యనిధి ప్రభావముతో కాలం చెల్లాక స్వర్గం చేరుకొన్నాడు. చాలాకాలము స్వర్గభోగాలు అనుభవించిన తరువాత ఒకరోజు దేవేంద్రుడు ఇంద్రద్యుమ్నుని పిలిపించి

"మహాత్మా! నీవు అనేక దానధర్మాలు చేసి ఎంతో పుణ్యమును ఆర్జించినావు కనుక ఇంత దీర్ఘకాలము స్వర్గములో ఉండగలిగినావు. కానీ పరమేశ్వరుని శరణువేడి ఆయన కృపతో పొందెడి మోక్షపదము ఒక్కటే శాశ్వతమైనది (ఇతరములు శాశ్వతములు కావు). నీ పుణ్యఫలమును అనుభవించినావు కావున సర్గమును వీడు సమయము వచ్చినది" అని చెప్పినాడు. స్వర్గాధిపతి మాటలు విని ఇంద్రద్యుమ్నుడు ఇంతకొద్ది కాలములోనే తన పుణ్యరాసులు ఎలా కరిగిపోయినాయి? అని ఆశ్చర్యపోయినాడు. అది చూసి శచీపతి "రాజా! భూలోకములో నిన్ను కానీ నీవుచేసిన సత్కర్మలను కానీ గుర్తుపెట్టుకొన్న వానిని నాకు చూపిస్తే నీవు స్వర్గములోనే ఉండవచ్చు. చేసిన దానములు మహనీయములు కాకపోతే జనులు చిరకాలము గుర్తుంచుకొనరు కదా! కావున నీ దానములను ఎంతకాలము ప్రజలు ఉపయోగింతురో అంతకాలము నీవిక్కడనుండవచ్చు" అని హితవు చెప్పినాడు. ఇంద్రుని ఆజ్ఞతీసుకొని అట్టివారు ఉన్నారేమో వెదకటానికి బయలుదేరినాడు ఇంద్రద్యుమ్నుడు.

చిరంజీవి అయిన మార్కండేయ మహర్షి వద్దకువెళ్ళి నమస్కరించి "ఓ తపస్విచంద్రమా! నన్ను మీరు ఎఱుగుదురా"? అని అడిగినాడు. అప్పటికి ఎంతోకాలముగా తీర్థయాత్రలుచేసి ఉపవాస వ్రతాలు చేసి కృశించి ఉన్న మార్కండేయ మహర్షి గుర్తులేదని చెప్పినాడు. అప్పుడు ఇంద్రద్యుమ్నుడు "స్వామి! చిరంజీవులైన మీకంటే ముందుపుట్టిన ప్రాణి ఏదైనా బ్రతికి ఉన్నదా"? అని అడిగినాడు. "పవిత్ర హిమాలయ పర్వత ప్రాంతములో ప్రావారకర్ణం అనే గుడ్లగూబ ఉన్నది" అని బదులిచ్చినాడు మార్కండేయ మహర్షి.

వెంటనే ఆ ఉలూకము వద్దకు చేరి "అయ్యా! నెన్నెఱుగుదువా"? అని ప్రశ్నించినాడు. తెలియదు అని చెప్పి "ఇక్కడికి కొన్ని యోజనాల దూరములో ఇంద్రద్యుమ్నమను సరోవరమున్నది. ఆ సరోవరములో నాడీజంఘమనే కొంగ ఉన్నది" అని ప్రావారకర్ణం చెప్పగా ఇంద్రద్యుమ్నుడు బ్రహ్మదేవుని స్నేహితుడైన నాడీజంఘుని వద్దకు చేరి "ఓ బకరాజా! నన్ను మీరు గుర్తుపట్టినారా"? ప్రశ్నించినాడు. "లేదు. ఈ సరోవరములో ఆకూపారమనే తాబేలు ఉన్నది. అది నాకంటే పెద్దది. దానికి నీవు తెలుసేమో కనుక్కో" అని చెప్పినది.

ఇంద్రద్యుమ్నుని చూడగానే ఆకూపార కళ్ళుచెమ్మగిల్లాయి "అయ్యా! వెయ్యి యజ్ఞములు సాంగముగా చేసి వెయ్యి యూపస్తంభాలు కట్టించినావు. ఆ యజ్ఞదానాలలో లెక్కకట్టలేనన్ని గోదానాలు ఇచ్చినావు. నీవు దానము ఇచ్చిన గోవుల రాకపోకలతో ఈ భూమి దిగబడి యింత సరోవరము అయినది. ఇది అంతా నీ చలవే" అని కృతజ్ఞతాపూర్వకముగా చెప్పినది. మరుక్షణం దేవతలు దివ్యవిమానములో ఇంద్రద్యుమ్నుని స్వర్గానికి తీసుకొని వెళ్ళినారు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. మన సత్కీర్తి భూలోకములో ఉన్నంత కాలము సర్గలోకము కరతలామలకము. ఆకూపార ఇంద్రద్యుమ్నుడు చేసిన దానములు మరువలేదు కావున ఇంద్రద్యుమ్నునికి పునః సర్గలోక ప్రాప్తి కలిగినది. కానుక మనము నలుగురుకీ ఉపకరించే పనులు చేయాలి. అవియే మనలను రక్షించు సంపదలు (ధనము కాదు).

౨. దేవేంద్రుడు చెప్పినట్టు మోక్షము ఒక్కటే శాశ్వతపదము. ఇంత పుణ్యాత్ముడు కాబట్టే మహావిష్ణువు గజేంద్ర రూపములో ఉన్న ఇంద్రద్యుమ్నునిచే "నీవేతప్ప హితః పరంబెఱుగను ..." అని అనిపించి అతనికి శాశ్వతమైన మోక్షమును ప్రసాదించినాడు (గజేంద్ర మోక్షము కథ). కావున మోక్షమునకు పుణ్యమే ప్రథమ సోపానము.

## భూదాన మహిమ

భరద్వాజ సంహిత లోని కథ

ఒకసారి దేవేంద్రునికి దేవగురుపైన బృహస్పతులవారు భూదానము యొక్క గొప్పతనమును గూర్చి వివరిస్తూ ఈ కథ చెప్పారు:

మాళవ దేశములో ఒక ఘోరారణ్యమున్నది. సూర్యరస్మి కూడా చొచ్చుకు పోలేనంత దట్టమైన అడవి. ఆ మహారణ్యములో ఒక పెద్ద బూఱుగు చెట్టు ఉన్నది. శాఖోపశాఖలతో బాగా విస్తరించి ఉన్న ఆ శాల్మలీవృక్షం ఎన్నెన్నో పక్షులకు జంతువులకు సమాశ్రయాన్ని కల్పిస్తున్నది. చిలుకల కలకలరవాలతో జలపాతాల శబ్దాలతో పచ్చగా కన్నులకు పండుగగా ఉన్నది ఆ అడవి.

ఆ బూఱుగు చెట్టు కొమ్మపై తామ్రతుండం అనే ఒక రామచిలుక కాపురముండేది. ఆ శుకం తన పిల్లలకు నివ్వరిపైరు ఆహారముగా పెట్టేది. తామ్రతుండం పిల్లలు ఆ వడ్లను ఎలా తినాలో కూడా తెలియని పసికూనలు. అందుకని ముక్కుతో ఆ వడ్లను తీసుకుని పిల్లల నోటిలో పడేశేది తామ్రతుండం. ఇలా వడ్లు పెట్టేటప్పుడు కొన్ని గింజలు క్రింద పడేవి. కొన్నాళ్ళకు అవి మొలకలెత్తి కాలక్రమేణ ఒక చిన్న వరిపైరు తయాఱయింది!

ఒకరోజు ఎక్కడా సరి అయిన పచ్చగడ్డి దొరకని ఒక ఆవు ఆకలిదప్పికలతో అలసి ఆ శాల్మలీ వృక్షం దగ్గరకు వచ్చినది. తామ్రతుండం ముక్కునుండి జారిన వడ్లతో పెరిగిన పైరు చూసి సంతోషించి స్వేచ్ఛగా తిని తృప్తి చెంది వెళిపోయింది. తరువాత ఆ గోవు తినగా మిగిలిన యవలతో ఒక విప్రోత్తముడు పంచయజ్ఞాలు చేశాడు.

అలా దైవికంగా తామ్రతుండానికి మహాపుణ్యం వచ్చింది. కాలధర్మం చేశాక అది చేసుకున్న సుకృతము వలన ధనికుడనే ఒక ధర్మాత్ముడైన వైశ్యునిగా జన్మించింది. ఓడవ్యాపారి అయిన ఆ ధనికునికి పూర్వజన్మ స్మృతి ఉన్నది. అజ్ఞానవశః తన ముక్కునుండి జారిపడిన ధాన్యం మొలకెత్తి ఒక గోవు ఒక విప్రుడు ఆ పంటను ఉపయోగించినందుకే తనకి ఇంత ఫలితం వచ్చిందని తెలిసిన ఆ ధనికుడు ఎన్నో ఫలవంతాలైన మంచి మాగాడి భూములను పండితులకు దానము చేశాడు. ఆ పుణ్యఫలముతో ఇహములో సర్వభోగాలు అనుభవించి కడకు విష్ణులోకం చేరుకున్నాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దామ్:**

సస్యసంపూర్ణము ఫలవృక్ష సమన్వితము అయిన భూమిని భక్తితో సత్పాత్రునకు సమర్పించిన వాడికి బ్రహ్మలోకం కరతలామలకం. అజ్ఞానతః తన భూమిలోని పైరు ఇతరులకి ఉపయోగ పడినందుకే తామ్రతుండానికి అంత పుణ్యం వస్తే ఇక జ్ఞానపూర్వకముగా ఫలవృక్షములున్న భూమిని అర్హునికి దానముచేస్తే ఎంత ఫలమో ఆ పరమేశ్వరునికే తెలుసు.

## సత్సాంగత్యము

పెద్దలు చెప్పిన నీతికథ

దేవర్షి అయిన నారదడు సాక్షాత్ శ్రీమహావిష్ణువు యొక్క అవతారరూపుడు. అందుకనే యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుడు "దేవర్షీణాంచ నారదః" అని అన్నాడు. అట్టి మహనీయుడైన నారదుడు ఒకసారి శ్రీకృష్ణుని దర్శించుటకై వచ్చి దండప్రణామములు చేసి "భగవాన్! సత్సాంగత్యము యొక్క ఫలము దయచేసి వివరముగా చెప్పండి" అని కోరినాడు. జగద్గురుపైన శ్రీకృష్ణుడు సత్సాంగత్య మహిమ అనుభవపూర్వకముగానే నారదునికి తెలియచేయాలని సంకల్పించి "నీవు తూర్పువైపుగా వెళితే ఒక పెంటకుప్ప కనిపిస్తుంది. అందులో ఉన్న పేడపురుగును సత్సాంగత్య మహిమేమని ప్రశ్నించు" అని చెప్పి జగన్మోహనముగా చిరునవ్వునవ్వాడు.

పరమాత్మ ఆదేశానుసారమే చేశాడు నారదుడు. నరద మహర్షి ప్రశ్న అడిగాడోలేదో గిలగిలలాడూతూ ప్రాణాలు విడిచింది ఆ పేడపురుగు. ఇలా జరిగిందేమని దుఃఖిస్తూ శ్రీకృష్ణుని వద్దకు వచ్చి జరిగినదంతా విన్నవించుకొన్నాడు నారదుడు. జరిగినది విని జగన్నాటకసూత్రధారి ఇలా అన్నాడు "ఇప్పుడు పశ్చిమదిశగా వెళ్ళు. ఒక పాడుపడిన దేవాలయము అందులో నివసిస్తున్న పావురము కనిపిస్తాయి. నీ సందేహమును అది తీర్చగలదేమో చూడు". వెంటనే బయలుదేరి పావురమును కలుసుకొని తన ప్రశ్నవేశాడు నారదుడు. అదేమి చిత్రమో ఆ కపోతము నారద మహర్షి పాదలమీద పడి ప్రాణాలు విడిచింది. "ఇది ఏమి వింత? ఇంకా ఎన్ని విధాల ఆ భగవంతుడు నన్ను పరీక్షించదలచాడో?" అని చింతిస్తూ శ్రీకృష్ణుని వద్దకు వచ్చి జరిగినది విన్నవించుకొన్నాడు. "అలా జరిగిందా నారదా? అయితే ఈ సారి ఉత్తర దిక్కుగా వెళ్ళు. అక్కడి సంస్థానములోని మహారాజుకు చక్కని మగశిశువును పుట్టాడు. నీ సందేహమును ఆ శిశువు తీర్చగలదు" అని చెప్పి చిరునవ్వులొలకబోసాడు లీలామానుషవిగ్రహుడైన నందనందనుడు.

మొదటి రెండు మార్లు జరిగినది తలచుకొని కొంచెం సంకోచించాడు నారదుడు. సర్వజ్ఞుడైన స్వామి అది గమనించి "నారదా! నిర్భయముగా వెళ్ళు. ఈ సారి అంతా శుభమే జరుగుతుంది" అని ఆశీర్వదించాడు. వెంటనే నారదుడు బయలుదేరి ఆ శిశువు వద్దకు వచ్చి "ఓ పాపాయి! మహాత్ముల సాంగత్యము వలన కలిగే ప్రయోజనమేమిటి?" అని ప్రశ్నించాడు. నారదుడు ప్రశ్నించిన మరుక్షణం ఆ పసిపాప ఒక దేవతగా

మారిపోయి భగవత్స్వరూపుడైన నారదునికి యథావిధిగా ప్రణమిల్లి ఆశ్చర్యముగా చూస్తున్న నారదునితో "దేవర్షి! అలా ఆశ్చర్య పోతున్నారేమిటి? పెంటకుప్పలోనున్న పేడపురుగును నేనే. అప్పుడు నా జన్మజన్మాంతరాల పుణ్యఫలము వలన అమోఘమైన మీ దర్శన భాగ్యము నాకు కలిగినది. మీవంటి దివ్యపురుషుల సందర్శన మాత్రముచే నాకు పావురము యొక్క జన్మ లభించినది. ఆ జన్మలో కూడా మీ దర్శనభాగ్యము లభించుటచే రాజపుత్రునిగా జన్మించినాను. మరల ఈ జన్మలో మీ దుర్లభ దర్శనము కలిగినందు వలన నాకు దైవత్వము లభించినది. మహాత్ముల సాంగత్యము యొక్క మహిమ ఇంతటిది!" అని అంటూ దేవలోకానికి వెళ్ళిపోయాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**
జగద్గురువులైన ఆదిశంకరులు

"సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।
నిర్మోహత్వే నిశ్చలితత్వం నిశ్చలితత్వే జీవన్ముక్తిః ॥"

అని ఉపదేశించినారు. అంటే జీవన్ముక్తికి ప్రథమ సోపానము సత్సంగత్యము. రాజకుమారుడు చెప్పినట్టు ఆ సత్సంగత్యము పురాకృతపుణ్యము వలన కలుగును. కాబట్టి మనకు మంచిపనులు చేస్తేనే సత్పురుషుల సాంగత్యము తద్వారా జీవన్ముక్తి కలుగుతాయి. ఈ కారణముగానే ఇంద్రునిచే శాపగ్రస్తుడైన యయాతి (యయాతి కథ చూడండి) కూడా కనీసం తనను సత్పురుషుల సాంగత్యములో ఉండనివ్వమని ప్రార్థించి సద్భువనములో ఉండుటకు దేవేంద్రుని వద్ద వరం పొంది తరించాడు. కనుక మనము ఎల్లప్పుడూ మంచివారితో ఉండి వారినుండి మంచిని గ్రహించి తరించాలి. దుష్టులకు ఎల్లప్పుడూ దూరముగా ఉండాలి.

## ధర్మవ్యాధుని కథ

శ్రీమహాభారతం లోని కథ

పూర్వం ఒకానొక ఊరిలో కౌశికుడనే బ్రాహ్మణ బ్రహ్మచారి ఉండేవాడు. ఒకనాడు అతడు చెట్టునీడన కూర్చుని వేదం వల్లె వేస్తున్నాడు. అతడలా వల్లెవేయుచుండగా చెట్టు మీదనున్న ఓ కొంగ అతనిపై రెట్ట వేసింది. అతడు వేదం చదువుతున్నా అందు చెప్పబడిన "మిత్రస్య చక్షుష సమీక్షామహే" అన్న సూక్తిని మఱచినాడు. వేదం ప్రపంచాన్నంతటినీ స్నేహభావంతో చూడమన్నది. అది మఱచి ఒక్కసారి కోపదృష్టితో ఆ కొంగను చూచాడు. అతడు తపోశక్తి కలవాడగుటచే ఆ కొంగ క్రిందపడి అసువులుబాసింది.

ఆ తరువాత ఆ బ్రహ్మచారి ఎప్పటిలాగానే గ్రామంలోనికి భిక్షాటనకై వెళ్ళాడు. ఓ ఇంటి ముందు నిలబడి "భవతీ భిక్షాం దేహి" అని అడిగినాడు. ఇంట్లో పనిలో ఉన్నదేమో అని అనుకొని కొంతసేపు నిరీక్షించాడు. ఇంతలో దూరాన్నించి వచ్చిన ఆమె మగడు "ఆకలి ఆకలి" అంటూ ఇంటిలోనికి వెళ్ళాడు. ఆ ఇల్లాలు పరమసాధ్వి పతివ్రత. పతికి కాళ్ళుకడుగుకోవటానికి నీళ్ళిచ్చింది. ఆ తరువాత ఎంతో ఆప్యాయంగా భర్తకు భోజనం వడ్డించింది. అతని భోజనం అయ్యాక భిక్ష తీసుకొని బయటకు వచ్చింది. "స్వామీ! మిమ్మల్ని చాలా సేపు నిలబెట్టినాను. నన్ను క్షమించండి" అన్నది. కౌశికుడు మండిపడ్డాడు. తన పతిసేవ చేసి వచ్చేసరికి జాప్యమైందని చెప్పింది. అయిననూ "ఇది క్షమించరాని నేరం" అన్నాడు కౌశికుడు కోపంగా.

అప్పుడామె అన్నది "స్వామీ! అనవసరంగా కోపంతెచ్చు కోకండి. తపోధనులకు కోపం తగదు. ఒక పతివ్రతకు పతిసేవాధర్మాన్ని మించిన ధర్మంలేదు. నేను కొంగను కాను మీ తీక్ష్ణ దృష్టికి క్రిందపడటానికి". ఎక్కడో అడవిలో ఏకాంతలో జరిగిన వృత్తాంతం ఈమె కెలా తెలిసిందా అని కౌశికుడు దిగ్భ్రాంతి చెందినాడు. పతివ్రతా శక్తిని చూచి నివ్వెఱ పోయాడు. అప్పుడా సాధ్వి "మహాత్మా! కోపానికి మించిన శత్రువు లేదు. మీరు మిథిలా నగరానికి వెళ్ళి ధర్మవ్యాధుని కలుసుకోండి. అతడు మీకు తత్త్వబోధ చేస్తాడు" అని హితవు చెప్పింది.

కౌశికుడు వెంటనే మిథిలకు ప్రయాణమైనాడు. ధర్మవ్యాధుని ఇల్లు కనుక్కొని అక్కడికి చేరాడు. అతడొక కసాయి అని తెలుసుకొని ఆశ్చర్యపోయాడు. కౌశికుని చూచి ధర్మవ్యాధుడు "అయ్యా! దయచేయండి. తమని నా వద్దకు పంపిన సాధ్వీమణి కుశలమేకదా"? అని ప్రశ్నించాడు. ఆ పతివ్రత విషయం ఈ వ్యాధునికెలా తెలిసిందో అని కౌశికుడు ఆశ్చర్య పోయాడు. అతిథికి అర్ఘ్య పాద్యాదులిచ్చి తన తల్లిదండ్రుల సేవకై వెళ్ళాడు ధర్మవ్యాధుడు. వారి సేవ చేశాక కౌశికుని వద్దకు వచ్చాడు. కౌశికుడికి ఇలా ధర్మబోధ చేశాడు "ఆర్యా! ఏ పనినైనా నిష్కామ హృదయంతో ధర్మం తప్పకుడా చేస్తే అది మాధవ సేవే అవుతుంది. ప్రతి మనిషి తన స్వధర్మాన్ని కులవృత్తిని నిర్వహిస్తే ఈ సమాజం బాగా పురోగమిస్తుంది లేకుంటే కొన్ని రంగాలలోనే పురోగతివుంటుంది.

మనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులను సేవించటం మనకనీస కర్తవ్యం. అట్లుచేయని వాడు కృతఘ్నుడౌతాడు. కృతఘ్నతకు మించిన మహాపాపం మరొకటి లేదు. మాతాపితసేవ ఒక్కటే చాలు మనల్ని మోక్షమార్గంలో నడిపించడానికి". ఈ హితబోధ విన్న కౌశికుడు ధర్మవ్యాధుని వద్ద సెలవుతీసుకుని వెంటనే తను విస్మరించిన మాతాపితరుల కడకేగినాడు. వారికి భక్తితో అనన్య సేవ చేసి తరించాడు. వేదాంత తత్త్వజ్ఞానంతో అధ్యయనంతో తపస్సుతో పరిశ్రమతో పొందే జ్ఞానాన్ని మోక్షాన్ని మాతాపిత సేవతో పొందవచ్చని గ్రహించాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**

౧. "తన కోపమే తన శత్రువు. తన శాంతమే తనకు రక్ష" అన్న సూక్తి మనకు ఈ కథలో తెలిసింది. కౌశికుడు వృథాగా కొంగమీద సాధ్వీమీద కోపగించుకొని తన తపశ్శక్తిని కోల్పోయాడు.

౨. పతివ్రత యొక్క శక్తి అమోఘం. కథలోని సాధ్వి కేవలం పతిసేవ చేసి ఎంతో కఠిన తపస్సుతోకానీ పొందలేని జ్ఞానాన్ని సంపాదించింది. కౌశికుడుకి హితబోధ చేసింది.

౩. స్వధర్మ పాలన యొక్క శక్తి మనకు ధర్మవ్యాధుని వలన తెలిసింది. ఈతడు కసాయి వాడైనా స్వధర్మాన్ని నిర్వర్తించాడు కాబట్టి కౌశికుడికి హితబోధ చేయగలిగాడు.

౪. మాతాపితరుల సేవ యొక్క ఔన్నత్యం ప్రాముఖ్యత ధర్మవ్యాధుడు మనకు స్పష్టంగా చూపినాడు. జన్మనిచ్చినవారికి కృతజ్ఞత చూపింటం భారతీయుల ప్రథమ కర్తవ్యం అని చెప్పాడు.

## నచికేతుని పితృభక్తి

కఠోపనిషత్తు లోని కథ

పూర్వం వాజస్రవసుడను సత్పురుషుడుండేవాడు. గౌతమవంశజాతుడైన అతనికి గౌతముడు, ఔద్దాలకుడు మరియు ఆరుణి అను పేరులు కూడా కలవు. అతడొకసారి విశ్వజిత్ యజ్ఞము చేసినాడు. ఆ బృహత్ యజ్ఞం చేసినవారు యాగాంత్యములో తమ సర్వస్వమునూ దానము చేయవలెను! వాజస్రవసుడు కూడా తనకున్నదందా దానంచేయసాగినాడు.

భారతీయులకు పశువృక్షములు ముఖ్యమైన సంపదలు. అందునా గోసంపద అతి ముఖ్యమైనది. మణిమరకతాలకంటే హిరణ్యరజితాదులకంటే గొప్పది గోసంపద. కావున వాజస్రవుడు ఋత్విజులకు గోదానాలు చేయసాగినాడు. వాజస్రవసునకు మహాబుద్ధిశాలి గుణోన్నతుడు పితృభక్తి పరాయణుడగు నచికేతుడను పుత్రుడు కలడు. అతడు చిన్నవాడైనా సకల ధర్మశాస్త్రాలు బాగా అభ్యసించినాడు. నచికేతుని దృష్టి తన తండ్రియిచ్చే గోవుల మీద పడినది. తండ్రి దానమిచ్చే గోవులు చాలమటుకు ముసలివి పండ్లులేనివి పాలిచ్చుటకు ప్రసవించుటకు శక్తిలేనివి అని కనుగొన్నాడు. మిక్కిలి దుఃఖమును చెంది నచికేతుడిలా అనుకున్నాడు

"శాస్త్రాలు "ఎవడైతే నిస్సారమైన గోవులను దానంచేస్తాడో వాడికి సద్గతులుండవు" అని ఘోషిస్తున్నాయి. అయ్యో! మహనీయుడైన మా తండ్రిగారు విశ్వజిత్ వంటి విశిష్టమైన యజ్ఞము చేసియూ ఈ తామస దానము వలన పూర్ణఫలమును పొందకుండుట పాడిగాదు" అని పలువిధాల ఆవేదనపడి చివరి నిమిషములోనైనా తండ్రిగారికి హితం చేద్దామని తలచి ఇలా అన్నాడు

"తండ్రీ! ఈ యజ్ఞములో నీకున్నవన్నీ దానము చేయాలి కదా? మరి నన్ను ఎవరికిస్తావు"? అని అడిగినాడు. బాలచేష్ట అనుకుని బదులివ్వలేదు వాజస్రవసుడు. నచికేతుడు మళ్ళీ "నన్నెరికిస్తావు నాన్నా"? అని అడిగినాడు. "సహనావవతు ..." మొదలైన శాంతిమంత్రాలతో ప్రతిధ్వనిస్తున్న యాగశాలలో ఉన్న వాజస్రవసుడు సహనం వహించాడు. తండ్రికి మహాపుణ్యాన్ని ఎలాగైనా కట్టబెట్టాలని దృఢనిశ్చయంతో ఉన్న నచికేతుడు మూడవమాఱు అదే ప్రశ్నవేశాడు. సహనమును కోల్పోయి వాజస్రవసుడు "నిన్ను యమునికిస్తాను" అని అన్నాడు!

"అయ్యో! కోపముతో నేనెంతమాటన్నాను? ఆహా! తన కోపమే తన శత్రువు అను సూక్తిని చిన్నప్పటినుంచి వింటూవచ్చినా ఒక్క క్షణం సహనాన్ని కోల్పోయి ఎంత తప్పుచేశాను!" అని బాధపడ్డాడు వాజస్రవసుడు. నిచికేతుడు తన మదిలో "దానమిచ్చేటప్పుడు గ్రహీతకు అక్కరకు వచ్చే వస్తువును ఇవ్వాలి. నావంటి సామాన్యుడు ధర్మప్రభువైన యమునికి ఏమి అక్కరకు రాగలను? అయిననూ పితృవాక్యపాలనమే తనయుల ధర్మం" అనుకొని చింతిస్తున్న తండ్రిని చూచి "తండ్రీ! విచారించవలదు. మన పూర్వీకులందఱూ సత్యనిష్ఠాగరిష్ఠులు అన్నమాటను ఎన్నడూ జవదాటి ఎఱుగనివారు. సత్యమే ఈ చరాచర సృష్టికి ఆధారము. సత్యభ్రష్టుడైన వానికి నరకము తప్పకదా! తండ్రీ! నీవాడిన మాటను నేను సత్యముచేసెదను. నాకై విచారించకుము.

పైరు మొలచి పండి ఆపై ఎలా జీర్ణమవుతుందో అదేవిధముగా పాంచభౌతిక శరీరము పుట్టి పెరిగి మరల ఆ పంచభూతముల లోనే లీనమగును కదా! కావున ఈ శరీరము శాశ్వతము కాదు. సత్యమొక్కటే శాశ్వతము. సత్యమే భగవంతుడు. కనుక విచారించక యముని వద్దకు పోవుటకు ఆజ్ఞనొసంగుము". ఇలా తన అమృతవాక్కులతో సుధావర్షమును కురిపించినాడు నచికేతుడు. ఎలాగైతే దశరథ మహారాజు మహాదుఃఖముతో దాశరథిని కానలకు పంపినాడో అలా వాజస్రవసుడు నచికేతుని యముని వద్దకు పంపినాడు.

ఆ యమపురమునకు దారి అతిదుర్గమమైనది. ఎంతో పుణ్యాశీలులు కూడా సులభముగా దాటలేని వైతరణీనదిని నచికేతుడు తన సత్యసంధత్వ పితృభక్తి ప్రభావములచే సునాయాసముగా దాటి యమపురిని చేరినాడు. యమధర్మరాజు నగరములో లేరని తెలుసుకుని ద్వారమువద్ద నిరీక్షించినాడు. మూడురోజులు అన్నపానీయాదులు లేకుండా ఆ పసివాడు కాలునికై నిరీక్షించినాడు. మూడురోజులకు ధర్ముడు వచ్చినాడు. మహాతేజస్సుతో అగ్నివలె వెలిగిపోతున్న నచికేతుని చూచి

"అయ్యో! తెలియకనే నావలన ఎంత అపరాధము జరిగినది? ధర్మానికి రాజునైన నా ఇంటనే ఇంతటి అధర్మము జరిగినదే! ఇంటివారిచే తప్పు జరిగినా ఆ తప్పుకు బాధ్యుడు అజమానియే కదా! అగ్నితుల్యుడైన అతిథి ఎవరింట్లో పస్తుంటాడో వాడి ఇష్టాపూర్తులు పుత్రులు మొదలైన సంపదలు నశిస్తాయి కదా! నిప్పుని తెలిసి తాకినా తెలియక తాకినా కాలకమానదు. అటులే తెలిసిచేసినా తెలియక చేసినా తప్పుకు శిక్షను అనుభవించక తప్పదు. ఈ అధర్మకార్యానికి ఫలతము నాకు రాకమానదు. ఇప్పటికైనా ఆ అతిథునికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించెదను" అని నిశ్చయించి యముడు నచికేతుని వద్దకువెళ్ళి "ఓ బ్రహ్మన్! అభ్యాగతః స్వయం విష్ణుః. కావున చిన్నవాడివైనా నీకు నమస్కరిస్తున్నాను. నా నమస్కారమును స్వీకరించు. ఇంటికి వచ్చిన అతిథి అగ్నిదేవునితో సమానుడని తెలిసికూడా నిన్ను మూడు దినములు నిరీక్షింపచేసినాను. నన్ను

క్షమించు. నాకు శుభం కలిగేటట్టు ఆశీర్వదించు. మూడురోజులు నిన్ను కష్టపెట్టినందుకు ప్రాయశ్చిత్తముగా నీకు మూడు వరాలు ఇస్తాను. కోరుకో" అని అన్నాడు.

వంశదీపకుడైన నచికేతుడిలా కోరినాడు "ఓ యమధర్మరాజా! మా తండ్రిగారు ఆందోళనారహితుడు శాంతచిత్తుడు అగునట్టు ఆశీర్వదించు. నేను ఇంటికి చేరిన తరువాత ఆయన నాపై కోపమును విడుచు నట్లు ఆశీర్వదించు. నాకు అగ్నివిద్యను ఉపదేశించు" అని కోరినాడు. యముడు ఆ వరములను ప్రసాదించి మూడవ వరము కోరుకొమన్నాడు. అప్పుడు నచికేతుడు "స్వామి! ఆత్మ శాశ్వతమని కొందఱు కాదని మరికొందఱు అంటున్నారు. ఈ సందేహము తీరునట్లుగా నాకు అతిరహస్యమైన బ్రహ్మవిద్యను ఉపదేశించుము".

ఆత్మవిద్యను యోగ్యతార్హతలున్న వానికే బోధించాలి. అనర్హునకు బోధించిన ఆతనికి సమాజమునకు హానికరం అని ఎఱిగిన యమధర్మరాజు నచికేతుడు జ్ఞానోపదేశానికి అర్హుడోకాదో అని పరీక్షచేసినాడు. "ఈ విద్యనేర్చుకొనుట చాలా కష్టము. ఇంకేదైనా కోరుకో. ఉత్తమ సంతానం, ఏనుగులు, గుఱ్ఱాలు, ఆవులు సిరిసంపదలు ఇంకా మానవులకు దుర్లభమైన భోగభాగ్యాలనేవైనా కోరుకో తీరుస్తాను. ఈ భూమండలాన్నంతా కోరినా ఇస్తాను. దీర్ఘాయువు చిరంజీవత్వము కోరుకొనుము ప్రసాదించెదను. కానీ ఆత్మవిద్యను కోరవద్దు" అని ప్రలోభ పెట్టినాడు కాలుడు. ధీరుడైన నచికేతుడు ఐహికార్థాలను తృణప్రాయముగా ఎంచి ఆత్మవిద్య నేర్చుటకు ఉత్సుకతను చూపించినాడు. నచికేతుని పట్టుదల చూచి సంతోషించి ప్రలోభాలకు లొంగని అతడు అర్హుడని నిశ్చయించి ఆత్మవిద్యను నేర్పినాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. దానమిచ్చే సమయములో మనవద్దనున్నవానిలో మంచివి గ్రహీతకు ఉపకరించేవి ఇవ్వాలని నచికేతుడు మనకు బోధించినాడు. ఇదే ఉత్తమ దానము యొక్క లక్షణము.
౨. పితృవాక్యపాలనము తనయుల ప్రథమ కర్తవ్యము. అంతేకాక తండ్రి అడుగకుండానే తండ్రికి హితవు (ప్రియము కాదు) చేయాలని తపించేవాడు ఉత్తమ పుత్రుడు. శ్రీరాముడు, భీష్మపితామహుడు, నచికేతుడు ఈ త్రోవకు చెందినవారు. నిచికేతుడు తండ్రికి పూర్ణదాన ఫలం ఇప్పిద్దామని దృఢసంకల్పము చేసినాడు. తండ్రి అన్నమాటను సత్యంచేయుటకు తన ప్రాణాలనే తృణప్రాయముగా ఎంచి యమపురికి బయలుదేరినాడు. ఇట్టి పితృభక్తి పరాయణులు మనకు ఆదర్శప్రాయులు.
౩. కోపము ఒక్క నిమిషములో మనచేత ఎంత తప్పునైనా చేయిస్తుంది. వాజస్రవసుడు సహనం వహించక "యమునికిస్తాను" అని తరువాత పశ్చాత్తాపపడినాడు. కాబట్టి మనము ఎల్లప్పుడు శాంతచిత్తముతో ఉండాలి.
౪. "అభ్యాగతః స్వయం విష్ణుః" అన్న సూక్తిని మనకు చూపించినాడు యమధర్మరాజు. అతిథిని నిరీక్షింపచేయవలసి వచ్చినదే అని ఎంతో బాధపడ్డాడు. దిక్పాలకుడు అయికూడా "నన్ను క్షమించు" అని ఒక పసిబాలునితో అన్నాడు!
౫. ఎన్నో విషయాలు తెలిసినా నచికేతుడు "నావంటి సామాన్యుడు యమునికేమి అక్కర"? అని అనుకొని తన వినయవైభవాన్ని మనకు చూపినాడు.

## శ్రీకృష్ణ లీలలు – శకటాసుర భంజనమ్

శ్రీ గర్గభాగవతం లోని కథ

" ఏమి నోము ఫలమో ఇంత ప్రొద్దొక వార్త వింటిమబలలారా వీనులలర
మన యశోద చిన్ని మగవాని గసెనట చూచివత్తమమ్మ సుదతులారా "

అంటూ ఒకరినొకరు పిలుచుకుంటూ వ్రజభామలందఱూ చిన్ని కృష్ణుని చూడ వచ్చారు. బాలకృష్ణుని కురులు ముడిచి పరిమళ పుష్పములతో అలంకరించారు. ఆ చిన్ని శిశువు నుదుట కస్తూరి దిద్ది కాటుక పెట్టారు. చెవి పోగులు పులిగోరు చంద్రహారము బాలునికి ధరింపచేశారు. బోసి నవ్వులొలికిస్తున్న జగన్నాథుని బుగ్గన గడ్డముపై చుక్కలు పెట్టారు. చేతులకు కడియాలు ముంజేతులకు మురుగులు మొలకు బంగారుత్రాడు కట్టారు. బాలుని రూపములో ఉన్న శేషశాయికి నీరాజనాలిచ్చి "ఉయ్యాలా బాలునూచెదరు" అంటూ బాలుని బండీ క్రిందనున్న పసిడి తొట్టిలో పడుకోబెట్టి లాలి పాటలు పాడారు. వ్రజభామలు ఎన్నో కానుకలు పిండివంటలు మొదలగునవి ఇచ్చారు.

ఈ కోలాహలంలో కంసప్రేరితుడైన శకటాసురుడు వాయు రూపములో వచ్చి పరమాత్మపై బండిని పడద్రోశాడు. ముద్దులొలికిస్తూ చిన్నికృష్ణుడు ఆ శకటమును (బండిని) తన్నాడు. రివ్వున బండీ ఎగిరి శకటునిపై పడి ఆతని తల వ్రక్కలయ్యెను. బండిపైనున్న క్షీర దధి భాండములు క్రింద పడి పగిలెను. అలికిడి వినిన వ్రజభామలు కలవరముతో చూడగా బాలకృష్ణుడు కేరింతలుకొట్టుచూ ఆడుకుంటున్నాడు. ఈ లీలను చూచిన గోపబాలురు జరిగిన సంగతి వ్రజభామలకు చెప్పిరి. ఆశ్చర్యపడి నందనందునకు ఎఱ్ఱని నీటితో దిష్టితీసి భూసురులచేత వేదాశీర్వచనములు చేయించి లోకరక్షకునకు రక్షకట్టిరి.

**శకటాసురుని వృత్తాంతము:**

హిరణ్యాలోచనుని పుత్రుడైన ఉత్కచుడు చాలా క్రూరుడు. ఒకసారి అతడు తన స్వాభావికమైన క్రూరత్వముచే లోమశ మహర్షి ఆశ్రములోనున్న వృక్షలతాదులను పెకికివేశాడు! ఆతని క్రూరబుద్ధిని చూసి ఆ మహర్షి "ఓరీ! పాము కుసుసము విడిచినట్టు నీవు ఈ దేహము విడువుము" అని శపించినాడు. పశ్చాత్తాపముతో మహర్షి పాదాలపై పడి క్షమించమని వేడుకున్నాడు ఉత్కచుడు. "పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తము లేదు.

అయిననూ నీవు చేసిన కర్మకు శిక్ష తప్పదు. ద్వాపరమున శ్రీకృష్ణ పరమాత్మ నిన్ను వధించును. ఆ పురుషోత్తముని పాద స్పర్శతో నీకు శాపవిముక్తి కలుగుతుంది" అని శాపావశానం చెప్పాడు లోమశ మహర్షి. ఆ ఉత్కచుడే శకటాసురుడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమారు చూద్దాము:**
క్రూరత్వం కడు దుష్టస్వభావము అసురలక్షనము. తోటి మానవులు జంతువులతోనే కాక వృక్షములతో కూడా మైత్రీభావముతో ఉండవలెనని మనకు ఈ కథ ద్వారా తెలిసినది. మన శాస్త్రాల ప్రకారం ఒక చెట్టును ఊరికే నఱకడం మహాపాపమ్. అవసరార్థం ఒక వృక్షమును నఱికితే దానికి బదులు నాలుగు వృక్షములు నాటమని మన ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఉత్కచుడు ఊరికే ఎన్నో వృక్షములను పెఱికివేసి ఆ తప్పుకు శిక్ష అనుభవించాడు.

## కాకభుశుండి పూర్వజన్మవృత్తాంతము

శ్రీతులసీదాస కృత రామచరితమానసము లోని కథ

నారద మహర్షి పంపగా గరుడ భగవానుడు మేఘనాథుని చేతిలో తనకు తానే బంధింపబడిన శ్రీరాముని బంధములను తొలగించెను. శ్రీరాముని మాయావశుడైన గరుడుడు ఇలా ఆలోచించసాగెను "సర్వవ్యాపకుడు నిర్వికారుడు వాగాధిపతి మాయాతీతుడు అయిన పరమేశ్వరుడు ఈ భూమిపై శ్రీరామునిగా అవతరించెనని విన్నాను. శ్రీరామ నామమును జపించినంత మాత్రముననే మానవులు భవబంధవిముక్తులు అగుదురనీ విన్నాను. కానీ అట్టి మహిమాన్వితుడైన శ్రీరాముడు ఒక రాక్షసాధముని నాగపాశముచే బంధింపబడుట ఏమి"? ఇలా మాయామోహితుడై వ్యాకులచిత్తుడైన గరుడుడు బ్రహ్మర్షి అగు నారదుని కడకేగి తన సందేహమును వ్యక్తపఱచి కాపాడమని ప్రార్థించెను. నారదుడు గరుడుని సందేహనివారణార్థం సృష్టికర్త అయిన బ్రహ్మదేవునికడకు పంపెను. తన వద్దకు వచ్చిన గరుడునితో బ్రహ్మదేవుడిలా అన్నాడు "ఓ విహగేశ్వరా! పరమశివుడు శ్రీరాముని మహిమను బాగా ఎఱుగును. కావున నీవు ఆ శంకరునే శరణువేడుము". కుబేరుని కడకు వెళుతున్న మహాదేవుని కలిసి గరుడుడు తన సందేహమును చెప్పెను. "ఓ పక్షీంద్రా! ఎంతో కాలము సజ్జనుల సేవను చేసిగానీ జ్ఞానమును పొందలేము. నిన్ను నిరంతర రామకథాప్రసంగములు జరిగే దివ్యమైన నీలగిరిలోని పరమ భాగవతోత్తముడైన కాకభుశుండి ఆశ్రమమునకు పంపెదను" అని పార్వతీనాథుడు ఆనతిచ్చెను.

వేయి మందిలో ఒక్కడే ధర్మపథమును సర్వకాల సర్వావస్థలయందూ అనుసరించును. అట్టి కోటి ధర్మాత్ములలో ఒక్కడు వేరాశకులోనుకాక విరాగి వలె ఉండును. అట్టి కోటి విరాగులలో ఒక్కడు జ్ఞాని అగును. అలాంటి జ్ఞానులలో కోటికొక్కడే జీవన్ముక్తుడగును. అట్టి వేయిమంది జీవన్ముక్తులలో అరుదుగా ఒక్కడు బ్రహ్మైక్యమును పొందును. అలా బ్రహ్మైక్యమును పొందినవారిలో మిక్కిలి అరుదుగా సంపూర్ణముగా మాయావిముక్తుడై శ్రీరాముని భక్తిలో లీనమైన ప్రాణి ఉండును. అట్టి దుర్లభమైన నిష్కల్మష రామభక్తి ఉన్న కాకభుశుండి కడకు గరుడుడు వచ్చెను. వచ్చిన గరుడుని తగిన రీతిలో గౌరవించి కుశలమడిగి సముచిత ఆసనముపై కూర్చుండబెట్టి గరుడునికి సంక్షిప్త రామాయణము మొదలగు ఎన్నెన్నో అతిరహస్యములైన తత్త్వములను వివరించి గరుడుని కోరికపై తన పూర్వజన్మ కథను ఇలా చెప్పాడు రామభక్తుడైన కాకభుశుండి

"పూర్వము ఒకానొక కల్పములో కలియుగము ఆరంభమైనది. కలికాలము మిక్కిలి కలుషితమైనది. స్త్రీ పురుషులందఱూ పాపకర్మనిరతులై వేదవిరుద్ధముగా మోహాధీనులై క్షణికమైన జీవితకాలము కలిగియూ కల్పాంతములు దాటే గర్వము దంభము అహంకారమును కలిగియుందురు. పాషండులు తమవిపరీత బుద్ధులతో క్రొత్తక్రొత్త సాంప్రదాయాలను ఆచారాలను కల్పించి ప్రచారం చేయుదురు. ఎవరికి ఏది ఇష్టమో అదే ధర్మమని అందురు. ఒక వైపు బ్రహ్మజ్ఞానముగూర్చి మాట్లాడుతూ మఱొక వైపు లోభముచే ఎంత మహాపాపకార్యమైనా చేయుటకు వెనుకాడరు. తాము స్వయముగా భ్రష్టమగుటే కాక సన్మార్గమున నడచువారినికూడా భ్రష్టుపఱచెదరు. వర్ణాశ్రమధర్మాలు అడుగంటుతాయి. ప్రజలలో సామరస్యం సమైక్యభావం నశిస్తుంది. నిష్కారణ వైరములతో కక్షలతో ఉండెదరు. వేదశాస్త్ర పురాణములను గౌరవించరు. కుతర్కములతో వేదశాస్త్రపురాణ నిందచేసి అనంతపాపరాశిని సొంతం చేసుకుంటారు. పూజలు దానధర్మాలు స్వార్థబుద్ధితో తామసముతో చేసెదరు. విద్యను అన్నమును అమ్ముకొనెదరు. ధనవంతులకే గౌరవమివ్వబడును. గురుశిష్య భార్యభర్త మాతాపితభ్రాత అను సంబధములకు విలులేకుండును. ఆడంబరముగా జీవించుచూ వేదమార్గమును త్యజించి దిగంబరత్వము సమర్థించి ఆపాదమస్తకమూ కపటత్వముతో నిండియున్న వారు గురువులై అధర్మబోధలు చేశెదరు. అమంగళకరమైన వేషభూషణాదులను ధరించి శిరోజములను విరియబోసుకొనెదరు. తినదగినది తినగూడనిది అను విచక్షణ తినుటకు సమయం అసమయం అను విచక్షణ చేయక అన్నింటిని అన్నివేళలా తినెదరు. అలా పాపకూపములో పడి ఇహములో పరములో బహు క్లేశాలను అనుభవించెదరు.

కానీ ఈ కలియుగమున ఒక గొప్పగుణము కలదు. "కలౌ సంకీర్తనాన్ముక్తిః". యొగ యజ్ఞ పూజాదులకు ఆస్కారములేని ఈ యుగములో భగన్నామస్మరణ చేసి జనులు ముక్తిని పొందెదరు. ఓ పన్నగాసనా! ఇంద్రజాలికుడు ప్రదర్శించుమాయ చూచువారిపైనే ప్రభావమును చూపును. కానీ అతనిసేవకులను అది ఏమీ చేయదు. అట్లే మాయకుమూలమైన భగంవంతుని శరణుజొచ్చిన వానికి ఆ అనూహ్యమైన మాయ అంటదు.

అట్టి కలియుగములో నేను భూవైకుంఠమైన అయోధ్యానగరములో ఒక శూద్రునిగా జన్మించినాను. మనోవాక్కర్మలచే నేను అఖండ శివభక్తుడను. కానీ నా బుద్ధిమాన్యముచే ఇతరదేవతలను దూషించుచుండెడి వాడను. అతిగర్వముతో ధనగర్వముతో నేనుండగా ఒకసారి అయోధ్యలో కఱవు వచ్చింది. దరిద్రుడనై దుఃఖితుడనై ఉజ్జయినీ నగరము చేరి అక్కడ కొంత ధనము సంపాదించి పరమ శివుని ఆరాధన కొనసాగించితిని. ఒక్కడ అతిదయాళువు నీతిమంతుడు పరమసాధువైన ఒక విప్రోత్తముడు వైదికపద్ధతిలో అహర్నిశలూ శివుని ఏకాగ్రచిత్తముతో నిష్కల్మషముగా

పూజించుచుండెను. అతడు ఎన్నడునూ విష్ణు నింద చేయలేదు. కపటబుద్ధితో సేనతనికి సేవ చేయుచుండెడివాడను. ఆ భూసురుడు నన్ను పుత్రవాత్సల్యముతో చూచుచూ బోధించుచుండెను. శివభక్తిసే కాక ఇతరములైన ఎన్నో నీతులను నాకతడు బోధించెను. సేను ప్రతి దినమూ దేవాలయమునకు పోయి శివనామస్మరణము చేసెడివాడను కానీ నా అహంకారమును సేను విడువలేదు. హరిభక్తులను పండిత సజ్జనులను ద్వేషించెడివాడను.

నా గురువు నా ప్రవర్తన చూసి చాల బాధపడి నిత్యమూ ఎన్నో సదుపదేశములిచ్చెడివాడు. ఆ ఉపదేశములను పెడచెవిన పెట్టి గురుద్రోహము చేయుచూ నాలోని కోపాగ్నిని ప్రజ్వలింప చేయుచూ జీవించుచుంటిని. ఇలా ఉండగా ఒక రోజు నా గురువు నన్ను పిలిచి శివకేశవుల అభేదత్వము బోధించి "పరమాత్మ అయిన శ్రీరామునికి సర్వదేవతలు బ్రహ్మ శివుడు నమస్కరించెదరు. అట్టిది నీవు ద్వేషించుట తగదు" అని అసెను. అది వినడంతో నా కోపాగ్ని మింటికెగసెను. అనర్హుడసైన నాకు విద్యనొసగిన నా గురువునకే ద్రోహము తలపెట్టాను. అయినా క్రోధాదులను జయించిన అతడు నాపై ఏమాత్రమూ కోపపడలేదు.

ఒక రోజు సేను శివాలయములో శివనామము జపించుచుండగా నా గురూత్తముడు అచటికి వచ్చెను. నా గర్వము వలన లేచి ఆయనకు నమస్కరించలేదు. దయానిధి అయిన నా గురువుకు నా దౌష్ట్యము చూచియు కొంచెముకూడా కోపమురాలేదు! కాని గురువును నిరాదరించుట మహాపాపము. పరమశివుడు ఇది చూసి సహింపలేక "ఓరీ మూర్ఖుడా! పూర్ణజ్ఞాని అయిన నీ గురువును అవమానించినావు. నీవు క్షమార్హుడవు కాదు. సద్గురువుపై ఈర్ష్యగొన్నవాడు కోట్లాదియుగములు రౌరవాది నరకములలో పడి తరువాత పశుపక్ష్యాది జన్మలు పొంది అటుపై వేలకొలది జన్మలు క్లేశములభవించును. నీ విప్పుడే అజగరముపై ఒక చెట్టుతొఱ్ఱలో పడివుండు" అని నన్ను శపించెను. భయకంపితుడసైన నన్ను చూసి నా గురువర్యుడు రుద్రాష్టకముతో శివుని ప్రసన్నుని చేసుకుని పశ్చాత్తాపముతో దుఃఖిస్తున్న నాకు శాపావశానము ప్రసాదించమని పేడుకొసెను. అంతట పరమేశ్వరుడు

"ఓ కృపానిధీ! మహాపకారికైనా మహోపకారము చేయు నిన్ను మెచ్చితిని. నీ శిష్యునికి శాపావశానమిచ్చెద" అని నన్ను చూసి "చేసిన తప్పుకు శిక్ష అనుభవింపక తప్పదు. నీవు దుర్భరమైన పేయి జన్మలెత్తుతావు. కానీ నీ గురువు మహిమవల్ల దివ్యమైన అయోధ్యానగరమున పుట్టినందువల్ల నీ మనస్సును నాయందు పెట్టి నన్ను పూజించినందువల్ల నీలో అచంచలమైన రామభక్తి ఉదయిస్తుంది. ప్రతి జన్మలో నీకు పూర్వజన్మ స్మృతి ఉంటుంది. వత్సా! ఇంకెప్పుడూ సాధుసజ్జనవిప్రులను నిరాదరింపవద్దు. ఇంద్రుని వజ్రాయుధముతో నాత్రిశూలముతో యముని దండముతో శ్రీహరి చక్రముతో చంపబడనివాడు సజ్జనద్రోహమసెడి అగ్నిలో పడి మాడిపోతాడు" అని చెప్పి నాపై కృపావర్షం కురిపించినాడు ఉమానాథుడు. అప్పటినుంచీ ప్రతి జన్మలోనూ సేను చేసిన తప్పులకు ఎంతో పశ్చాత్తాపముతో దుఃఖిస్తూ రామునిపై భక్తిని మఱువక చివరికి కాకి జన్మసెత్తి మహనీయుడైన లోమశ మహర్షి వద్ద శ్రీరామచరితమానసము విని కాకభుశుండిసై శ్రీరామునికి ప్రియుడసైనాను".

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**

౧. గురుద్రోహం శివకేశవులను భేదబుద్ధితో చూడడం సాధుసజ్జనులను అవమానించడం ఘోరపాపములని మహాశివుడు కాకభుశుండితో చెప్పాడు. కావున మనము గర్వముతో ఇట్టి తప్పులెన్నడునూ చేయరాదు.

౨. కాకభుశుండి గురువు యొక్క దయాగుణం మనకు ఆదర్శం కావాలి. శిష్యుడెన్ని అవమానాలుచేసినా తను చెప్పిన హితవాక్యాలను పెడచెవిన పెట్టినా ఏమాత్రమూ కోపగించుకోలేదు.

౩. రామభక్తుడైన కాకభుశుండి కలియుగ వర్ణనము వలన మనకు చేయకూడనివి ఎన్నోతెలిసినాయి. ఇట్టి దుష్కృతాలకు దూరముగా ఉండి ధర్మమార్గములో నడచుచూ నిత్యం భగవన్నామస్మరణ చేయడమే మన కర్తవ్యము.

## బ్రహ్మరాక్షసుని విముక్తి

పెద్దలు చెప్పిన నీతి కథ

అది దండకారణ్యమ్. మహా దట్టమైన అడవీప్రాంతమ్. కన్ను పొడుచుకున్నా కానరానంత దట్టంగా వృక్షాలు తీగలు వ్యాపించి ఉన్నాయి. ఆ భీకరారణ్యంలో ఓ మఱ్ఱిచెట్టు. దాన్ని ఆశ్రయించి ఎన్నో భూత ప్రేత పిశాచాలు. అక్కడే ఓ బ్రహ్మరాక్షసుడు తన నివాసాన్ని ఏర్పరచుకొన్నాడు. అడవిలో ఎన్నో ఔషధాలు విరాజిల్లడం మూలానేమో వాటి గాలి సోకి సోకి ఆ బ్రహ్మరాక్షసుడికి కాలక్రమేణా తాను ఆ వికృతాకారము నుండి విముక్తి పొందాలనే సద్భావం కలిగింది. ఎవరైనా తనకు సన్మార్గం చూపేవాళ్ళుంటారేమోనని అన్వేషిస్తుంటే శాపగ్రస్తురాలైన ఓ పులి దైవవశాత్తు అటుగావచ్చింది. ఆ శార్దూలరాజు కళ్ళలోని నైర్మల్యాన్ని గమనించి ఆ బ్రహ్మరాక్షసుడిలా అన్నాడు "ఓ వ్యాఘ్రేశ్వరా! నాయందు దయవుంచి నాకీ జన్మ నుండి విముక్తి కలిగే మార్గం చెప్పగలవా"?

"పూర్వ జన్మల దుష్కర్మలే ఈ వికృత జన్మలకు హేతువు. నీవు పూర్వ జన్మలో సద్బ్రాహ్మణునిగా పుట్టియు నీకు వచ్చిన విద్యను ఎవ్వరికీ అందించకుండా సమాజశ్రేయస్సుకు వినియోగించకుండా నీవద్దనే ఉంచుకున్నావు. ఆ దోషకారణముగా నీవిప్పుడు బ్రహ్మరాక్షసుడవైనావు. ఏదైనా సత్కర్మ చేస్తే నీకు విముక్తి కలుగుతుంది" అని ఆ పులి హితవు చెప్పింది. ఆ సత్యభాషణములు విని ఆ బ్రహ్మరాక్షసుడిలా అన్నాడు "జంతుపై ఇంత జ్ఞానం ఎలా సంపాదించావు"? "సేను సద్గురువును అధిక్షేపించడం వలన ఈ దేహం పొందాను. ఎదైనా సత్కార్యం చేదామని ఎంతో ప్రయత్నించాను. కానీ ఈ రూపాన్ని చూసే ఎవరూ నాదెగ్గరకైనా రవటంలేదు. ఇప్పుడు నీవేదైనా సత్కర్మ చేస్తే ఆ పుణ్యంతో నీవు నీచేత సత్కర్మ చేయించినందుకు సేను ఇద్దరం బైటపడతాం" అని పులి అన్నది.

సత్కర్మ చేయాలనే ధృడ సంకల్పంతో ఉన్న ఆ బ్రహ్మరాక్షసునకు ఓ ఆగంతకుడు కనిపించాడు. తనని ఆ రూపంలో చూస్తే భయపడతాడని ఓ సాధువు వేషంలో ఆ బాటసారి వద్దకు పోయి యోగ క్షేమాలు విచారించాడు. ఆ పాంథుడిలా తన విచారాన్ని వ్యక్త పఱిచాడు "ఒక ౧౦౦ వరహాలు కావాలి. ఎలా సంపాదిద్దామా అని ఆలోచిస్తున్నాను". ఆ రత్నాలతో ఏమి చేస్తావని ఆత్రుతగా అడిగాడు బ్రహ్మరాక్షసుడు. "రాజకుమారిని పెళ్ళాడాలి" అన్నాడు ఆగంతకుడు. పెళ్ళికి రత్నాలెందుకని ప్రశ్నించగా "ఆ ఎక్కడో హిమవత్ పర్వతాల దగ్గర ఏవో రత్నాలున్నాయిట. అవి తెస్తేగాని పెళ్ళిచేయరట. ఈ దండకారణ్యంలో ఎందరో యోగులు బ్రహ్మరాక్షసులు ఉంటారని విని వాళ్ళ ద్వారా ఆ రత్నాలు సంపాదిద్దాం అని ఇక్కడ కొచ్చాను" అన్నాడు బాటసారి.

"ఏ రాజకుమారి? అవంతీ రాజకుమారి ఆ?" అని ప్రశ్నించిన బ్రహ్మరాక్షసునితో "అవును. నీకెలా తెలుసు" అని అన్నాడు బాటసారి. "అది వీరశుల్కం. వరుని ధైర్యసాహసాలు వీరత్వం పరీక్షించడానికా నియమం. పైగా వారడిగినది ౫౦ రత్నాలేకదా"? అన్నాడు బ్రహ్మరాక్షసుడు. "వాళ్ళకంతా ఇచ్చేస్తే మరి నా భార్యాపిల్లలకో" అన్నాడు బాటసారి.

ఓరి దుర్మార్గుడా! రాజ్యాన్ని రాజకుమారిని మోసగిద్దాం అనుకున్నావా! నీలాంటి దేశద్రోహికి సహాయపడి నేనింకా పాపం మూట కట్టుకోలేను అని అనుకొని అమాంతంగా ఆ బాటసారిని మ్రింగివేశాడు బ్రహ్మరాక్షసుడు. తత్క్షణమే పులిగాశాపం పొందిన శిష్యుడు నరరూపంలో ప్రత్యక్షమై "మిత్రమా! దుష్టుడైన దేశద్రోహిని సంహరించి రాజ్యాన్ని కాపాడిన నిన్ను నన్ను ఆ ధర్మదేవుడు కరుణించినాడు. రా" అంటున్న నూతన మిత్రునితో దివ్యలోకాలు చేరుకున్నాడు బ్రహ్మరాక్షసుడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. దుష్కర్మలెన్నడునూ చేయరాదు. నేర్చిన విద్య యొక్క సారమును ఎవ్వరికీ పంచకుండా బ్రహ్మరాక్షసుడు సద్గురు దూషణ వలన శిష్యునికి దుఃఖములు తప్పలేదు.
౨. పరోపకారం యొక్క విలువ ఈ కథ మనకు తెలిపింది. కేవలం పరోపకారం ఒక్కటే తమని కాపాడగలదని తెలిసి బ్రహ్మరాక్షసుడు పులి ధృఢ సంకల్పంతో సత్కార్యం చేయదలచినారు.
౩. దేశద్రోహం చాలా పాపకార్యం. అట్టి దేశద్రోహిని సంహరించి బ్రహ్మరాక్షసుడు ఊరికి ఉపకారం చేశాడు.

## దధీచి మహర్షి కథ

శ్రీ పద్మ పురాణం లోని కథ

పూర్వం పరా త్వష్ట అనే దంపతులుండే వారు. ఎంతకాలం గడచినా వారికి సంతానం కలగలేదు. ఆమె పుత్రప్రాప్తికై పరమేశ్వరునకు తపము చేయసాగింది. ఏకాగ్ర చిత్తంతో మహాదేవుని ధ్యానంచేసింది. వేయి సంవత్సరముల పరాసాధ్వి యొక్క తపస్సునకు మెచ్చి శంకరుడు ప్రత్యక్షమైనాడు. ఆమె "పరమశివా! శూరుడు శస్త్రాస్త్రాలకు చంపబడని వాడు విప్రదానవ రూపధరుడు అయిన పుత్రుని ప్రసాదించు" అని కోరినది.

పరమేశ్వరుని వరానుసారం ఆమెకు వృత్రుడనే పుత్రుడు కల్గినాడు. స్వయంగా శుక్రాచార్యులవారే ఆ వృత్రునికి విద్యాబోధచేసినాడు. వరప్రభావంతో గురుకృపతో మహాతేజసంపన్నుడైనాడు వృత్రుడు. కాని అతనిలో బలగర్వం ఎక్కువయ్యింది. చివరికి దేవేంద్రుని మీద దండెత్తాడు! అమిత బలవంతుడైన వృత్రుడు దేవాధిపతి అయిన ఇంద్రుడు ౫౦౦౦ యేండ్లు యుద్ధం చేశారు. చివరికి వృత్రుడు విజయం పొందాడు. పరాజితుడైన శచీపతి బ్రహ్మలోకం చేరాడు. మించిన బలగర్వం మత్సరంగా మాఱగా వృత్రుడు శుక్రాచార్యునితో ఇలా అన్నాడు

"యుద్ధంలో ఓడిన ఇంద్రుడు బ్రహ్మలోకం వెళ్ళాడు. నేనూ అక్కడి వెళ్ళాలి. దారిచెప్పండి". శుక్రుడిలా బదులిచ్చాడు "రాక్షసనాథా! నీవు బ్రహ్మలోకానికి పోలేవు. తృప్తికి మించిన సంపద లేదు. త్రిలోకాధిపత్యంతో సంతృప్తిపడు". "ఇంద్రుడున్నంత వరకూ నాకు సుఖంలేదు. వాడిని నాశనం చేయాలి. ఇంద్రుడికి బ్రహ్మలోకం వెళ్ళే అర్హత ఎలా వచ్చింది? నాకెందుకు లేదు" అని వృత్రుడన్నాడు. "పూర్వం పవిత్రమైన నైమిశారణ్యంలో ౧౦౦౦ సంవత్సరాలు ఇంద్రుడు శివునికై తీవ్ర నిష్ఠతో తపస్సు చేశాడు. అంతటి తపశ్శాలి కనక బ్రహ్మలోక ప్రవేశం ఇంద్రునికి శంకరుని అనుగ్రహం వలన కలిగింది" అని చెప్పాడు శుక్రుడు. వెంటనే వృత్రుడు నైమిశారణ్యం చేరి తపస్సు ఆరంభించాడు.

దుష్టుడైన వృత్రుని సంహారమునకు శ్రీకారం చుట్టిన మహావిష్ణువు ఇంద్రునితో ఇలా అన్నాడు "సురేశ్వరా! పరమేశ్వరుని వర ప్రభావం వలన వృత్రుడు శస్త్రాస్త్రాలకు అవధ్యుడు. సరస్వతీ నదీ తీరంలో పరమనిష్ఠతో దధీచి మహర్షి తపమాచరిస్తున్నాడు. నూరుమూరల ప్రమాణంలో ఉన్న ఆ మహనీయుని వెన్నెముక వ్రజ్రముకంటే రెండు రెట్లు పటిష్టమైనది. ఆ దయాళువును లోకహితార్థము తన అస్థిని ఈయమని ప్రార్థించండి". నారాయణుని అనుజ్ఞ తీసుకుని దేవేంద్రుడు కురుక్షేత్రంలో నదీతీరంలో ఉన్న మహర్షిశిరోమణి వద్దకు వెళ్ళాడు.

దధీచి మహర్షి ఇంద్రుని రాకకు కారణమేమని అడిగినాడు. ఇంద్రుడు పూర్వ వృత్తాంతమంతయు తెలిపి ఇలా అన్నాడు "మహానుభావా! వృత్రుని ఆగడాలు మితిమీఱుతున్నాయి. అతని సంహరించకపోతే విబుధ (పండిత) వినాశం తప్పదు. దయచేసి మీ అస్థిని మాకు ప్రసాదించండి".

ఇంద్రుడు చేసిన ప్రార్థన విని దధీచి మహర్షి మహదానందంతో పొంగిపోయాడు. లోక హితార్థము తన శరీరం వినియోగపడటం కన్నా కావలిసినది ఏమున్నదన్నాడు. యోగశక్తితో శరీరత్యాగం చేశాడు! దధీచి మహర్షి చేసిన అసామాన్యమైన త్యాగానికి విభ్రమితుడైన వేల్పుదొర దధీచికి నమస్కరించాడు. అస్థితో వజ్రాయుధాన్ని చేయించి లోకభీకరుడైన వృత్ర సంహారం చేశాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. మహనీయులు పరోపకారార్థము తమ శరీరమును కూడా త్యాగం చేయడానికి వెనకాడరు. అడగంగానే మహదానందంతో ఇంద్రునికి తన అస్థిని ఇచ్చి దధీచి మహర్షి మహకు మార్గదర్శి అయినాడు.

౨. గర్వం అహంకారం వినాశ హేతువులు. బలగర్వంతో హుంకరీచిన వృత్రుడు ఎంతో వరబలం ఉండికూడా మత్సరంతో ఇంద్రుని నాశనం చేయబోయి తానే నాశనమైనాడు.

## శ్రీకృష్ణ లీలలు – తృణావర్త భంజనమ్

శ్రీ గర్గభాగవతము లోని కథ

ముద్దుకృష్ణుని ఒడిలో కూర్చుండబెట్టుకొని ఆడించుచున్నది మహాభాగ్యశాలి అయిన యశోదాదేవి. అప్పుడు తృణావర్తుడనే రక్కసుడు పెద్ద సుడిగాలి రూపములో అక్కడికి వచ్చెను. కొండంత బరువెక్కిన తయని భారము భరించలేక యశోద శ్రీకృష్ణుని నేలపైకి దించెను. జంతువులు ప్రజలు ఇంటిపైకప్పులు సైతం ఆ వెనుగాలికి ఎగురదొడగెను. ధూళి రేగగా శ్రీకృష్ణుడు యశోదకు గోపికలకు కనబడలేదు. ఆందోళనతో వారు ఆ పరమాత్ముని వెదుకసాగిరి.

చిన్నికృష్ణుడు తృణావర్తుని వెంట మింటికెగసి ఆతని వీపుపైకి ఎక్కెను. అండపిండపేదోండ సహతులను గుప్తగతి బొజ్జలో ఉంచుకొన్న స్వామి భారము మోయలేక ఆతని క్రిందికి వసరికొట్టబోయెను తృణావర్తుడు. పాపం పండిన దానవుని గొంతునులిమి శ్రీకాంతుడు భూభారము దించెను.

నేలగూలి ప్రాణములువిడిచిన అసురుని శరీరముపై ఏమీ ఎఱుగనట్టు ఆడుకుంటున్న బాలకృష్ణుని చూసి బాలకుడు క్షేమముగా ఉన్నాడని సంతోషించి యశోద శ్రీకృష్ణుని ముద్దాడి దిష్టి తీసి వేదాశీర్వచనము చేయించెను. ఎన్నో గో భూదానములు పండిత మండలికి ఇప్పించెను.

**తృణావర్తుని వృత్తాంతము**

పూర్వం పాండుదేశమును సహస్రాక్షుడను మహారాజు పరిపాలించుచుండెడివాడు. ఆతుడు మిక్కిలి భగవద్భక్తుడే కాని స్త్రీలోలుడు. సీతమ్మ చెప్పినట్టు (సత్యసంధః కథ చూడండి) ఎవడైతే వ్యసనాలకు దూరముగా ఉంటాడో వాడే ధర్మమార్గాన నడువగలడు. కామాంధుడైన ఆ సహస్రాక్షుడు దూర్వాసమహర్షి వచ్చాడని ఎఱిగియూ ఆతనికి నమస్కరించలేదు. వ్యసనపరుడై పూజ్యపూజావ్యతిక్రమ దోషము చేసిన సహస్రాక్షుని రాక్షసుడివి కమ్మని ఆ మహర్షి శపించెను. తన తప్పు తెలుసుకొని ప్రాయశ్చిత్తముతో శరణువేడిన ఆ సహస్రాక్షుని మహర్షి మన్నించి "రాజా! ఈ దుష్కార్యమునకు ఫలితమనుభవింపక తప్పదు. చేసిన కర్మ చెడని పదార్థము కదా! కానీ భక్తుడవైన నీకు పరమాత్ముడైన శ్రీకృష్ణుని పాదస్పర్శచే కైవల్యము ప్రాప్తించును" అని ఆశీర్వదించెను. ఆ సహస్రాక్షుడే తృణావర్తుడు.

**పిల్లలూ! మనమీ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**

మానువుడు అన్ని వ్యసనములనుండి ఎల్లవేళలా దూరముగా ఉండవలెను. పరమ భక్తుడైనా ఒక్క స్త్రీలోలత్వం అనే వ్యసనము వలన దుష్కర్మ చేసి శాపగ్రస్తుడైనాడు సహస్రాక్షుడు.

## భక్త పురందరదాసు కథ

పూర్వం విక్రమార్క శకం ౧౬వ శతాబ్దములో నవనిధి శ్రీనివాసనాయకుడనే గొప్పధనవంతుడు ఉండేవాడు. అతడు పరమ లోభి. భార్య సరస్వతీబాయి భక్తురాలు దానగుణశీలి. పతియే ప్రత్యక్షదైవమని నమస్కరించిన ఆ సాధ్వితో శ్రీనివాసనాయకుడిలా అనేవాడు "ఏమని ఆశీర్వదించను? అంకా దానధర్మాలు చేయమనా?" "స్వామీ! మీ అనుజ్ఞ తీసుకునే నేనీ వ్రతము ఆచరించితిని కదా!" అని బదులిచ్చిన భార్యతో "ఆ! ఆ! పొందితివి పొందితివి. తులసీపూజయే కదా ఖర్చు ఉండదులే అనుకున్నాను. కాని ఆ పేరుతో దంపతి పూజలు దానాలు ఒక్కటేమిటి అన్నీ చేశావు. నీ సుపుత్రుడు వరదుడు లెక్క చూపిన తరువాతే నాకీ విషయం తెలిసింది. నువ్విలాంటి నాగులు వ్రతాలు చేస్తే చాలు మనమందఱము తలకొక జోలె పట్టుకోవలసి వస్తుంది" అని అనేవాడు శ్రీనివాసనాయకుడు.

"రామ! రామ! అట్లా అనకండి. భగవంతుడు మనకు ఇచ్చినప్పుడే దానాదులు చేయకుంటే లేనప్పుడీయ గలమా"? అని సత్యం పలికిన సరస్వతీబాయితో శ్రీనివాసనాయకుడు "ఇందులో భగవంతుడిచ్చినది ఏమున్నది? మా తాతముత్తాతలు మా నాన్నగారు నేను ఎంతో శ్రమించి ఆర్జించినదే కదా!" అని అనేవాడు. "దానధర్మాదులకు ఉపయోగపడని ధనమెందులకు స్వామి? ఇట్టి సత్కార్యములే సద్గతులకు చద్ది మూటలని సాధుసజ్జనులంటారు" అని హితవు చెప్పిన భార్యతో భర్త "ఆ సన్యాసుల మాటలకేమిలే వాళ్ళలానే అంటారు. అవన్నీ ఆచరిస్తూ కూర్చుంటే

మనకు మిగిలేది బూడిదే! చూడు సరస్వతీ! ధనమూలమిదం జగత్ అన్నారు. ఆ సిరి యొక్క గరిమ ఎంతో కష్టపడి సంపాదించిన నాకు తెలుసు" అని అనేవాడు. ఆ భార్యా భర్తల సంభాషణములు ఇలా ఉండేవి!

శ్రీనివాసనాయకుని అనంత పూర్వజన్మ పుణ్యమో లేక సరస్వతీబాయి అఖండ సౌశీల్య మహాత్మ్యమో పుట్టు లోభి అయిన శ్రీనివాసనాయకుని భక్త పురందరదాసుగా మార్చా అనుకున్నాడు పాండురంగ విఠ్ఠలుడు. ఏ దుర్గుణాన్నైనా నివారించవచ్చును కానీ లోభగుణాన్ని మార్చుట దుష్కరం అని అనుకున్న స్వామి స్వయంగా ఆ శ్రీనివాసనాయకుని వద్దకు ఒక బ్రాహ్మణుని వేషంలో వచ్చాడు. ఎవరి పాదాలకు సకల చరాచర జీవులు ముక్తికై చేతులుజోడించి నమస్కరిస్తాయో అట్టి స్వామి శ్రీనివాసనాయకుని ముందర నిలిచి ఏదైనా దానమివ్వమని యాచించేవాడు! కసురుకుంటూ వెళ్ళగొట్టేవాడు నాయకుడు.

భగవంతుడు శ్రీనివాసనాయకుడెన్ని అవమానాలు చేసినా రోజూ పుత్రవాత్సల్యంతో వచ్చి ఏదో ఒకటి దానమిమ్మని అర్థించేవాడు. భగవంతుడు ఎన్ని సార్లు అడిగినా ఆ శ్రీనివాసనాయకుడు ఒక్కసారికూడా ఏమీ ఇవ్వలేదు. ఇలా ప్రతిరోజు ఆ లక్ష్మీపతి శ్రీనివాసనాయకుని మార్చడం కోసం పడరాని పాట్లు పడ్డాడు. బహుశః ఇందుకేనేమో ఆ భగవంతుడు ఆశ్రితపక్షపాతి అని నిందింపబడినాడు. నీవే తప్ప ఇతరమెఱుగనని శరణువేడిన సరస్వతీబాయిని రక్షించటానికే నేమో ప్రాయశః స్వామి ఇన్ని పాట్లుపడ్డాడు. లేదా కర్మయే పరమాత్మ అన్న నిజం నిరూపించేలా శ్రీనివాసనాయకుని పూర్వజన్మల పుణ్యానికి ఫలముగా ఇలా అనుగ్రహించదలచినాడో స్వామి. ఆ పన్నగశాయి లీలలు అర్థం చేసుకోవటం ఎవరి తరము?

"ఏమైనా సరే నీకేమీ ఇవ్వను" అని నిక్కచ్చిగా అన్నాడు ఒకరోజు విప్రవేషంలో ఉన్న భగవంతుని చూసి శ్రీనివాసనాయకుడు. "అయ్యా! వీడు నా ఒక్కగానొక్క కొడుకు. వీడికి ఉపనయనం చేయాలని సంకల్పించాను. ఓం ప్రథమంగా మీ వద్దకొచ్చాను. మీరు దయతో ఏది ఇచ్చినా తీసుకుంటాను" అని అడిగాడు భగవంతుడు. "ఏది ఇచ్చినా తీసుకుంటావా?" అని రెట్టిస్తూ "నేను ఇచ్చేది కిం అనక తీసుకు వెళిపోవాలి" అని అంటూ ఇల్లంతా వెతికి వెతికి తుప్పు పట్టిన కాణీ బిళ్ళ తెచ్చి విఠ్ఠలునికి ఇచ్చి పంపించి "పీడా వదిలింది" అనుకున్నాడు.

ఏదో పనిమీద నాయకుడు బయటికెళ్ళాడోలేదో మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు విఠ్ఠలనాథుడు. "అమ్మా! నాకు సహాయం చేయండి" అని అన్నాడు స్వామి. "ఇందాకే కదయ్యా మా ఆయనిచ్చారు?" అని అన్నది ఆ ఇల్లాలు. ఆ తుప్పుపట్టిన కాణీ చూపించాడు స్వామి. ఖిన్నురాలై నిస్సహాయిగా నిలుచున్న ఆమెను చూసి పరమాత్మ "అమ్మా! మీ ముక్కెర ఇప్పిస్తే నా అవసరం తీరుతుంది" అని అన్నాడు. నీళ్ళునములుతూ యాచించిన ఆ పేద బ్రాహ్మణుని చూసి జాలిపడి సరస్వతీబాయి వెంటనే తన ముక్కెర తీసి ఇచ్చింది. మనసారా ఆశీర్వదించి ముక్కెర తీసుకుని స్వామి వెళ్ళిపోయాడు. విప్రునికి ముక్కెర ఇచ్చింది కాని భర్తకు ఏమని సమాధానం చెబుతుంది? ఏమి చేయాలిరా భగవంతుడా అని వ్యాకుల పడుతుండగా ఆమె ప్రాణాలపాలిటి రెండో కాలునిలా శ్రీనివాసనాయకుడు వచ్చి "ఏదీ నీ ముక్కెర?" అని ప్రశ్నించాడు. లోభికి ధనం తప్ప ఇంకేదీ కానరాదు కదా! ఎక్కడుందో వెతికి తెమ్మన్నాడు భర్త. "రంగ రంగా! ఏమి లీల స్వామి? నాకు దిక్కెవ్వరు?" అని భగవంతునికి మొరపెట్టుకుంది సరస్వతీబాయి. "ఇది ఏమైనా సత్యయుగమా చమత్కారాలు జరగడానికి?" అని అనుకుని మరణమే శరణ్యమని నిశ్చయించుకున్నది.

ప్రేమతో అటుకులిచ్చినందుకే స్వామి సుదామునికి అనంత ఐశ్వర్యాలు కడకు కైవల్యమిచ్చాడు. ఇక అవసరానికి ఏమీ సంకోచించక అడిగనదే తడవుగా ముక్కెర ఇచ్చిన ఆ సాధ్విని మఱుస్తాడా స్వామి? "సాధ్వీ! నీ దానగుణానికి భక్తికి మెచ్చాను. ముక్కెర ధారపోసి ముక్తేశుడనైన నన్ను కొన్నావు. ఇదుగో! ముక్తిని తులతూచిన నీ ముక్కెర" అన్న భగవంతుని అంతర్వాణి వినిపించింది సరస్వతీబాయికి. ఎంతో సంతోషంతో ముక్కెర తీసుకొని భర్త దగ్గరకు వెళ్ళింది. అదిచూసి అవాక్కయ్యాడు నాయకుడు. విప్రుడు తన వద్దకే వచ్చి ముక్కెర అమ్మాడు. విషయము తెలిసింది ఆ దంపతులకు. రోజూ విప్రవేషంలో వచ్చి యాచించినది ఆ విఠ్ఠలేశుడే అని అవగతమైంది ఆ దంపతులకు. "వడివాయక తిరిగే ప్రాణబంధుడు స్వామి" అన్న సత్యం తెలుసుకున్నాడు నాయకుడు. ఆ రోజునుండి ఎన్నో దానధర్మాలుచేస్తూ భగవంతుని భక్తితో కొలుస్తూ తరించారు ఆ దంపతులు. దాదాపు నాలుగు లక్షల సంకీర్తనలు గానంచేసి భక్త పురందరదాసుగా ప్రసిద్ధికెక్కాడు శ్రీనివాసనాయకుడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**

౧. కర్మఫలం అమోఘమైనది. శ్రీనివాసనాయకుని పూర్వ పుణ్యం వలన భగవంతుడు స్వయంగా వచ్చి అతనిలోని లోభగుణాన్ని పోగొట్టి కాపాడినాడు.
౨. ఇంటికి దీపం ఇల్లాలు అని పెద్దలంటారు. ఆ సూక్తికి తార్కాణం సరస్వతీబాయి. సుశీలవతి అయిన సరస్వతీబాయి తన సుగుణాలతో స్వామిని మెప్పించి తనను తానే కాక తన భర్తను కుడా తరింపచేసింది.
౩. లోభం చాలా భయంకరమైన దుర్గుణము. సాక్షాత్ ఆ భగవంతునికే శ్రీనివాసనాయకుని లోభగుణం మార్చడానికి అంత శ్రమ పడవలసి వచ్చింది. మనమెన్నడూ ధనకాంక్షులము కారాదని దానధర్మాలు చేయాలని మనకీ కథద్వారా తెలిసినది.

## ఎన్నడూ పారుష్యపు మాటలాడరాదు

మహాభారతము లోని కథ

నహుష మహారాజు ప్రియంవద యొక్క పుత్రుడు యయాతి. అతడు ఎంతో కాలము ధర్మము తప్పకుండా రాజ్యపాలన చేసి యోగ్యుడు పితృవాక్య పరిపాలకుడు అయిన పూరువునికి రాజ్యభారమొసగి వైరాగ్యముతో తపోవనాలకు తపస్సుకై వెళ్ళిపోయాడు. వేదవేదాంగ పాఱంగులైన పండితులను తోడుగా తీసుకుని కందమూలాదులను భుజిస్తూ కఠిన నియమ వ్రతాలతో తపస్సు సాగించాడు. యయాతి ఆ తపోవనాలలో ఎన్నో

యజ్ఞ యాగాదులు చేశాడు. హవిస్సులతో దేవతలను తర్పణలతో పితృదేవతలను సంతోషపెట్టాడు. కామ క్రోధాది అరిషడ్వర్గాలను జయించి సహస్ర దివ్యవర్షములు తీవ్ర నిష్ఠతో తపస్సు చేశాడు. ముప్పది ఏండ్లు నిరాహారిగా ఒక్క ఏడాది వాయుభక్షణ చేసి తరువాత పంచాగ్నుల మధ్యలో నిలిచి తపస్సు చేశాడు. అటు తరువాత ఒక్క ఏడాది సముద్రమధ్యములో ఒంటికాలుమీద నిలబడి ఏకాగ్రతతో తపస్సు చేశాడు. ఇలా తపస్సు చేసి తన అనంత పుణ్యనిధి ప్రభావంవల్ల దివ్యవిమానములో దేవలోకానికి వెళ్ళాడు.

అక్కడ దేవర్షుల పూజలందుకొని బ్రహ్మలోకం చేరాడు. అక్కడ అనేక కల్పములు ఉండి బ్రహ్మర్షుల చేత పూజలందుకొన్నాడు! ఆ తరువాత ఇంద్రలోకాని వచ్చాడు. ధర్మాత్ముడు మహాతపశ్శక్తి సంపన్నుడు అయిన యయాతి వచ్చాడని తెలిసి దేవేంద్రుడు స్వయముగా వచ్చి అతిథికి అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించాడు. మహావిభవోపేతుడైన ఇంద్రుడు ఆ యయాతిని యథావిధి పూజించి ఇలా అన్నాడు "ఏమి తపస్సు చేశావయ్యా మహానుభావా? నువ్వు సామాన్యుడవు కావు! శతసహస్ర వర్షముల తపస్సు సామాన్యులకు సాధ్యమా?".

సాక్షాత్ దేవేంద్రుడంతటివాడు ఇలా పొగిడేసరిక యయాతి ప్రారబ్ధవశాత్తు ఇలా పారుష్య వాక్యాలు అన్నాడు "ఓ అమరేంద్రా! సుర దైత్య యక్ష రాక్షస నర ఖేచర సిద్ధ మునిగణముల తపస్సులు నా తపస్సుకు సాటిరావు". "ఔరా! ఇంత గొప్పవాడయ్యికూడా గర్వమును వీడలేదు కదా!" అని అనుకొని ఇంద్రుడు యయాతితో "మహనీయులైన మహర్షుల తపస్సులను గర్వముతో కించపఱచినావు. లోకశ్రేయస్సుకై తమ జీవితాలను ధారపోసిన ఆ మహనీయులనెన్నడూ అవమానించరాదు. ఓ యయాతి! ఈ ఒక్క మాటతో నీవు సంపాదించుకొన్న తపశ్శక్తి అంతా అంతరించిపోయింది. ఇక నీకు ఈ లోకములో ఉండటానికి అర్హతలేదు. అధోలోకానికి పో" అని శపించాడు.

తన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపముతో శరణుపేడి యయాతి "ఓ దేవేంద్రా! ఏ క్షణాన నేను పూజ్యులైన మహర్షులను అవమానించానో ఆ క్షణమే నా శక్తి అంతా కరిగిపోయింది. నన్ను అధోలోకాలకు పంపకు. నాకు సత్సంగత్యం లేకుండా చేయకు. సత్ భువనములో సత్పురుషుల సాంగత్యములో నన్ను ఉండనివ్వు" అని ప్రార్థించాడు. పశ్చాత్తాపముతో కుమిలిపోతున్న యయాతిని కరుణించి దేవేంద్రుడు యయాతికి సద్భువనములో నివసించుటకు అనుజ్ఞ ఇచ్చాడు.

సద్భువనములో ఉండి ఆ యయాతి అచిరకాలములోనే అనంత తపశ్శక్తిని మళ్ళీ సంపాదించాడు. అహంకారమును పూర్తిగా విడిచి మహాతేజోమయుడయ్యాడు. ఇలా ఉండగా ఒకసారి ఆ యయాతి దౌహిత్రులైన అష్టకుడు ప్రతర్దనుడు వసుమంతుడు ఔసీనరుడు మరియు శిబి సద్భువనమునకు వచ్చిరి. అనంతపుణ్యసంపదతో వెలిగిపోతున్న యయాతిని పూజించి "స్వామి! మీరెవరు" అని అడిగారు. యయాతి తన కథను చెప్పి "నాయనలారా! ఎంత కొంచెమైనా గర్వము ఎన్నడు ఉండరాదు. గర్వముతో నేను పారుష్యవాక్యములు మాట్లాడి ఉత్తములైన మహర్షులను అవమానించినాను. మీరెన్నడు అట్టి తప్పుచేయవద్దు. వాక్పారుష్యము విషము కన్నా అగ్ని కన్నా భయంకరమైనది" అని హితవు చెప్పాడు. యాయాతిని తమ తాతగారిగా గుర్తించి నమస్కరించి ఆయనవద్ద ఎన్నో రహస్యములైన ధర్మోపదేశాలు పొందారు అష్టకాదులు.

**పిల్లలూ! మనమీ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. గర్వము అహంకారము ఎంత కొంచెముగా ఉన్నా హాని కాలుగచేస్తాయి. ఒక్కచిన్న పారుష్యవాక్యము వలన తన తపశ్శక్తినంతా పోగొట్టుకున్నాడు యయాతి.
౨. ఎన్నడూ ఉత్తములను అవమానించరాదు. మహర్షుల తపస్సులు తన తపస్సుతో సాటిరావని అని యయాతి వారిని అవమానించాడు.
౩. ఒక సజ్జనుడెన్నడూ తప్పుచేయడు. పొరబాటుగా చేసినా దానికి పశ్చాత్తాపము చెంది ఆ తప్పు నెన్నడు మళ్ళీ చేయడు. సజ్జనుడైన యయాతి తను చేసిన తప్పును దౌహిత్రుల వద్ద చెప్పుకొని ఆ తప్పు చేయవద్దని హితవు చెప్పాడు.
౪. ఒక మనిషి యొక్క ఉద్ధారణకు సత్సంగత్యం చాలా అవసరము. ఈ విషయం తెలిసిన యయాతి సత్సంగత్య భాగ్యము కలిగించమి ఇంద్రుని కోరుకున్నాడు.

## శ్రీకృష్ణ లీలలు – యమళార్జున భంజనమ్

శ్రీమద్భాగవతము లోని కథ

అల్లరి నల్లనయ్య తల్లిమీద కినుకబూని దధిభాండమును పగులగొట్టాడు. పొరుగింటిలో దూరి ఱోలు తిరగవేసి దానిమీదకెక్కి ఉట్టిమీదనున్న వెన్నను తీసి ఒక కోతికి ఇచ్చాడు. ఇటువంటి అల్లరి పనులు చేస్తున్న దొఅదొంగను చూచి యశోద "కన్నయ్య! నీవింతవరకూ ఎవరికి చిక్కలేదనీ ఎవరూ నీ ముద్దుమోము చూచి నిన్ను శిక్షించలేదనీ బొత్తిగా అదురూ బెదురూ లేకుండా అల్లరి పనులు చేస్తున్నావు. ఇవాళ ఎలా తప్పించుకుంటావో చూస్తాను" అని అన్నది. బెత్తం తెచ్చి కొడుకును బెదిరించడానికి వచ్చిన యశోద తన మదిలో ఇలా అనుకున్నది "ఇతడు పసివాడు అనుకొందామంటే కనీవినీ ఎఱుగని అత్యబ్భుత కార్యాలు చేస్తున్నాడు. బెదిరించి బుద్ధులు నేర్పుదామనుకుంటే తనంతట తానే బుద్ధిగా ఉంటున్నాడు. అలాగని వీడు చూడని చోటులేదు ఎక్కరలేని విషయములేదు. భయము అంటూ ఒకటుందని వీడికి తెలీసేతెలియదు. నాన్నా! సాహసాలు మానరా! ప్రమాదమురా! అని చెప్పినా వినడు". ఇలా పరిపరి విధాల తలచి ఆ యశోద చివరికి "అతి గారాబము చేస్తే పిల్లలు బాగా చెడిపోతారు. అప్పుడప్పుడు నయానో భయానో మంచి గుణాలు అలవాటు చేయాలి. దుడుకుగల పిల్లలకు దండోపాయమే మంచిది" అనుకుని ఆ మాయలయ్యను బెత్తంతో జళిపించింది.

శ్రీకృష్ణుడు భయపడినట్టు నటించి ఱోలు మీదనుంచి అందెలు ఘల్లుఘల్లుమని మ్రోగుతుండగా అతివేగముగా పారిపోయాడు. ఆ తల్లి బాలకృష్ణుని వెనకాల పరుగులెట్టింది. తనను పట్టుకోలేక అలసిపోయిన తల్లిని చూసి జాలిపడి ఆ పరమాత్మ ఆమెకు దొరికిపోయాడు!

పరమయోగీశ్వరులకు సంయములకు మునులకు దొరకని ఆ భగవంతుడు భక్తురాలైన యశోదకు దొరికిపోయాడు. కన్నతండ్రిని పట్టుకున్నదే కానీ కొట్టడానికి చేతులు రాలేదు ఆ తల్లికి. యశోదాదేవి శరీరము స్వభావముకూడా పువ్వువలె మెత్తనివి. బిడ్డ మీద జాలితో దండించలేక త్రాటితో ఱోకటికి (ఉలూఖలమునకు) కట్టివేయాలనుకొన్నది. ఒక పెద్ద త్రాడు తీసుకువచ్చి ఆ బాలకృష్ణుని గట్టిగా కట్టబోయింది. కాని ఆ త్రాడు రెండంగుళాలు తక్కువయ్యింది. మరొక త్రాడు దానికి జతచేసినా మళ్ళీ రెండంగుళాలు తక్కువైనది. యశోద ఇంటిలోనున్న త్రాళ్ళన్నీ జతచేసినా ఆ నల్లనయ్య సన్నటి నడుమును చుట్టలేకపోయింది. ముజ్జగాలు దాగివున్న ఆ చిరు బొజ్జను కట్టుట ఎవరితరము? అలసిపోయిన తల్లిపై జాలిపడి నందకిశోరుడు కట్టుబడిపోయాడు. భక్తులకు పట్టుబడినట్టుగా భగవంతుడు జ్ఞానులకుగానీ మౌనులకుగానీ దానపరులకుగానీ యోగీశ్వరులకుగానీ పట్టుబడడుగదా!

యశోదాదేవి శ్రీకృష్ణుని ఇలా ఱోటికి కట్టివేసి ఇంటిపనులలో మునిగిపోయింది. బాలకృష్ణుడు ఆ ఱోలు ఈడ్చుకుంటూ పెరట్లో చాలాకాలముగా శాపగ్రస్తులై మద్దిచెట్లుగా ఉన్న నలకూబర మణిగ్రీవుల దగ్గరకువెళ్ళి వారిని కరుణించదలచి ఆ రెండు చెట్ల మధ్యనుంచి రోటిని లాక్కుంటూ వెళ్ళాడు. దానితో ఆ యమళ అర్జున వృక్షాలు కూలిపోయినాయి. అందునుంచి దిఙ్మండలము ప్రకాశింపచేయు ఇద్దరు అగ్నితుల్యులగు దివ్య పురుషులు వచ్చి స్వామిని స్తుతించి అతని అనుజ్ఞతీసుకుని కర్తవ్యోన్ముఖులై వెళ్ళిపోయారు.

**యమళార్జునుల వృత్తాంతము**

నలకూబరమణిగ్రీవులు పరమశివుని ప్రియసఖుడైన కుబేరుని పుత్రులు. వారు చాలా ధనగర్వముతో ఉండేవారు. రుద్రానుచరులై కూడా ఒకసారి వారు అతి పవిత్రమైన కైలాసపర్వతములోని ఒక సుందర ఉద్యానవనములో స్త్రీలతో కూడి వహారము చెసినారు. మదోమత్తులై వారుణి అను మదిరను పానముచేసినారు. వారు పద్మవనములో ఉన్న గంగలో జలక్రీడలాడ సాగినారు. అప్పుడు పరమపూజ్యుడైన నారదమహర్షి వారి పురాకృత సుకృతమువలన అక్కడికి వచ్చాడు. నారదుని చూసి ఆ దేవతాస్త్రీలు లజ్జితులై వెంటనే వస్త్రములు ధరించారు. కానీ మదిర ప్రభావములో ఒళ్ళు మరచిపోయిన ఆ కుబేరపుత్రులు వస్త్రములను ధరించలేదు. ఆ దేవకుమారుల అజ్ఞానమును చూచి నారదుడు ఇలా అన్నాడు

"ధనగర్వము ఎంతటి గొప్పవారికైనా నాశనము చేస్తుంది. ధనగర్వితులైన వారు మద్యపానము జూదము స్త్రీసంభోగము వంటి దుర్వ్యసనములకు లోబడి అనేక పాపకార్యాలు చేయుదురు. నిర్దయులై మనోవినోదముకై పశువులను వధించెదరు. నశ్వరమైన దేహమును శాశ్వతమైనదని నమ్మి దేహసౌఖ్యమే పరమానందము అనుకొనెదరు.

మద్యపానమత్తులై నగ్నముగా ఉండి ఘోరాపరాధము చేసిన వీరు స్థావరత్వమును పొందుటకు తగియున్నారు. మరల వీరెన్నడూ ఇట్టి అకార్యములు చేయకుండుటకై నా అనుగ్రహమువలన వీరికి పూర్వజన్మ స్మృతి ఉండును. నూరుదివ్యవర్షములు చేసిన తప్పుకు పశ్చాత్తాపము నొంది పునీతులై నా అనుగ్రహముచే కృష్ణభక్తులై దైవత్వమును పొందగలరు". ఆ కుబేర పుత్రులే యమళార్జునులు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. వస్త్రధారణము యొక్క ప్రాముఖ్యత మనకు ఈ కథ ద్వారా తెలిసినది. ఎప్పుడూ సరిగా వస్త్రములేకుండా ఉండరాదని నారదమహర్షి మనకు చెప్పాడు.
౨. వారుణి అనే మదిర ప్రభావములో ఉండి తప్పని తెలిసికూడా నలకూబరమణిగ్రీవులు వస్త్రధారణము చేయలేదు. మదిరాపానం వలన మానవుడు తెలియకనే అనేక పాపాలు చేస్తాడు. పంచమహాపాతకాలలో మొదటిది ఈ మదిరాపానమే. అందుకని మనమిట్టి దుర్వ్యసనములకు ఎల్లప్పుడూ దూరముగా ఉండాలి.
౩. ధనగర్వము ఉండరాదని నారదమహర్షి మనకు ఉపదేసించాడు. శివానుచరులై ఉండికూడా కేవలము ధనగర్వము వలన కుబేరపుత్రులు వారి దైవత్వాన్ని కోల్పోయారు.
౪. తీర్థాలు పుణ్యక్షేత్రాలు సిద్ధప్రదేశాలు ఎప్పుడు విహార దృష్టితో వెళ్ళరాదని మనకు ఈ కథ ద్వారా తెలిసినది.

## గౌతమ మహర్షి కథ

వివిధ పురాణాల లోని కథ

ఒకసారి సృష్టికర్త అయిన చతుర్ముఖుడు సరస్వతీదేవిని మెప్పించటానికి అహల్యను సృష్టించాడు. "న హల్యతి ఇతి అహల్య". అంటే ఎందులోనూ అఱకొఱలు లేనిది సాటిలేనిది అని అర్థము. బ్రహ్మదేవుడు ఆ అపూర్వ గుణవతి సౌందర్యవతికి వరుడెవ్వడని యోచించి తీవ్ర బ్రహ్మచర్య నిష్ఠ నిగ్రహం ఉన్న సంయమీంద్రుడే ఆమె భర్తకాగలడని నిశ్చయించినాడు. గౌతమ మహర్షి అట్టి ధీరుడని కనుగొని ఆతనిని పరీక్షించుటకై "నాయనా! ఈ అతిలోక సుందిరి నా పుత్రిక అహల్య. ఈమెను నీ ఆశ్రమములో వదిలి వెళుతున్నాను. జాగ్రత్తగా చూసుకో. మళ్ళీ వచ్చి ఆమెను తీసుకువెళతాను" అని ఆజ్ఞాపించాడు. ఆ పరమేష్టికి ప్రీతిచేయుట కంటే అధికమేమున్నది తలచి గౌతముడు బ్రహ్మదేవుని ఆజ్ఞను శిరసావహించాడు. ఎంతో కాలము గడచిపోయింది. అయినా ఎన్నడూ సంయమీంద్రుడైన ఆ గౌతముడు అహల్యను చూసి చలించలేదు. పరమశివభక్తుడైన ఆ గౌతముడు పంకజాసనుని పరీక్షలో నెగ్గాడు. గౌతముని నిగ్రహాన్ని మెచ్చుకొని అహల్యను అతనకి అర్థాంగిగా అనుగ్రహించాడు బ్రహ్మదేవుడు.

మహర్షులు తపస్సుకై అనేక ప్రాంతాలు సంచరిస్తూ కొన్ని చోట్ల నివసించి తమ తపశ్శక్తి ద్వారా ఆ ప్రాంతాన్ని సస్యశ్యామలం పునీతం చేసి మరొకప్రాంతానికి వెళుతుంటారు. అలా ఒకసారి గౌతమ అహల్య దంపతులు త్ర్యంబకేశ్వరుని సన్నిధివద్దనున్న బ్రహ్మగిరిపై ఆశ్రమం నిర్మించుకొని అక్కడ ఉండసాగినారు.

గౌతముడు వ్యవసాయ భూ జల శాస్త్రాలలో నిపుణుడు. భారతీయుల వేదవిజ్ఞానం భౌతికమైన విజ్ఞానమే కాక దానికి ఆధారమైన ఆధ్యాత్మిక దైవిక విజ్ఞానాన్ని కూడా అందిస్తుంది. గౌతముడు భౌతిక విజ్ఞానముతో సాధించలేని పనులను దైవికశక్తి ద్వారా సాధించి ఎన్నో ప్రాంతాలను సస్యశ్యామలం చేశాడు. ప్రకృతిని క్షోభించకుండా వివిధ రకాలుకా కాలువలు జలాశయాలు నిర్మించి ఎందఱినో ఆదుకున్నాడు. ఇలా ఉండగా ఒకసారి ఆయన ఉన్న ప్రాంతములో క్షామము వచ్చింది. యోగీశ్వరులు తప్ప మిగిలినవారంతా ప్రాణాలు కాపాడుకోవటానికి తాలా ఒక పైపుకి వెళ్ళిపోయారు. దయాళుపైన గౌతముడు ప్రజల పశుపక్షాదుల బాధలు చూడలేకపోయాడు. అనివార్యమైన ప్రారబ్ధాన్ని కూడా మార్చగలిగే శక్తి తపస్సుకున్నదని తెలిసిన గౌతముడు ఆఱు నెలలు వరుణదేవునికై తీవ్రతపస్సు చేసినాడు. గౌతముడి పరోపకారబుద్ధికి మెచ్చి వచ్చిన వరుణుడిని గౌతముడు వర్షాన్ని ప్రసాదించమని కోరినాడు. అప్పుడు ఆ వరుణుడు "ఓ మునీంద్ర! కాలధర్మమును అతిక్రమించి వర్షించలేను కదా! మహాకాలుడైన ఆ పరమేశ్వరుని ఆజ్ఞానుబద్ధులము మేము. జీవుల పాపపుణ్యాలను అనుసంధానము చేసి ఆ మహేశ్వరుడు మా ద్వారా ప్రకృతిని శాసిస్తాడు. ఇప్పుడు కొంతకాలము క్షామము తప్పదు" అని అన్నాడు. ప్రాణులను రక్షించాలని దృఢ సంకల్పంతో ఉన్న గౌతముడు అక్షయజలం కోరాడు. వరుణుడు అక్షయజలాన్ని అనుగ్రహించాడు. ఇలా తన తపశ్శక్తి ద్వారా గౌతముడు ప్రాణికోటికి ప్రాణదానం చేశాడు.

అహల్యా గౌతమ దంపతులు నిరంతర అతిథిసేవా పరాయణులు. గౌతముడు తన వ్యవయాస శాస్త్రవిజ్ఞానముతో శిష్యుల సహాయముతో వరి కాయగూరలు మొదలైన పంటలు పండించేవాడు. పరమసాధ్వి పతివ్రత అయిన అహల్య ఆ పంటలనుండి వచ్చిన వాటిని వండి అతిథులకు ఆర్తులకు పెట్టేది. అపర అన్నపూర్ణ వలె విరాజిల్లేది ఆ అహల్య.

ఇలా ఉండగా గౌతమ అహల్యల అద్వితీయ అతిథిసేవ వారి ధర్మనిరతి చూసి ఈర్ష్య చెందారు కొందరు మునులు! ఆహా! ఈర్ష్య అతి దారుణామైనది. అది మహామేధావులైన మునులను సైతం విడువదు. "ఈ జలం తాము తెచ్చిందేననే అహంకారంతో విర్రవీగుతున్నారీ అహల్యాగౌతములు" అంటూ కువ్యాఖ్యానాలు చేసేవారు. ఈర్ష్య మత్సరముగా మారి చివరికి వాళ్ళు గౌతముని అక్కడనుండి వెళ్ళగొట్టాలని నిశ్చయించుకున్నారు. అన్నం పెట్టిన గౌతమునికి కృతజ్ఞత చూపక పోవటమేకాక అతనికి కీడు చేయాలని అనుకున్నారు. మత్సరముతో బాధపడుతున్నవాడు ఎంత పాపకార్యము చేయటానికైనా వెనుకాడడు కదా!

గౌతముడు తప్పస్సును లోకహితార్థము ఉపయోగించితే ఈ మునులు మత్సరముతో అతనికి హానిచేయటానికి ఉపయోగించారు. పవిత్రమైన మంత్రములను లౌకిక స్వార్థ ప్రయోజనాలకై వాడకూడదని తెలిసికూడా ఆ మునులు గౌతమునికి కీడు చేయాలనే ఉద్దేశ్యముతో మహాగణపతిని మంత్రబద్ధముగా ఉపాసనచేశారు. ప్రత్యక్షమైన విఘ్నేశ్వరునితో తమ కోరిక చెప్పారు. ఆ వినాయకుడు ఆశ్చర్యపడి "ఔరా! ఏమి చిత్రము! ప్రాణదాతకి ప్రత్యుపకారం చేయకపోగా అతనికి అపకారం చేస్తున్నారే! ఇట్టి కృతఘ్నుల పాపానికి నిష్కృతి ఉండదు" అని తలచి "నాయనలారా! అపకారికి ఉపకారము చేయమని మన శాస్త్రాలు ఘోషిస్తుంటే మీరు కనీసము కృతజ్ఞతా ధర్మాన్ని కూడా పాటించుట లేదెందులకు? ఈ ప్రయత్నం మానండి. కృఘ్నుతకు మించిన పాపం లేదు" అని హితవు చెప్పాడు. "స్వామి! నీవు నిజంగా మంత్రబద్ధుడవే అయితే మా కోరిక తీర్చు" అని సమాధానం చెప్పారు ఆ మునులు. "ఎవరి కర్మకు వారే బాధ్యులు. అటులనే అగుగాక" అని అంతర్థానమయ్యాడు మహాగణపతి.

గణేశుడు ఒక మాయాధేనువును సృష్టించినాడు. అది గౌతముడి పొలాన్ని పాడుచేయసాగినది. పవిత్రమైన గోమాతను ఎన్నడు అదిలించరాదని తెలిసిన గౌతముడు ఆ మాయాధేనువును పక్కకి పంపాలని గడ్డి పరకలు తీసుని గోవుపై వేశాడు. దానికే అది మృతిచెందినది. గౌతముడు దుఃఖిస్తూ "పరమేశ్వరా! నేనేమి అపరాధము చేసినాను? గడ్డిపరకలు తగిలి గోవు మృతిచెందుటేమి? నన్ను ఈ ఘోరమైన గోహత్యాపాతకము నుండి రక్షించు స్వామి!" అని ఆక్రోశించాడు. ఇలా బాధపడుతున్న గౌతముని చూసి ఆ మునులు "గోహత్య వంటి మహాపాతకము చేసిన మీరు పవిత్రమైన ఈ ఆశ్రమములో ఉండకూడదు. తక్షణం వెళ్ళిపోండి" అని తూలనాడి రాళ్ళు విసిరి వెళ్ళగొట్టారు.

మహాపాపము చేశానే అనే దుఃఖంతో గౌతముడు అహల్య ఆ ప్రాంతం విడిచి వెళ్ళిపోయారు. సకల ధర్మసూక్ష్మాలు తెలిసిన ఆ గౌతమ మహర్షి ప్రాయశ్చిత్త విధానము తెలిసికూడా పండితమండలిచే ఆమోదముద్ర వేయించుకోవాలనే ఉద్దేశ్యముతో క్రోశదూరం వెళ్ళినా తిరిగివచ్చి తనకు అపకారం చేసిన మునులకు నమస్కరించి "అయ్యా! నా పాపానికి ప్రాయశ్చిత్తం ఉపదేశించండి" అని ప్రార్థించాడు! "గౌతమా! చేసిన తప్పు చెప్పుకుంటూ పృథ్వికి ముమ్మార్లు ప్రదక్షిణము చేసి ఇక్కడ మాసవ్రతము చేయాలి. లేదా ఈ బ్రహ్మగిరికి నూటొక్కమార్లు ప్రదక్షిణములు చేసి కోటి పార్థివలింగారాధన చేసి గంగాస్నానము చేయాలి" అని ప్రాయశ్చిత్త మార్గాన్ని బోధించారు. గౌతమ మహర్షి అటులనే చేశాడు. అప్పుడు పరమశివుడు సంతోషించి

"నాయనా! గౌతమా! నీవు ధన్యుడవు. ఆజన్మ శుద్ధుడవైన నీకు పాపము లేదు. ఇదంతా ఆ మునుల కుతంత్రము. ఈ కృతఘ్నులకు ప్రాయశ్చిత్తము లేదు. వీరు భ్రష్టులై వేదమార్గాన్ని వదిలి నాకు దూరమవుతారు. వీరి వంశములోని వారంతా పతితులవుతారు. వత్సా! ఏదైనా వరం కోరుకో. ప్రసాదిస్తాను." అని అన్నాడు. కరుణామయుడైన గౌతముడు "స్వామి! ఈ మునివరులు నాకు ఉపకారమే చేసినారు. వీరివల్లనే కదా నేడు నాకు నీ దర్శన మహద్భాగ్యము కలిగినది!" అని అన్నాడు. పరమశివుడు గౌతముని క్షమాగుణము చూసి సంతోషించాడు. "స్వామి! లోకకళ్యాణార్థము గంగను ప్రసాదించు" అని కోరాడు గౌతముడు. పరమశివుని సంకల్ప మాత్రాన ప్రత్యక్షమైన గంగాభవానిని స్తుతించి గౌతముడు "భాగీరథిపై ఉత్తర భారతమును అనుగ్రహించినట్టే గోదావరిపై దక్షిణ భారతాన్ని ఆంధ్రభూమిని పునీతము చేయి తల్లీ!" అని ప్రార్థించాడు.

గంగాదేవి కోరికపై స్వామి త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగ రూపుడై గోదావరినది జన్మస్థానములో అవతరించాడు. గౌతమ మహర్షి పేఋన ఆ నది గౌతమీనదిగా ప్రసిద్ధికెక్కినది.

**పిల్లలూ! మనం ఈ కథలోని నీతులను మరొక్కమాఋ చూద్దాము:**

౧. ఈ ప్రపంచానికి ఆధారమైన నాలుగు పుణ్యస్తంభాలు: భూతదయ నిరహంకారం పరోపకారం ఇంద్రియ నిగ్రహమ్. ఈ గుణాలు నిండుగా ఉన్న గౌతముడు మనకు ఆదర్శపురుషుడు. బ్రహ్మదేవుని పరీక్షలో నెగ్గి గౌతముడు తన అఖండ మనోనిగ్రహాన్ని మనకు చూపినాడు. క్షామము నుండి ప్రాణులను కాపాడి తన దయ పరోపకార బుద్ధి చూపినాడు. సకల ధర్మరహస్యాలు తెలిసినా పండితుల వద్దకు వెళ్ళి ప్రాయశ్చిత్త విధానము తెలుసుకొని తన వినయవైభవాన్ని చాటినాడు.

౨. ప్రకృతిని క్షోభించకుండా మానవకళ్యాణము సాధించే విజ్ఞానము భారతీయులది. గౌతముడు భౌతిక విజ్ఞానానికి దైవికశక్తిని జోడించి ప్రజాశ్రేయస్సును కల్పించాడు.

౩. అహల్యాగౌతములు అసామాన్యమైన అతిథిసేవ చేసి మనకు మార్గదర్శకులైనారు. వారు రోజూ వరి కూరలు మొదలైనవి పండించి వండి ఆర్తులకు వడ్డించేవారు.

౪. కృతఘ్నతకు మించిన పాపములేదని పరమశివుడు చెప్పాడు. అట్టి వారి పాపానికి నిష్కృతిలేదని మనకు చెప్పాడు పరమేశ్వరుడు. కావున మనము ఎల్లప్పుడు కృతజ్ఞులమై ఉండాలి.

౫. ఈర్ష అసూయ మత్సరము మానవునిచే ఎట్టి దారుణపాపకృత్యాన్నైనా చేయిస్తాయి. కాబట్టి మనను ఈర్షకు లోనుకాకుండా జాగ్రత్తగా ఉండాలి.

## శీలసంపద

మహాభారతము లోని కథ

ఖాండవవన దహనమప్పుడు లోకైకవీరుడైన అర్జునుడు తనను రక్షించినందుకు కృతజ్ఞతగా మయాసురుడు మయసభను నిర్మించి ధర్మరాజుకివ్వాలని సంకల్పించుకున్నాడు. మయాసురుడు ఆ భవ్య మయసభను పవిత్ర హిమాలయాలలో నిర్మించి తన మాయశక్తితో ఇంద్రప్రస్థానికి తెచ్చాడు. మయసభలోని అద్భుతాలను పొగడటానికి మాటలుచాలవు. మయసభ అంతా కనక రత్న మణిమయము. మయసభలోని స్తంభాలు ద్వారాలు తోరణాలు వనాలు తటాకాలు అన్నీ మణిమయాలే. రాజసూయ యాగానికి వచ్చిన ఎందఱికీ సంభ్రమాశ్చర్యాలు కలిగించి నభూతో నభవిష్యతి అని పొగడబడినది ఆ మయసభ. మయసభ విభవం పాండవుల అదృష్టం చూసి దుర్యోధనుని అసూయామాత్సర్యాలు మరింత చెలరేగాయి. పాండవుల కీర్తి సంపదలను తలచుకొని తీవ్రంగా దుఃఖిస్తూ తన తండ్రి అయిన ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి తన బాధను చెప్పుకున్నాడు దుర్యోధనుడు. మత్సరమనే ఘోరసర్పముచే కాటువేయబడ్డ తన కొడుకుకి ఇలా హితవు చెప్పాడు ధృతరాష్ట్రుడు

"కుమారా! నీకు మాత్రం తక్కువ ఐశ్వర్యమున్నదా? ఈ లోకంలో సంతృప్తి ఉన్నవాడే ధనవంతుడు. సంతృప్తి లేకుండా కుబేర సంపద ఉన్నా వాడు సంతోషముగా ఉండలేడు. నాయనా! శీలవంతుడైన ధర్మనందనుని శ్రీలక్ష్మి ఎన్నడూ విడువదు. శీలవంతుని ఆశ్రయించే సకల సంపదలు సుగుణములు ఉంటాయి. కాబట్టి నీవు కూడా ధర్మాత్ములైన పాండవులవలె శీలవంతుడవు కమ్ము. తానుతో సిరిసంపదలు వాటంతట అవే వస్తాయి". కుమారునికి ఒక ఇతిహాసం చెప్పాడు

"ప్రహ్లాదుడు సర్వగుణ సంపన్నుడు విద్యా పారంగతుడు పరమ విష్ణుభక్తుడు. ధర్మం తప్పకుండా తన ప్రజలను పాలించేవాడు. తన సౌశీల్య ప్రభావం చేత త్రిలోకాధిపత్యం ఇంద్రత్వం ప్రాప్తించింది ప్రహ్లాదునికి. చతుర్భువనాలను జనరంజకముగా పాలించసాగాడు ఆ ప్రహ్లాదుడు. ఇలా ప్రహ్లాదుని వలన పదవీ భ్రష్టుడైన శచీపతి గురువైన బృస్పతులవారిని తనకు మళ్ళీ ఇంద్రపదవి సిద్ధించే ఉపాయం చెప్పమని ప్రార్థించాడు. బృహస్పతి విష్ణు అవతారుడైన పరశురాముని ఆశ్రయించమని చెప్పాడు. గురు ఆజ్ఞపాటించి ఇంద్రుడు భార్గవరాముని శరణుజొచ్చి ఉపాయం బోధించమని ప్రార్థించాడు. "అతనికి అంత శక్తి ఎలా వచ్చిందో అతనినే అడుగు. ఆ శక్తిని అతనివద్దనుండే పుచ్చుకో" అని చెప్పాడు భార్గవుడు.

విద్యార్జన గురుసుశ్రూష వలనే సాధ్యం అని తెలిసిన దేవేంద్రుడు విప్రవేషం ధరించి ప్రహ్లాదునికి శిష్యుడై అతనిని భక్తితో సేవించటం మొదలుపెట్టాడు. అలా ఎంతో కాలం ప్రహ్లాదుని సేవించినాడు వజ్రి. ప్రసన్నుడైన ప్రహ్లాదుడు "నాయనా! ఏమి కోరి నన్ను సేవిస్తున్నావు?" అని విప్రవేషంలో ఉన్న ఇంద్రుని అడిగాడు. శచీపతి తన అభీష్టం వ్యక్త పఋచినాడు. అప్పుడు ప్రహ్లాదుడు

"కుమారా! నేనెప్పుడూ రాజునని గర్వించను. ఎవఱినీ నొప్పించను. వారికి హితమేచేస్తాను. ఈర్ష అసూయ ద్వేషం పగ మొదలైనవి నా దరి చేరనివ్వను. అడిగినవాడికి లేదనకుండా సంతోషపెడతాను. నా పురాకృత పుణ్యం వలన నాకీ సౌశీల్యం అబ్బినది" అని చెప్పాడు. "ఓ దయామయా! దానశీలా! నీ శీలం నాకు ప్రసాదించు" అని అడిగాడు ఇంద్రుడు. "అయ్యో పాపం!" అని ప్రహ్లాదుడు తన శీలాన్ని దేవేంద్రునికి దానం ఇచ్చి పంపివేశాడు.

ఇంద్రుడు వెళ్ళాడో లేదో ప్రహ్లాదునిలోనుండి ఒక దివ్య తేజఃపుంజము పురుషాకృతిదాల్చి బయటికి వచ్చింది. "నీవెవరు?" అని ఆశ్చర్యాముగా అడిగాడు ప్రహ్లాదుడు. "నేను నీ శీలాన్ని. ఆ విప్రునికి నన్ను దానం ఇచ్చావు కదా. వెళుతున్నాను" అని చెప్పి వెళిపోయింది శీలము. ఒకతేజస్సు తరువాత ఒకటి ప్రహ్లాదుని వీడిపోయినాయి. ఒక తేజస్సు అన్నది "నేను సత్యమ్. శీలాన్ని ఆశ్రయించి ఉంటాను. శీలంతో పాటూ నేను నిన్ను

విడుస్తున్నాను". మరొక తేజస్సు అన్నది "రాజా! నేను ఋజుప్రవర్తనమ్. సత్యము లేని చోట నేనుండలేను". "నేను బలమ్. సత్ప్రవర్తన లేనివాడి వద్ద నేనుండను" అని వెళ్ళిపోయింది బలమ్. చివరికి ఆదిలక్ష్మి బయటికి వచ్చి "నేను శ్రీలక్ష్మిని. బలం ఉన్నచోటే నేనుంటాను. వెళుతున్నాను" అని అన్నది. అప్పుడు ప్రహ్లాదుడు "అమ్మా! లోకమాతా! నీవూ నన్ను విడిచిపోతున్నావా? ఈ అభాగ్యునిపై దయ చూపవా? వెళ్ళొద్దు తల్లీ! ఆ విప్రుడు ఎవరు తల్లీ?" అని ప్రార్థించాడు. "అతడు దేవేంద్రుడు. పోగొట్టుకున్న రాజ్యమును సంపాదించడనికి నీవద్దకు వచ్చాడు. అన్ని సంపదలకూ మూలమైన శీలమును నీవు అతనికి దానమిచ్చావు కావున శీలాన్ని అనుసరించి మేమందరమూ వెళుతున్నాము" అని సర్వాణి చెప్పింది. నిజమైన శ్రీహరి భక్తులకు సాధ్యం కానిదేమున్నది? ప్రహ్లాదుడు మళ్ళీ తన సద్గుణాలను సంపదలను అచిరకాలంలోనే సంపాదించుకున్నాడు. కనుక నీవెల్లప్పుడూ సౌశీల్యుడవై వర్ధిల్లు నాయనా!" అని కుమారునికి హితవు చెప్పాడు ధృతరాష్ట్రుడు.

**పిల్లలూ! మనమీ కథలోని నీతిని మరొక్కమారు చూద్దాము:**
సౌశీల్యం యొక్క ప్రాముఖ్యత మనకీ కథ ద్వారా తెలిసినది. శీలమున్న వాడి వద్దనే సకల సంపదలుంటాయి. కాబట్టి మొదట శీలవంతులము కావడం ముఖ్యము.

## శ్రీకృష్ణ లీలలు – వత్సాసుర భంజనమ్

శ్రీ గర్గభాగవతము లోని కథ

బలరామకృష్ణులకు గోవులనుగాచే వయస్సు వచ్చినది. నీలాంబరధారి అయిన బలరాముడు పీతాంబరధారి అయిన శ్రీకృష్ణుడు గోవులను చక్కగా అలంకరించి గోపాలురతో కలిసి పచ్చిక బయళ్ళలో విహరించుచుండేవారు. కాళిందీనదీ తీరము వారికి ప్రియమైన విహారస్థలమయ్యెను. తన మధుర వేణుగానముతో పరమాత్మ జీవులకు సామవేద సారాన్ని బోధించేవాడు. బ్రహ్మానందముతో గోవులు గోపబాలురు పశుపక్ష్యాదులు ఆ వేదవేద్యుని వేణుగానం వినుచుండెడివి. శ్రీకృష్ణుడు గోపాలురు ఎన్నో ఆటాలాడేవారు. వారు పక్షులనీడలలో పఱుగులెట్టేవారు. నెమళ్ళ లేళ్ళ గుంపుల వెంటబడేవారు. కోతికొమ్మంచులు బిళ్ళంగోళ్ళు ఆడేవారు. యమునా నదిలో జలకాలాడేవారు.

ఒకసారి వారు వివిధ జంతువులను అనుకరిస్తూ ఆడుచుండగా కంసప్రేరితుడైన వత్సాసురుడు వచ్చి శ్రీకృష్ణుని ఆలమందలో కలిసి పోయాడు. సర్వజ్ఞుడైన స్వామి అదిగమనించాడు. మెల్లమెల్లగా వచ్చి ఆ వత్సాసురుడు పరమాత్మను తన్నాడు. నందకిశోరుడు వాడి కాళ్ళు పట్టుకొని గిరగిరా త్రిప్పి వెలగచెట్టుకేసి కొట్టాటు. మృతినొందిన ఆ వత్సాసురుడి నుంచి తేజము బయటికి వచ్చి పరమాత్మలో కలిసిపోయింది.

**వత్సాసురుని వృత్తాంతము**
మురాసురుడనే రాక్షసుని కుమారుడు ప్రమీలుడు. వాడు దురాశకులోనై కపటవిప్రవేషం ధరించి సర్వాభీష్టఫలదాయిని అయిన నందినీధేనువును తనకు దానమిమ్మని వసిష్ఠుని కోరినాడు. నందినీధేనువు వాడి కుటిలత్వం గ్రహించి అసురస్వభావము గల లేగదూడవు కమ్మని శపించింది. పశ్చాత్తాపముతో శరణువేడిన ప్రమీలుని కరుణించి ఆ నందిని "చేసిన పాపమునకు ఫలమనుభవించక తప్పదు. పాపము తీరిన తరువాత నా అనుగ్రహము వలన నీవు పరమాత్మ చేతిలో మరణిస్తావు. అలా ముక్తిని పొందుతావు" అని ఆశీర్వదించింది.
**పిల్లలూ! మనం ఈ కథలోని నీతిని మరొక్కమారు చూద్దాము:**
కుటిలత్వము ఉండరాదని మనకీ కథ ద్వారా తెలిసినది. కపటవేషము వేసి మోసగించబోయిన ప్రమీలుని శపించినది నందినీధేనువు. కావున ఇతరుల నెన్నడూ మోసం చేయరాదు.

## దురాశ దుఃఖములకు చేటు

శ్రీరామచరిత మానసము లోని కథ

కైకయ రాజైన ప్రతాపభానుడు సద్గుణసంపన్నుడు మరియు గొప్పయోధుడు. అతని ప్రియసోదరుడు అరిమర్దనుడు. అరిమర్దనుడు మహాబలశాలి వీరుడు. ప్రతాపభానుని మంత్రి ధర్మరుచి. అతడు నీతజ్ఞుడు బుద్ధిమంతుడు రాజనీతిలో శుక్రుని తోటివాడు శ్రీహరిభక్తుడు రాజుకు హితైషి. దిగ్విజయయాత్రలో ఆ రాజు సప్తద్వీపాలనూ జయించి సమస్త భూమండలమునకు ఏకైకచక్రవర్తి అయ్యాడు. మంత్రి అయిన ధర్మరుచి ప్రభావమువలన ఆ రాజు గురువులను దేవతలను సాధుసజ్జనులను పితరులను భూసురులను భక్తివిశ్వాసాలతో సేవించుచుండెడివాడు. రాజధర్మములను వేదోక్తముగా పాటిస్తూ నిత్యమూ అనేక దానధర్మాలు చేసేవాడు. పురాణేతిహాసములను భక్తిశ్రద్ధలతో వినేవాడు. ఎన్నో బావులు చెఱువులు ఉద్యానవనాలు దేవతామందిరాలు కట్టించి ప్రజారంజకముగా రాజ్యపాలన చేసేవాడు.

వనాలలో ఆశ్రమములను నిర్మించుకొన్న మహర్షులు తమ తపశ్శక్తిలో ఆఱవభాగము రాజులకు ధారపోస్తారు. ఆ శక్తితో రాజులు ధర్మబద్ధముగా రాజ్యపాలన చేయుచుందురు. కావున లోకహితైషులైన మహర్షులను క్రూరమృగములనుండి కాపాడంటం రాజుల విధి. ఒకసారి ప్రతాపభానుడు వింధ్యాటవికి శాస్త్రప్రకారము చంపదగిన మృగములను వేటాడుటకై వెళ్ళెను. ఆ సుందరారణ్యములో ఒక పెద్ద అడవిపందిని చూసి దానివెంటబడ్డాడు రాజు. ఆ వనవరాహము ఎంత ప్రయత్నించినా తనకి చిక్కలేదు. ఎంతో దూరం పరుగెత్తి ప్రవేశించుటకే దుర్గమమైన ఘనారణ్యములోకి వెళ్ళిపోయింది ఆ వరాహము. ధీరుడైన ప్రతాపభానుడు తనప్రయత్నం మానక ఆ దట్టమైన అడివిలోకి ఏకాకిగా ప్రవేశించాడు. చివరికి ఆ వరాహం ఒక గుహలోకి దూరింది. గుహలోకి వెళ్ళుటకు వీలులేక నిరాశతో ప్రతాపభానుడు వెనుకకు మఱలాడు. కాని ఆ ఘోరారణ్యములో దారితప్పిపోయాడు.

ఆ వనములో తిరిగి తిరిగి బాగా అలసిపోయి ఒకచోట సొమ్మసిల్లి పడిపోయాడు. కొంతసేపటికి తేరుకుని నిర్మానుష్యమైన అడవిలో ఒక ఆశ్రమాన్ని కనుగొన్నాడు. ఆ ఆశ్రమము ఒక కపటసన్యాసిది. ఆ కపటవేషధారి పూర్వం ప్రతాపభానునిచే యుద్ధములో ఓడిపోయి పాఱిపోయిన శత్రురాజు. హృదయములో ప్రతాపభానునిపై ద్వేషమును నింపుకొని ఆ అడవిలో ఉంటున్నాడు. ప్రతాపభానుని చూడగానే అతనిని గుర్తుపట్టాడు. కానీ అలసిపోయి ఉన్న ప్రతాపభానుడు వాడిని గుర్తించలేదు! దాహముతో బాధపడుతున్న రాజుకు ఒక సరోవరం చూపించాడు. ప్రతాపభానుడు సరోవరములో స్నానముచేసి శుచి అయ్యి నీరు త్రాగినాడు. ప్రతాపభానుని ఆశ్రమములోపలికి ఆహ్వానించాడు ఆ కుహనాసన్యాసి. "నాయనా! నీవెవఱు? ప్రాణాలకు తెగించి ఈ ఘోరాటవిలోకి ఎందులకు వచ్చావు"? అని అడిగినాడు కపటసన్యాసి. రాజనీతి తెలిసిన ప్రతాపభానుడిలా సమాధానమిచ్చినాడు "ఓ మహాత్మా! మీ సహాయమునకు కృతజ్ఞుడను. నేను ప్రతాపభానుడనే రాజు యొక్క మంత్రిని. వేటకై వచ్చి తప్పిపోయాను. నీ దర్శభాగ్యము కలుగుట నా అదృష్టము". "ఓ సజ్జనుడా! బాగా చీకటి పడినది. నీ రాజ్యము ఇక్కడికి డెబ్బది యోజనములున్నది. కావున నీవు ఈ రాత్రికి నా ఆశ్రమములో విశ్రాంతి తీసుకుని ఱేపు వెళ్ళు" అని చెప్పాడు ఆ కపటుడు. సన్యాసి దయాగుణాలను ఎన్నో విధాల పొగిడి ఆ రాత్రికి అక్కడే ఉండటానికి నిశ్చయించుకున్నాడు రాజు.

మాయమాటలతో రాజును తనను నమ్మేలాచేసి ఈర్ష్యాగ్నితో కాలిపోతున్న ఆ కపటసన్యాసి నిర్మలుడైన ప్రతాపభానుడు అర్థించుటచే తన వృత్తాంతమును ఇలా చెప్పసాగాడు "సోదరా! వినుము. నేనిచట చాలా కాలముగా ఉంటున్నాను. ఇంతవఱకూ నా వద్దకు ఎవరూ రాలేదు. నా గురించి నేనెవరికీ చెప్పుకోలేదు. లోకప్రతిష్ఠ తపస్సును దగ్ధముచేసే అగ్నివంటిదికాదా! అందుకనే ప్రపంచానికి దూరముగా ఉంటున్నాను. శ్రీహరితో తప్ప నాకింకెవరితోను పనిలేదు". వైరాగ్యబుద్ధి కలిగి శ్రీహరిభక్తుడై ఉన్నాడని తెలియగానే ప్రతాపభానునికి ఆ బకధ్యానిమీద గౌరవం పెరిగిపోయింది. ప్రతాపభానుడు పూర్తిగా తన వశుడైనాడని తెలుసుకొని "పుత్రా! నా పేరు ఏకతనుడు. సృష్టిప్రారంభములో నేను జన్మించాను. తరువాత మఱియొకదేహము దాల్చలేదు అందుకే నన్ను ఏకతనుడంటారు". ఆశ్చర్యముగా వింటున్న ప్రతాపభానునికి అప్పుడు కపటసన్యాసి ఎన్నో ప్రాచీనగాథలు పురాణేతిహాసములు సృష్టిస్థితిలయములను గూర్చిన వింత వింత కథలెన్నో చెప్పాడు. జ్ఞానవైరాగ్యాల మీద వ్యాఖ్యానాలిచ్చాడు. ఇవన్నీ విని పరవశుడై రాజు "స్వామీ! నేను ప్రతాపభానుడను" అని చెప్పాడు. "రాజా! గురుకృపవల్ల నాకు అంతా తెలుసు. మీ తండ్రి పేరు సత్యకేతువు. నీ రాజనీతి మెచ్చుకుంటున్నాను. తెలియని వానితో పేరు చెప్పిన రాజ్యమునకే అపాయము అని తెలిసి నీవు ఇందాక నీ పేరు చెప్పలేదు. నేనెంతో ప్రసన్నుడనైనాను. నీకొక వరమిస్తాను కోరుకో" అని అన్నాడు ఆ కపటసన్యాసి.

సద్గుణ సంపన్నుడైనా ప్రతాపభానునకు ఒక తీరనికోరిక ఉండేది. దురాశ అనే హాలాహలముచే బాధింపబడుతున్న ఆ రాజు ఇలా కోరాడు "ఓ దయాసాగరా! నా శరీరము జరామరణదుఃఖ రహితమగుగాక. యుద్ధములో నన్నెవరూ జయింపకుండు కాక. భూమిపై నూఱుకల్పములు నా ఏకచ్ఛత్రాధిపత్యము నిలిచియుండుగాక". ధర్మరుచి ప్రభావము వలన తాను చేసే కర్మ అంతా శ్రీహరికి అర్పించి "సర్వం కృష్ణార్పణమ్" అని అంటున్నా ప్రతాపభానుడు ఆ సూక్తిలోని ఆంతర్యమును అర్థంచేసుకోలేదు. పూర్వం హరణ్యకసిపుడు కోరిన వరము వలెనున్న ఈ దురాశాభూయిష్టమైన వరమును కోరినాడు. నిజమైన సన్యాసి అయితే ఈ కోరిక విని "నాయనా! ఈ శరీరము శాశ్వతము కాదు. ఎందులకు దీనిమీద ఇంత మక్కువ? భగవద్భక్తి ఒక్కటే శాశ్వతము శ్రీహరిని శరణు వేడు" అని హితవు చెప్పేవాడు. కానీ కపటుడగుటచే ఆ సన్యాసి "తథాస్తు. నిన్ను సర్వప్రాణులనుండి కాపాడతాను. నా ప్రభావం వల్ల యముడు కూడా నీ దగ్గరకు రాలేడు. కానీ ఒక్క విప్రశాపం నుండి నేను నిన్ను రక్షించలేను" అని అన్నాడు. "గురూత్తమా! విప్రులను ప్రసన్నము చేసుకునే ఉపాయము దయతో నాకు సెలవీయ్యండి" అని ప్రార్థించాడు రాజు. "సరే. కానీ నీవీ విషయము చాలా రహస్యముగా ఉంచాలి. నన్ను కలుసుకున్నట్టు ఎవరితో నైనా చెపితే నీకు బహుదుఃఖములు కలుగుతాయి. నీ మంచి కోరే చెపుతున్నాను. మూడోకంటికి ఈ విషయము తెలిసిందా నీవు నశిస్తావు" అని అన్నాడు సన్యాసి.

"గురువర్య! త్రిమూర్తులు కోపగించినా గురు రక్షిస్తాడు కానీ గురువే కోపిస్తే రక్షించేవాడుండడు. మీ ఆజ్ఞ అతిక్రమించను. ఆజ్ఞ ఇవ్వండి. శిరసావహిస్తాను" అని అన్నాడు ప్రతాపభానుడు. ఆహా! ఆశ ఎంత దారుణమైనది! ఇన్ని ఏండ్లుగా విద్యాబుద్ధులు నేర్పించి సంస్కారాన్ని ప్రసాదించిన తన నిజగురువును ఒక్క నిమిషములో వదిలేసి కపటసన్యాసి గురించి ఏమీ తెలియకుండానే వాడిని నమ్మి "గురూత్తమా!" అని సంబోధించేలా చేసింది. అప్పుడు ఆ బకధ్యాని "విప్రులను స్వాధీనపఱచుటకు అనేక మార్గములు కలవు. నీకు అన్నిటికన్నా సులభమార్గము చెప్పెదను. ఒక సంవత్సరముపాటూ ప్రతిరోజు లక్షమంది ఉత్తములైన విప్రులను కుటుంబసహితముగా ఆహ్వానించు. నేను నా తపశ్శక్తిచే మీ పురోహితుని వేషముదాల్చి వారికి వండిపెట్టెదను. ఇప్పుడు నీవు విశ్రాంతి తీసుకో. నా తపశ్శక్తిచే నిన్ను నీ అంతఃపురములో చేరుస్తాను. సరిగ్గా మూడు రోజుల తరువాత నీ పురోహితుని రూపములో నీకు దర్శనమిస్తాను. అన్ని ఏర్పాట్లు చేసివుంచు" అని అన్నాడు. రాజు ఎంతో సంతోషించి బాగా అలసిపోయినందు వలన గాఢనిద్రపోయాడు.

ఇంతలో కపటసన్యాసి స్నేహితుడైన కాలకేతు రాక్షసుడు వచ్చాడు. వాడే వరాహవేషము దాల్చి ప్రతాపభానుని దారిమఱల్చినాడు. స్త్రీలను సజ్జనులను దేవతలను హింసిస్తున్న కాలకేతు నూర్గురుకుమారులను పదిమంది సోదరులను యుద్ధములో చంపి దుష్టసంహారం చేశాడు ప్రతాపభానుడు. దీనిని గుర్తుపెట్టుకుని అతనిపై ద్వేషం పెంచుకున్నాడు కాలకేతువు. కపటసన్యాసి కాలకేతువు కలిసి నాటకమాడి ప్రతాపభానుని నాశనం చేయదలచారు! కాలకేయుడు తన మాయతో ప్రతాపభానుని అంతఃపురంలో చేర్చి పురోహితుని ఒక గుహలో బంధించి తానే పురోహితునిగా కామరూపం ధరించాడు. తరువాతరోజు ప్రతాపభానుడు నిద్రమేల్కొని తాను అంతఃపురములో ఉన్న విషయము గ్రహించి ఆ కపటసన్యాసి శక్తిని చూసి ఆశ్చర్యపోయాడు. మూడురోజులు క్షణమొక యుగముగా గడిపినాడు. శ్రీహరి ధ్యానం వదిలి ప్రతిక్షణం ఆ కుహనాసన్యాసి పాదాలనే ధ్యానించసాగినాడు.

అనుకున్న ప్రకారం లక్షమంది ఉత్తమ విప్రులను ఆహ్వానించాడు ప్రతాపభానుడు. ఆ కుహనాపురోహితుడు తన మాయచేత లెక్కలేనన్ని వ్యంజనములు నాలుగురకాలైన వంటలను పాకశాస్త్రమును అనుసరించి షడ్రసోపేతముగా సిద్ధంచేసినాడు. కానీ వానిలో అనేకజంతువుల

మాంసములేకాక బ్రాహ్మణులమాంసము కూడా కలిపి వడ్డించినాడు. భోజనార్థము విప్రులు సిద్ధమగుతుండగా కాలకేతుడు ఆకాశవాణిని సృష్టించి "ఓ విప్రోత్తములారా! ఈ భోజనము హానికరము. దీనిలో జంతువిప్ర మాంసమున్నది. దీనిని భుజింపవద్దు" అని పలికించెను. ఆకాశవాణి వినగానే ఆ లక్షమంది విప్రులు "ఓ క్షత్రియాధమా! మమ్ము సపరివారముగా భ్రష్టులను చేయ తలచితివి. నీవుకుటుంబ సహితముగా రాక్షసుడపై జన్మించు. ఒక్క సంవత్సరములో నీవు నీవంశంతో సహా నశిస్తావు. మీకు తిలోదకాలిచ్చెడివారు కూడా ఉండరు" అని ఘోరశాపాన్నిచ్చారు. తమయుక్తి సఫలమైనదని కాలకేతుడు కపటసన్యాసి సంతోషించారు. కపటసన్యాసి శత్రురాజులందఱిని కూడబెట్టుకోని ప్రతాపభానునిపై దండెత్తినాడు. వీరుడైన రాజు అరిమర్దనుడు ఎంతో కాలం వారితో యుద్ధం చేశారు. చివరికి ఒక సంవత్సరం తరువాత తన వంశముతో సహా ప్రతాపభానుడు నశించినాడు. కొంది కాలము తరువాత వారందఱూ రాక్షసులై జన్మించినారు. ప్రతాపభానుడు రావణునిగా అరిమర్దనుడు కుంభకర్ణునిగా ధర్మరుచి విభీషణునిగా జన్మించిరి. ఒకానొక కల్పములో శ్రీరామావతారమునకు ఇదియే నాంది.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. మానవునకు ఆశ ఉండవచ్చు. కాని "అతి సర్వత్ర వర్జతే". సమస్త భూమండలానికి ఏకచ్ఛత్రాధిపతి అయికూడా ప్రతాపభానుడు కపట సన్యాసిని అడగరాని వరంకోరి చివరికి నాశనమైనాడు.
౨. మన శాస్త్రాలలో గురువుని ఎలా పెతకాలో వివరించారు. ఎంతో అన్వేషించి ఉత్తముడైన వానిని గురువుగా స్వీకరించాలి. ప్రతాపభానుడు తన దురాశ వలన ఒక్క రాత్రి పరిచయంతోనే కపటుని గురువుగా స్వీకరించాడు.
౩. బహిశ్శత్రువులైనా అంతశ్శత్రువులైనా (కామ క్రోధాదులు) హాని చేయకమానవు. కావున ఎల్లప్పుడూ అప్రమత్తులమై ఉండాలి. ప్రతాపభానుడు శత్రువులైన కాలకేతు కపటసన్యాసులను గమనించక వారిచేత మోసగించబడినాడు.

## శంఖ లిఖితుల కథ

మహాభారతము లోని కథ

పూర్వం శంఖుడు లిఖితుడు అనే ఇద్దరు సోదరులు ఉండేవారు. వారు బాహుదానదీ తీరములో ఆశ్రమాలను నిర్మించుకొని తపస్సు చేయసాగినారు. ఇలా ఉండగా ఒకరోజు అన్నగారిని చూడలనిపించి లిఖితుడు శంఖుని ఆశ్రమమునకు చేరుకున్నాడు. అన్నగారు ఎక్కడో బయటికి పెళ్ళారని తెలుసుకొని ఆశ్రమములోని ఒక చెట్టునీడలో కూర్చుని దాని పండ్లలు తింటూ అన్నగారికోసం నిరీక్షించాడు. వేదవేదాంగ పారంగతుడైన శంఖుడు వచ్చి తన తమ్ముని చూసి సంతోషించాడు. ఆతడు పండ్లను ఆరగించటం చూచి "తమ్ముడూ! ఈ పండ్లు నీకెక్కడివిరా?" అని అడిగాడు. లిఖితుడు చెప్పినది విని "ప్రియసోదరా! ఇది తప్పు కదా! అజమానినైన నేను లేని సమయములో నా అనుమతిని పొందకనే ఫలములను తీసుకునుట అపరాధమని నీవెఱుగవా? మన మహారాజుగారి వద్దకు పెళ్ళి నీవు చేసిన తప్పుకి తగిన శిక్షని అనుభవించి రా!" అని అన్న అయిన శంఖుడు ఆజ్ఞాపించినాడు.

తండ్రి తరువాత తండ్రంతటి అన్న మాట తప్పని లిఖితుడు పెంటనే సుద్యుమ్న మహారాజు వద్దకు పరుగెట్టాడు. మునీంద్రుడు వచ్చాడని తెలియగానే ధర్మాత్ముడైన సుద్యుమ్న మహారాజు ఎదురేగి అర్ఘ్యపాద్యాదులర్పించి పూజించాడు. అప్పుడు లిఖితుడు "పార్థివకులభూషణ! ఈ పూజలకు నేను అనర్హుడిని. నేను మా అన్నగారు లేని సమయములో ఆయన ఇంటికి పెళ్ళి చెట్టుకున్న పండ్లను ఆయన అనుమతి లేకుండా కోసుకొని తిన్నాను. కనుక నేను చేసిని ఈ దొంగతనానికి తగిన రీతిలో శిక్షవేసి నన్ను రక్షించు. రాజదండన పొందిన వానికి యమదండన ఉండదని మా అన్నగారు నాకు హితవు చెప్పారు" అని ప్రార్థించాడు. "తపశ్శక్తితో లోకాలకు హితవు చేసే మిమ్ము ఎట్లు శిక్షించము?" అని నచ్చచెప్పినా లిఖితుడు తన పట్టువదలలేదు.

చివరికి సుద్యుమ్నుడు దండనీతి శాస్త్రాన్ని అనుసరించి లిఖితుని చేతులు నరికించాడు. లిఖితుడు ఎంతో సంతోషించి మహారాజును మనసారా ఆశీర్వదించి అన్నగారి వద్దకు పరుగెట్టాడు. శిక్షను అనుభవించి పునీతుడై వస్తున్న తమ్ముని చూచి శంఖుడు "నాయనా! మంచి పని చేశావు. నీవంటి ఉత్తముని వలన మన వంశమంతా ఉద్ధరింపబడుతుంది.

మద్యపానము, గురుపత్నిని ఆశించడము, విప్రుని చంపడము, విప్రుని ధనమును అపహరించడము (లిఖితుడు తెలియక చేసిన తప్పు ఇదే) మరియు ఈ పనులను చేసేవారితో కలిసి తిరగడము ఇవ్వి పంచమహాపాతకాలు. నువ్వు తగిన రాజదండన పొంది పాప విముక్తుడ పైనావు. ఈ బాహుదానదీ పుణ్యజలాలలో మునిగి దేవమునిపితృ తర్పణాలు ఇవ్వు" అని ఆజ్ఞాపించాడు. పెంటనే అన్నగారి ఆజ్ఞపాటించాడు లిఖితుడు. లిఖితుడు బాహుదా నదిలో మునక పేశాడోలేదో తన బాహువులు వచ్చేశాయి! ఆశ్చర్యచకితుడై అన్నగారికి నమస్కరించాడు. శంఖుడు "ప్రియసోదరా! నువ్వు చేసిన తప్పుకు శిక్షను అనుభవించి పునీతుడపైనావు కావున భగవంతుడు నిన్ను కరుణించినాడు. బాహుదానదీ మహాత్మ్యము నా తపశ్శక్తి ప్రభావము నీ చేతులు మొలవటానికి దోహదం చేశాయి. దండనీతిని సక్రమముగా అనుసరించి నిన్ను కాపాడిన సుద్యుమ్న మహారాజు కూడా ధన్యుడు" అని చెప్పాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. దండనీతి యొక్క ప్రాముఖ్యత మనకీ కథ ద్వారా తెలిసినది. ఏ తప్పుకు ఏ శిక్షను అనుభవించాలో వవరించి ఈ దండనీతి శాస్త్రము మనలను యమబాధలనుండి కాపాడుతుంది.
౨. తెలిసి చేసినా తెలియక చేసినా తప్పు తప్పే. చేసిన తప్పుకు శిక్ష ఎప్పుడో ఒకప్పుడు అనుభవించక తప్పదు. ఈ విషయము తెలిసిన శంఖుడు తమ్మునిపైన అనుగ్రహముతో మహారాజువద్దకు పెళ్ళి దండన అనుభవించిరమ్మనాడు.

౩. అన్నగారు చెప్పిన హితవును వెంటనే అనుసరించి లిఖితుడు తనంతట తాను రాజు వద్దకు వెళ్ళి చేసిన తప్పొక్కుకుని దండించమని ప్రార్థించినాడు. దండన అనుభవించి పునీతుడైనాడు.
౪. ఈ కథలో అందఱూ తమ కర్తవ్యములను బాగా పాటించి మనకు మార్గదర్శకులైనారు. విపులైన శంఖలిఖితులు లోకహితార్థం తపస్సులు చేసుకుంటూ కాలము గడిపినారు. దండనీతికోవిదుడైన సుద్యుమ్న మహారాజు లిఖితునికి తగిన శిక్షవేశాడు. లిఖితుడు అన్నగారి మాట జవదాటలేదు. శంఖుడు తమ్ముని శ్రేయస్సునే కోరినాడు.

## శ్రీకృష్ణలీలలు – బకాసుర వధ

శ్రీ గర్గభాగవతము లోని కథ

యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుడు బాలునివలె గోపాలురతో యమునాతీరమున తిరుగుతూ ఆడుచూ ఉండెను. అప్పుడు కైలాస పర్వతమంత ఎత్తుగా ఉన్న ఒక పెద్ద కొంగ అక్కడికి వచ్చెను. మేఘగర్జన వలెనున్న దాని అరుపు విని గోపబాలురు భయభ్రాంతులైరి. ఆ మహాబకము తన ముక్కుతో పరమాత్మను నోటిలోకి వేసుకొని మ్రింగెను.

లోకరక్షకుని రక్షించుటకై దేవేంద్రుడు వజ్రప్రయోగము చేసెను. విధాత దండమును విసరెను. ఆ బకాసురునికి ఏ హానీ జరగలేదు! పరమేశ్వరుడు త్రిశూలముచే దాని రెక్క విఱుగగొట్టెను. వాయదేవుని వాయవ్యాస్త్రము యముని దండము సూర్యుని వేయిబాణములు చంద్రుని నీహారాస్త్రము ఆ బకాసురునిపై పనిచేయలేదు! ఆగ్నేయాస్త్రముతో అగ్నిదేవుడు ఆ బకుని రొమ్ములను కాల్చెను. వరుణదేవుడు పాశముతో భద్రకాళి గదతో కొట్టగా ఆ బకాసురుడు మూర్ఛనొందెను. కొంతసేపటికి తేరుకున్న బకుని కాలు విఱుగగొట్టెను తన శక్త్యాస్త్రముతో కుమారస్వామి. ఒంటికాలితోనే మింటికెగసి ఆ బకాసురుడు దేవతలను తరిమికొట్టెను!

మహర్షులు వేదవేద్యుడైన శ్రీకృష్ణస్వామిని ధ్యానించగా బకాసురుని ఉదరములోనున్న స్వామి వాడి పొట్ట ఉబ్బునట్లు చేసెను. ఊపిరాడక బకుడు పరమాత్మను బయటకు ఉమ్మివేసెను. తరువాత బకుడు ముక్కుతో పొడవగా నందకిశోరుడు బకుని ముక్కుపుటములను చీల్చెను. మరణించిన బకాసురుని చూచి దేవతలు పరమాత్మపై పుష్పవృష్టి కురిపించిరి. బకునిలోని తేజస్సు కృష్ణపరమాత్మలో కలసెను.

**బకాసురుని వృత్తాంతము**

హయగ్రీవుడనే రాక్షసుని కుమారుడు ఉత్కలుడు. వాడు తన బలపరాక్రమాలతో దేవేంద్రుని జయించి స్వర్గాధిపతి అయ్యెను. ఇట్లు నూరేండ్లు త్రిలోకాధిపతియై శోభిల్లెను. అన్ని ఏండ్లు దేవేంద్రపదవిని పొందియూ బుద్ధిమాంద్యముచే ఆతడు మహాతేజస్వి అయిన జాజిలి మహర్షి ఆశ్రమము వద్దనున్న సింధూ మహాసాగరమునకు పోయి అక్కడ చేపలను పట్టుచుండెను. అప్పుడు జాజిలి మహర్షి ఉత్కలుని చూచి "ఓయి! నీకిట్టి జీవహింస చేయ తగునా? వంశానుక్రమమున నీకు లభించిన సంస్కారమేమి? నీవు చేయుచున్న పని ఏమి? జీవ హింస మహాపాపమని ఎఱుగవా"? అని మందలించెను. మూర్ఖుడైన ఉత్కలుడు మహర్షి మాటలను విశ్వసించక జీవహింస కొనసాగించుచుండెను. అంతట జాజిలి మహర్షి "కొంగవలె చేపలు పట్టుచుంటివి కావున బకుడవు కమ్ము" అని శపించెను. పశ్చాత్తాపముతో మహర్షిని శరణువేడినాడు ఉత్కలుడు. అప్పుడు మహర్షి "వత్సా! కర్మ ఫలితమును అనుభవింపక తప్పు కదా! పశ్చాత్తాముతో పునీతుడవైన నీకు శ్రీకృష్ణ సందర్శనము కలుగును. ముక్తిని పొందెదవు" అని అనుగ్రహించినాడు.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఱు చూద్దాము:**

అహింసా పరమో ధర్మః ।
ధర్మహింసా తథైవచ ॥

ఈ సూక్తికి అద్దంపట్టే కథ బకాసుర వధ. ఇంద్రపదవిని చేపట్టి తన సంస్కారానికి విరుద్ధముగా చేపలను పట్టుకుని ఉత్కలుడు జీవహింస చేసినాడు. అందులకు జాజిలి మహర్షి అతనిని శపించినాడు. కావున మనము జీవ హింస ఎన్నడూ చేయరాదు.

దుష్టుడు లోకహింసా పరాయణుడు అయిన ఉత్కలుని సంహరించి శ్రీకృష్ణపరమాత్మ ధర్మసంస్థాపన చేసినాడు. శ్రీకృష్ణుడు చేసినది ధర్మహింస అయినది. పైన చెప్పిన సూక్తి ప్రకారము అహింస పరమ ధర్మము. అహింస అంతే గొప్పది ధర్మహింస.

## శుచిలేనిది సత్పురుషదర్శనం లభించదు

మహాభారతము లోని కథ

వేదప్రవర్తకుడైన పైలమహర్షికి ఉదంకుడను ఉత్తమ శిష్యుడుండెడివాడు. అతడు బ్రహ్మతేజస్సు కలవాడు మహాతపస్సంపన్నుడు. గురుదేవతా అనుగ్రహం వలన అణిమాద్యష్టసిద్ధులు జ్ఞానము పొందిన మహానుభావుడు ఉదంకుడు.

ఒకరోజు గురుపత్ని అతనికి ఒకకార్యమును అప్పుచెప్పినది "నాయనా! మనదేశ మహారాజైన పౌష్యుడు ధర్మాత్ముడు. ఆయన ధర్మపత్ని ఉత్తమురాలు. ఒక వ్రతము చేయుటానికి నాకు ఆ సాధ్వి కుండలాలు కావాలి. ఆమెను అర్థించి అవి తీసుకొనిరా". గురుపత్ని ఆజ్ఞను శిరసావహించుటకై ఉదంకుడు వెంటనే ధర్మాత్ముడైన పౌష్యమహారాజు వద్దకు బయలుదేరినాడు. దారిలో అరణ్యమార్గములో వెళుతుండగా ఒక మహావృషభము మీదనున్న దివ్యపురుషుని చూచినాడు. అతడు సూర్యుని వలె వెలిగిపోతున్నాడు. ఆ దివ్యపురుషుడు ఉదంకునికి అనుగ్రహముతో పవిత్రమైన గోమయమును ఆరగించుటకు ఇచ్చెను. అమృతప్రాయమైన గోయమును భుజించి గురుపత్ని ఆజ్ఞ త్వరగా నెరవేర్చుటకై ఆ మహాపురుషుని వద్ద సెలవు తీసుకొని పౌష్యుని రాజ్యమును చేరుకున్నాడు.

పౌష్యుడు ఉదంకునికి యథావిధి సత్కారాలు చేసి రాకకు కారణమేమియో తెలుపుమని ఉదంకుని ప్రార్థించినాడు. ఉదంకుడు తన గురుపత్నిగారి ఆజ్ఞను రాజుకు తెలిపినాడు. "ఆహా! లోకశ్రేయస్సును కోరే మీవంటి తాపసులను సేవించుటకంటే అదృష్టమేమున్నది? మహానుభావా నా రాణి వద్దకు వెళ్ళి నా మాటగా చెప్పి కుండలములను తీసుకొనుము" అని పౌష్యుడు చెప్పినాడు. వెంటనే ఉదంకుడు మహారాణిగారి మందిరమును చేరుకున్నాడు. కానీ ఆయనకు ఎక్కడా పౌష్యరాణి కనబడలేదు! తిరిగివచ్చి "రాజా! నాకు మహారాణి కనబడలేదు. నీవే ఆ కుండలములను తెప్పించి ఇవ్వు" అని అడిగినాడు.

అప్పుడు పౌష్యమహారాజు ఇలా అన్నాడు "భూవినుత! నీవంటి త్రిభువన పావనుని అశుచివి అని ఎట్లా అనగలను? నా రాణి మహాపతివ్రత కావున అశుచులకు కనబడదు". ఉదంకుడు ఎందులకు తనకు అశుచి వచ్చినదో ఆలోచించినాడు. తాను గురుపత్నీ కార్యమును త్వరగా పూర్తిచేసే తొందరలో ఆ మహాపురుషుడు ఇచ్చిన గోమయాన్ని భుజించిన తరువాత ఆచమించలేదని గుర్తుకు వచ్చినది. వెంటనే కాళ్ళూ చేతులు అన్ని కడుక్కుని కేశవ నామాదులతో ఆచమనము చేసి శిచియై మహారాణి అంతఃపురమునకు వెళ్ళినాడు. అక్కడ యథాస్థానములో మహారాణిని చూసి ఆమె పాతివ్రత్య మహాత్మ్యమునకు ఆశ్చర్యపోయి "మహారాణీ! మా గురుపత్ని వ్రతార్థము మీ కుండలములు కోరి వచ్చినాను" అని ప్రార్థించినాడు. ఆ పతివ్రతామతల్లి తన కుండలములు ఇట్టి తాపసులకు ఉపకరిస్తున్నాయని సంతోషించి ఉదంకునకు కుండములను ఇచ్చి పంపివేసినది.

**పిల్లలూ! ఈ కథలోని నీతిని మరొక్కమాఋ చూద్దాము:**
శుచిత్వము సత్పురుషుల సందర్శనమునకు ప్రథమ సోపానము. ఉదంకుడు భోజనము తరువాత తొందరలో ఉండి కాళ్ళుకడుక్కుని ఆచమించనందున ఎంతగొప్పవాడైనా ఆయనకు పతివ్రత అయిన పౌష్యరాణి కనబడలేదు. కావున మనమన్ని వేళలా ముఖ్యముగా సత్పురుష, దైవ సందర్శనమునకు వెళ్ళునప్పుడు శుచిగా ఉండవలయును. ఇదే కారణముగా అర్జునుడు, అశ్వత్థామ బ్రహ్మాస్త్రప్రయోగమునకు ముందు శుచులై మంత్రప్రయోగము చేసినారు (ద్రౌపదీదేవి కథ చూడండి). బకాసురుని యుద్ధమునకు ముందు భీమసేనుడు ఆహారము భుజించి శుచిఅయ్యి తరువాతనే యుద్ధముచేసినాడు (బకాసురవధ కథ చూడండి). అవంతీరాజు, విక్రమార్కుడు పుష్కరిణిలో స్నానము చేసిన తరువాతనే కాళీ ఆలయములోకి ప్రవేశించినారు (విక్రమార్కుని కథ చూడండి).

## శ్రీకృష్ణలీలలు – అఘాసుర వధ

శ్రీ గర్గభాగవతము లోని కథ

ఏ పరమపురుషుని బ్రహ్మణ్యులు పరబ్రహ్మ అని, వైష్ణవులు విష్ణువని, శైవులు మరియు ఇతర భక్తులు శివుడని, కాపాలికులు కాలభైరవుడని, శాక్తేయులు శక్తి అని కొలిచెదరో అట్టి వేదవేద్యుడైన స్వామి గోపబాలురకు సఖునిగా స్నేహితునిగా మెలిగి వారితో కలిసి తని ఆడి పాడి వరిని తరింపచేసినాడు. ఆహా! గోపబాలుల అదృష్టమే అదృష్టము. (అదృష్టమంటే కనబడనిది – అంటే మన జన్మజన్మాంతరాల కర్మఫలము)

ఒకసారి శ్రీకృష్ణుడు గోపబాలురు యమునాతీరమున ఆడుచుండగా కంసప్రేరితుడైన బకాసురుని జ్యేష్ఠపుత్రుడు అఘాసురుడు ఒక పెద్ద కొండచిలువ రూపమున వచ్చి నోటిని తెరిచి శ్రీకృష్ణునికై ఎదురుచూసెను. దాని పైపెదవి మేఘమండలమును క్రింది పెదవి భూమిని తాకుచుండెను!

శ్రీకృష్ణలీలలను ప్రత్యక్షముగా చాలాసార్లు చూసిన గోపబాలురు అతడే రక్షిస్తాడనే నమ్మకముతో గోవులతో సహా పెద్దకొండబిలము వలెనున్న అఘాసురుని నోటిలోకి వెళ్ళిపోయినారు. నందకిశోరుడు కూడా లోనికి ప్రవేశించెను. పరమాత్మ ప్రవేశించగానే అఘాసురుడు నోరుమూసివేసెను. విషవాయువుల ప్రభావముచే గోవులు గోపబాలురు ప్రాణములు విడిచిరి. అప్పుడు పరమాత్మ అఘాసురుని నవరంధ్రాలను మూసి ఉదరము ఉబ్బునట్టు చేసెను. అఘాసురుని పొట్టపగిలి నందనందనుడు బయటికి వచ్చెను. సంకల్పమాత్రముచే శ్రీకృష్ణుడు గోవులను గోపబాలురను బ్రతికించెను. అఘాసురుడు ముక్తినొందెను.

**అఘాసురుని వృత్తాంతము**
శంఖుడనే రాక్షసుని కుమారుడు అఘాసురుడు. అతడు సుందరాంగుడు యౌవనుడు బలిష్ఠదేహుడు. కాని పరులను నిందించు స్వభావము కలవాడు. వాడు ఒకసారి అష్టావక్ర మహర్షిని చూచి "ఇన్ని వంకరలేమి" అని హేళన చేసెను. మహర్షి అనుగ్రహము చూపుటకు "ఓరీ! వంకరలని హేళన చేసిన నీవు సర్పరూపమును ధరింతువు" అని శపించెను. చేసిన తప్పుకు పశ్చాత్తాపముచెంది రక్షించమని ప్రార్థించిన అఘాసురునితో అష్టావక్ర మహర్షి

"నాయనా! పరనింద మృత్యువువంటిది. మనము అనవసరముగా ఎవరినైనా నిందిస్తే నిందింపబడిన వాడి పాపములో సగం మనకివస్తుంది. అంతేకాక మనం ఎంతో కష్టపడి ఆర్జించుకున్న పుణ్యసర్వస్వములో సగం అతనికి వెళిపోతుంది. కావున అనవసరముగా పరనిందచేయరాదు. నీవు చేసిన తప్పుకు పశ్చాత్తాపముచెంది పాపఫలము అనుభవించిన తరువాత ద్వాపరయుగములో శ్రీకృష్ణపరమాత్మ కృపచే ముక్తిని పొందుతావు" అని ఆశీర్వదించినాడు.

**పిల్లలూ! మనమెన్నడూ అనవసరముగా పరులను నిందించరాదు.**

## దీపకుని గురుసేవ

పెద్దలు చెప్పిన నీతికథ

పూర్వం దీపకుడనే నైష్ఠిక బ్రహ్మచారి ఉండేవాడు. అతడొకనాడు శాస్త్రాలలో చెప్పబడిన ఈ సుక్తిని చదివినాడు "పతివ్రతకు భర్త పుత్రునికి తల్లిదండ్రులు శిష్యునకు గురువు దైవసమానులు. వీరిని మించిన దైవము లేదు. వీరి సేవను మించిన తీర్థాలు వ్రతాలు ఉపవాసాలు లేవు. తరించుటకు ఇదియే అతిసులభ మార్గము" అని చదివినాడు. వెంటనే గురువును అన్వేషించుటకు బయలుదేరినాడు. పవిత్ర గోదావరీనదీ తీరమున వేదధర్మ మహర్షి ఆశ్రమము ఉన్నదని ఆయన సకల వేదవేదాంగాలు తెలిసినవాడని ఉత్తమ గురువు అని ఎందఱో చెప్పగా విని ఆయనను ఆశ్రయించి సాష్టాంగ నమస్కారము చేసినాడు. వినయవంతుడైన దీపకుని శిష్యునిగా స్వీకరించినాడు వేదధర్ముడు. గురుసేవ ప్రభావం వలన తన చిత్తశుద్ధి ఏకాగ్రతల వలన అచిరకాలంలోనే దీపకుడు సకల శాస్త్రాలు నేర్చాడు. అనన్య గురుసేవా నిరతుడై ప్రకాశించాడు.

శిష్యుని విద్యాతేజస్సు చూసి వేదధర్ముడు ఒకనాడు "కుమారా! నేను పూర్వజన్మలలో చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తము చేసుకున్నాను. కానీ రెండు భయంకరమైన పాపాల ఫలము ఇంకా అనుభవించాలి. చేసిన కర్మ చెడని పదార్థముకదా. నేను అతిపురాతనము సనాతనము పవిత్రము సాక్షాత్ విశ్వనాథుని ధామమైన కాశీ క్షేత్రములో ఆ పాపాలకు ప్రాయశ్చిత్తము చేయదలచినాను. పుణ్యక్షేత్రములో ఏ కార్యానికైనా ఫలితము రెండింతలు కదా!

నేను ఆ పాపాలను ప్రాయశ్చిత్తార్థము ఆవాహన చేయగానే భయంకరమైన కుష్ఠురోగం వస్తుంది. శరీరమంతా చీము నెత్తురు కారుతుంటుంది. వికారరూపము అంధత్వము వస్తాయి. నాలో సహనం సాధుత్వం ఆది సద్గుణాలు నశిస్తాయి. కఠినాత్ముడనై ఇతరుల సేవలకై దీనముగా ఎదురు చూస్తుంటాను. అట్టి దుస్థితిలో నీవు నాకు సేవ చేయగలవా"? అని అడిగినాడు వేదధర్ముడు.

గురుసేవయే పరమభాగ్యమని త్రికరణశుద్ధిగా నమ్మిన దీపకుడు "గురూత్తమా! నేను మీ పాపాలను ఆవహింప చేసుకొని పాపఫలితాన్ని అనుభవిస్తాను. నాకా అవకాశాన్ని ప్రసాదించండి" అని అన్నాడు. "దీపకా! నీ వంశాన్నంతా దీపింపచేయగల వాడవు అలా అనక ఏమంటావు? కానీ ఎవరు చేసిన కర్మకు వారే బాధ్యులు కదా! పుణ్యమైనా పాపమైనా ఫలితమును అనుభవించక తప్పదు కదా! నా పాపాలను కడుక్కుంటే గాని ఈశ్వర సాన్నిధ్యాన్ని పొందలేను" అని వేదధర్ముడు చెప్పినాడు. గురు ఆజ్ఞప్రకారమే చేశాడు దీపకుడు. ఇద్దరు మణికర్ణికా ఘాట్ కు ఉత్తరంగా ఉన్న కమలేశ్వర మహాదేవ మందిరం వద్దకు చేరి అక్కడ బస ఏర్పాటు చేసుకున్నారు. కశీ విశ్వనాథునికి అన్నపూర్ణాభవానీకి పూజలుచేసి పాపాల ఆవాహన చేశాడు వేదధర్ముడు. గురువుగారు చెప్పినట్టే జరిగింది. గురువుగారి దుస్థితి చూసి ఎంతో బాధపడ్డాడు దీపకుడు. చీము నెత్తురు తుడిచి కట్టు కట్టి మలమూత్రాదులను కడిగి అతని శుభ్రపఱచే వాడు దీపకుడు! ప్రతిపూట దీపకుడు తెచ్చిన భిక్షను తానే తినేసి "ఇంత కొంచెం తెచ్చావెందుకు" అని నిష్ఠూరాలాడేవాడు వేదధర్ముడు. అతడెంత కోపించినా గద్దించినా ధర్మనిష్ఠతో నిరంతర గురుసేవ చేసినాడు ఆనందపరశుడై దీపకుడు.

అంబికానాథుడు దీపకుని అసమాన గురుభక్తి మెచ్చి "వత్సా! నీ అనన్య గురుసేవా దీక్షను మెచ్చినాను. ఏమి వరము కావాలో కోరుకో" అని అన్నాడు. గుణనిధి అయిన దీపకుడు "స్వామి! నాకు ఈ లోకములో గురుసేవ తప్ప ఏదీ తెలియదు. వారి అభీష్టమేమో కనుక్కొని చెప్తాను" అని అన్నాడు దీపకుడు. గురువుగారికీ విషయం చెప్పి "గురుదేవా! మీకు స్వస్థత కోరుతాను" అని అన్నాడు. వేదధర్ముడు "నాయనా! ఎవరు చేసిన పాపాలకు ఫలితం వారు అనుభవిస్తేనే పోతాయి" అని చెప్పాడు.

మరునాడు విశ్వనాథుని ఆలయానికి వెళ్ళి ఏ వరమూ కోరలేదు దీపకుడు. భగవంతుడు ఆ దీపకుని చూసి మురిసిపోయి జగజ్జనని అయిన పార్వతీదేవితో అతని విషయం చెప్పి సంబరపడిపోయాడు. తరువాత నిర్వాణ మండపములో ఉన్న శ్రీమన్నారాయణునికి సమస్త దేవతలకు దీపకుని సంగతి చెప్పి పొగిడినాడు. మహావిష్ణువు "పరమశివుని మెప్పించిన నీ గురుభక్తి అసామాన్యము. నీ మనోభీష్టమును కోరుకో" అని అన్నాడు. అందఱికీ సాష్టాంగవందనము చేసి ఆనందాశ్రువులతో "స్వామీ! నాకు అచంచలమైన గురుభక్తిని ప్రసాదించు" అని అడిగినాడు. "తథాస్తు" అని దీవించి దీపకుని కృతార్థుని చేసినాడు మహావిష్ణువు.

**పిల్లలూ! ఈ కథలోని నీతులను మరొక్కమాఱు చూద్దాము:**

౧. గురువును సేవిస్తే సకల దేవతలనూ సేవించిన ఫలితం వస్తుంది. దీపకుడు తన గురుసేవానిరతితో త్రిమూర్తుల సమస్త దేవతల అనుగ్రహాన్ని పొందినాడు.
౨. కర్మ పాశం తెగనిది. పాపకర్మలకు ప్రాయశ్చిత్తము ఎంత ఘోరముగా ఉన్నదో మనము ఈ కథలో చూచినాము. కావున పాపకర్మలెన్నడు చేయరాదు.